## దిట్టమైన కట్టడాలు: ప్రఖ్యాత నిర్మాణములు-1










బలానికి, నాణ్యతకు వారధి

# శంకర్ సిమెంట్

పర్వతంలాంటి శాశ్వతమైన నిర్మాణానికి సాటి




ఐ.ఎస్.ఐ ప్రమాణ చిహ్నంచే పూచీ ఇవ్వబడింది




**ఇండియా సిమెంట్స్ లిమిటెడ్, ధన్ బిల్డింగ్, మద్రాసు-2**

23 ఏండ్ల పైబడి పేరు పొందినది — ఇంకను విస్తరిల్లుచున్నది.

ఉచిత సాంకేతిక సలహాలకు ఈ క్రిందివారికి వ్రాయండి: సిమెంట్ సర్వీస్ బ్యూరో, 'ది గ్రోవ్', మద్రాసు-18

# ఉత్తరాలు

## కథలు

'గాలిదోషం' కథానిక చదివిన తర్వాత ఉత్తరం వ్రాయాలనిపించింది. విజ్ఞానాన్ని హాస్యంతో మేళవించిన రచయితగారి తీరు ప్రశంసార్హంగా ఉంది.

'గాలిదోషం' పై జన బాహుళ్యపు అభిప్రాయం ఎలా ఉంటుందో తెలియదుకాని ఇంజనీరింగు కళాశాల విద్యార్థులమైన మాకు ఇటువంటి రచనలు దొరకటం అరుదు.

—మల్లాది లక్ష్మణ శాస్త్రి [నాగపూరు

* * *

'స్నేహఫలం' కథ చదివి ఈ ఉత్తరం వ్రాయాలనిపించింది. స్నేహమునకు తగిన ఫలం విజయనుండి అనూరాధకు, అనూరాధనుండి విజయకుమొట్టింది మంచితనానికి వంచన విజయలాంటి వికలాంగులకు ప్రతిచోటా కలుగుతూనే వుందేమో? అనూరాధ లాంటి అభాగ్యులకది గొడ్డలి పెట్టులా చిత్రించారు రచయిత్రి. కథానంతరము కన్నీరు నింపని హృదయ ముండదు.

—శ్రీమతి బొండాలక్ష్మీదేవి, [విశాఖపట్నం]

* * *

3—7—70, మీ పత్రికలోవున్న, శ్రీ శ్రీపతి దత్తాత్రేయ శర్మగారి "భగవానుని పాదాలు", కథ చాలా బాగుంది. కాని ఒక విషయం చాలా బాధ ప్రాయంగావుంది. హిందూ సమాజంలోని వ్యక్తుల్ని పాత్రలుగా చిత్రిస్తూ, కథంతా ఏసుక్రీస్తు పాదాల మీదనే వ్రాయడం ఏమి బాగాలేదు. అది హిందూమతానికి అవమానం. అలా కాక క్రయిస్తవ సమాజంలోనివ్యక్తుల పేర్లను పాత్రలుగా వుపయోగిస్తే చాలా బాగుండేది. ఇలా హిందూ మతాన్ని అవమాన పరిచే కథలు ప్రచురిస్తూ పత్రికకు వున్న అభిమానుల్ని పోగొట్టుకోవలదని ప్రార్థన. ఇలా వ్రాశానని నేను మతోన్మాదిని అనుకోవద్దు. అన్ని మతాలు సమానమే. కలగా పులగం చేసి ఒక మతాన్ని అవమానించటం మంచిదిగాదు.

——సి. యస్. కుమార్ [అహమ్మదాబాదు [

* * *

"అత్తగారిలావుంటే" అనుకథ చాలాబాగుంది. కోడలు మీద అధికారంచూపి, ద్వేషించే అత్తలకు కనువిప్పు కలిగిస్తుంది. "మేమూ ఒకనాటికోడళ్లమే కదా"! అనే సత్యాన్ని అత్తలందరూ గుర్తించి, కోడళ్లను ఆదరించాలనే నీతిని యీకథ ద్వారా అందించారు రచయిత.

—కే. వి. రఘురామమూర్తి. [గుంటూరు]

* * *

5—6—70 వ తేదీ సంచికలోని 'తిమింగిలగిలం' బాగుంది. కాని రచయిత తనకు అర్థంకాని మాటలను కథలో ఉపయోగించుకోకుండా ఉంటే బాగుండేదేమో! ఉదా: 'ఎల్లుండి కాని జీతాలు రావ్, రేపు పాలకో పెళ్ళాం చెవిలో సోషలిజాన్ని వల్లించాడు మొగుడు. [ఇది 28 వ పేజీలో ఉంది] ఆ 'మొగుడు' అన్న దాంట్లో సోషలిజము ఏముందో అర్థం కాదు మరి. అంతేకాక యిలాంటి కథలు [అసందర్భంగా మాటలు ఉపయోగించ బడిన కథలు] తెలుగు నేర్చుకొన్న ఆంధ్రేతరులు చదివి, విమర్శించటం మొదలెడితే తెలుగు వారికి ఎంత చిన్నతనంగా ఉంటుందో గూడ రచయితలు దృష్టిలో ఉంచుకుంటే ఎంతో మంచిదని నా అభిప్రాయము.

. ఎ. సీతారామయ్య, లక్నో, [ఉ. ప్ర.]

* * *

డాక్టర్ నళిని మోహన్‌గారూ, స్వర్గంలో విశేషాలు ఇంకాసిని రాయండి సార్, ప్లీజ్!

పి. ఎస్. నారాయణ, [హైదరాబాదు]

## సీరియల్

నలుగురు రచయిత్రుల సంయుక్త రచన "అపరాజిత" గొలుసు నవల ఎంతగానో మమ్మల్ని ఆకర్షించిందని వ్రాయటానికి ఎంతో సంతోషంగా వుంది' ముఖ్యముగా "మాధవి" పాత్ర మరువరానిది. మాధవికి అన్యాయము చేయకుండా ముగిస్తే చాలా బావుంటుంది. పత్రిక ద్వారా నలుగురు ప్రఖ్యాత రచయిత్రులకు మాధన్యవాదాలు తెలియచేయవలసిందిగా కోరుతున్నాను.

శ్రీమతి కె. శారదారాజు.
శ్రీమతి కె. రోజీ కేన్.
శ్రీమతి. కె. పాపావెంకటేశ్వర్
[బొంబాయి.]

'అపరాజిత' నలుగురు రచయిత్రుల సంయుక్త రచన గొలుసు నవల చాలా బాగుంది, ఏ రచయిత ఎక్కువ బాగా రాశారు అని ఆలోచిస్తే ఏ ఒక్కరూ తీసిపోలేదు. పేరుకుతగ్గ కథ, మాధవి జీవితం చాలా బాగా చిత్రించారు. నవయువస్త్రీలకు ఉదాహరణగా, రాధ జీవితాన్ని చిత్రించారు. రాధకే దక్కింది ఆఅదృష్టం, మధు చేరదీయడం, ఆదరించడం చాలా బాగా నడిపించారు. రాజారావునికూడా, చాలాబాగా చిత్రించారు.

—బి. అనంతలక్ష్మి. [అమలాపురం]

* * *

"అపరాజిత" సీరియల్ నవల మొదటినుండి చాలా ఆసక్తిగా చదువుతున్నాను. కాని ముగింపు చూచి చాల బాధ కలిగింది. మాధవి పాత్ర చాల బాగుంది. కాని మాధవి జీవితము ఎండమావులు మాదిరి అయినది. "మమత" చాల బాగుంది. "స్నేహఫలం" కథ చదువుతుంటే విజయపాత్ర చాల బాధ పెట్టినది. పై బొమ్మ భానురేఖ చాల అందముగా నున్నది.

—ఘంటసాల ఉష, [మద్రాస్]

* * *

ఈ వారం మొదలైన సీరియల్ [వద్దనుకుంటూనే] చదివి మాకు తెలీకుండానే గాఢంగా నిట్టూర్చాము. అదే పత్రికలో మీ ప్రకటనను [కొత్త సీరియల్ గురించి] చూడగానే మా బాధ ద్విగుణీకృతం అయింది. ఆ యిద్దరు రచయిత్రులంటే వ్యక్తిగతంగా మాకేలాంటి విరోధమూ లేదు కానీ....వరసగా కొన్నేళ్ళనుంచి వీరిద్దరి రచనలు చదివి....చదివి [ఒక్క మీ పత్రికలోనే సుమండీ] మహా బోర్ కొట్టింది. ఒకటే శైలి.... ఒకటే కథావిధానం... కొత్తదనం ఏమాత్రం లేక పోగా, ఒకటే రకమైన పోకడలతో మమ్మల్ని చంపేస్తున్నారు. మా సహనాన్ని పరీక్షిస్తున్నారు. వారి రచనల ద్వారా ఏం చెప్ప దల్చుకున్నారో..., ఎటువంటి సందేశం యివ్వదల్చుకున్నారో—, ఆభగవంతుడికే తెలియాలి. మమ్మల్ని వుర్రూతలూగించే... సందేశాత్మకమైన మంచి సీరియల్స్ మా అభిమాన పత్రికలో చదవాలనుకునే మా కోరిక నెరవేరే దెప్పటికో.....? [ఈజన్మకు అటువంటి ఆశలేమీ పెట్టుకోవద్దంటారా...?]' మాబాధను కొంచెం అయినా అర్థం చేసుకో కలిగితే మాతోపాటు మాలాంటి కొన్ని వందలమంది పాఠకుల్ని బ్రతికించిన వారవుతారు.

క్షమించండిసార్.. ఒకచిన్న సందేహం....కొందరు సినిమా నటులకూ.... కొన్ని సంస్థలకు.....'అగ్రిమెంట్లున్నట్లే....మీకూ .... వారికీ ... అలాంటి దేమైనా.........?

ఈవుత్తరం ప్రచురించ గలిగితే చాలా .. చాలా సంతోషిస్తాము.

—మాధవీలత అండ్ అరుణప్రభ స్నేహబృందం
మెడికోస్, [కాకినాడ]

* * *

# ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక

## కొత్తరకం పోటీ!

# 1970 దీపావళి కథలపోటీ!!

# రు. 5000 బహుమతులు

## ఇంకా ఇతర ప్రత్యేక బహుమతులు!!

ఈ ఏడు దీపావళి కథలపోటీని సరికొత్తరకంగా నడపటానికి నిశ్చయించుకున్నాము!

ప్రతి సంవత్సరం మూడు కథలకి మూడు బహుమతులు ఇస్తున్నాము.

ఏ కథలు ఉత్తమమయినవో మేమే నిర్ణయిస్తున్నాము.

**ఈ ఏడు ఈ పద్ధతులని మార్చివేస్తున్నాము! ఈ ఏడు దీపావళి కథలపోటీకి వచ్చిన కథలలో పదింటిని (10ని) ఉత్తమ కథలుగా ఎన్నుకుంటాము. ఈ కథలలో ఒక్కొక్కదానికీ రు. 500 బహుమతిచొప్పున ఇస్తాము. ఈ బహుమతుల పంపిణీ బాలట్ నిర్వహణకి ముందే జరుగుతుంది. ఉత్తమకథలుగా ఎన్నికఅయిన 10 కథలనీ దీపావళి ప్రత్యేకసంచికలో మొదలుపెట్టి వరుసగా ప్రచురిస్తాము. వీలునిబట్టి సంచికకి మూడు నాలుగు కథలు వేస్తాము. ఈ 10 కథలు ప్రచురించే వరుసని లాటరీద్వారా నిర్ణయిస్తాము. అంటే ఒక కథ ముందు పడినంత మాత్రాన అది తర్వాతపడిన కథలకన్నా ఉత్తమమయినదనే సూచన ఉండటానికి అవకాశం ఉండదన్నమాట.**

### పాఠకుల నిర్ణయం: బాలట్

పయిన చెప్పిన విధంగా అచ్చుఅయిన 10 కథలలో ఏవి ఉత్తమమయినవో పాఠకులే నిర్ణయించటానికి ఒక బాలట్‌ని ఏర్పాటుచేస్తాము. పాఠకులకి ఈ బాలట్ ఆసక్తికరంగా ఉండేందుకు, బాలట్-పోటీని ఒకదానిని కూడా నెలకొల్పుతాము. ఈ పోటీ వివరాలు బాలట్ ప్రకటనతోబాటు, 10 కథల ప్రచురణ పూర్తిఅయిన తర్వాత, ప్రచురిస్తాము! పాఠకుల ఎన్నికప్రకారం మొదటి మూడు ఉత్తమకథలుగా నిర్ణయింపబడ్డ కథలకి మళ్ళీ ప్రత్యేక బహుమతులని ఏర్పాటు చేస్తాము. ఈ బహుమతుల వివరాలు బాలట్ ఫలితాలతోబాటు వెల్లడిస్తాము. రచయితలందరూ మాతో సహకరించి ఎప్పటిలాగే ఈ సంవత్సరం దీపావళి కథలపోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

### నిబంధనలు

1. కథలు ఇంతకుముందు ప్రచురణకాని స్వంతరచనలై ఉండాలి. ప్రతికథతోనూ రచయిత అది తన స్వంతరచనేనని, దేనికీ అనువాదం కానీ, అనుసరణకానీ కాదని హామీ రాసి పంపాలి. ఈ హామీలు వేరే కాగితంమీద కాకుండా కథ వ్రాతప్రతిమీదే రాసి ఉండాలి.
2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.
3. వ్రాతప్రతిమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒకవైపుమాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామాకూడా వ్రాతప్రతిమీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్‌బుక్‌కి రెండుపేట్లు) పేజీలకి మించరాదు.
4. కవరుమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్రవార పత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్ మదరాసు-1'కి పంపాలి
5. పోటీ గడువుతేదీ 31-8-'70. ఆ తర్వాత మా కార్యాలయానికి చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.
6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా వెలువడే 30-10-70 తేదీకల ఆంధ్ర సచిత్రవార పత్రికలో ప్రారంభించి వరుసగా ప్రచురిస్తాము.
7. 10 ఉత్తమ కథల ఎన్నికకి సంబంధించిన తుది నిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకునిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపటానికి వీలు ఉండదు.
8. బాలట్‌తోబాటు ఎటువంటి పోటీ నెలకొల్పబడినా ఆపోటీకి సంబంధించిన తుది నిర్ణయాలన్నీ ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడివే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలు జరుపటానికి వీలు ఉండదు.
9. కథల వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపటానికి సాధ్యంకాదు. (అందుచేత కథలపోటీలో పాల్గొనే వారు తపాలాబిళ్ళలు అతికించిన స్వంత చిరునామాకల కవర్లు పంప నవసరంలేదు.)
10. పోటీలకి సంబంధించిన ఏ విషయం గురించి ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించేముందు తెలుపుతాము.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 31—7—'70

[శ్రీసాధారణనామ సం॥ ఆషాఢ మా॥ బహుళ త్రయోదశి]

సంపుటము : 63 సంచిక : 46

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |




విషయానుక్రమణిక



# ఉత్తరాలు

29.5.70వ తేదినాటి పత్రికలో ప్రవాసిగారి వ్యాసం, 3—7—70వ తేది పత్రికలో లక్ష్మణ రావ్ గారి జవాబు![?] చదివాను. నేను కూడా ప్రవాసినే కాబట్టి, నా అభిప్రాయాలు వెలిబుచ్చుతున్నాను.

శ్రీ రావుగారి అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నానని మొదట చెప్పవలసి ఉంటుంది. ఐదు సంవత్సరాలుగా ఉత్తర ప్రదేశ్ రాజధాని ఐన లక్నోలో ఉంటూ, ఇక్కడి తెలుగువారితో తరచూ కలసి మాట్లాడుతూ ఉండటం వల్లా, వారి జీవిత విధానాన్ని పరిశీలించటం వలన ప్రవాసాంధ్రుల గురించి నాకూ కొంత తెలుసు. తెలుగువారు ఎప్పుడూ తెలుగువారిని కలుసుకోవాలనీ, వాళ్ళతో మాట్లాడాలనీ కుతూహలం చూపుతారు. కొత్తగా లక్నోకు వచ్చిన తెలుగు వారికి సహాయం చెయ్యటానికి అంతకుముందు నుంచీ అక్కడ ఉంటున్నవారు ఎప్పుడూ ఉత్సాహం చూపుతూనే ఉంటారు. బజారులో ఎప్పుడైనా తెలుగుమాట వినబడితే, ఆ మాట్లాడేవ్యక్తిని సమీపించి, పరిచయం చేసుకొని, తమ యింటికి ఆహ్వానించే తెలుగు వారు నాకిక్కడ ఎంతో మంది తెలుసు. అసలు ఇక్కడి తెలుగువారికి నా పరిచయం కూడా అలాగె జరిగింది.

లక్నో ఆంధ్రా అసోసియేషన్, ఆంధ్రనుండి ప్రసిద్ధ కూచిపూడి నాట్య కళాకారులను ఆదరించింది. సంగీత విద్వాంసులను పిలిపించి నగరంలోని తెలుగువారికి వారి సంగీతం వినే అదృష్టం కలిగించింది. తెలుగువారంతా కలుసుకోడానికై తెలుగు సినిమాలు తెప్పించడం, పిక్‌నిక్‌లు ఏర్పాటు చెయ్యటం, త్యాగరాజ వర్ధంతి జరపటం....... ఇలాంటి కార్యక్రమాలను వీలైనంత క్రమబద్ధంగా జరుపుతుంది.

తాము చేసే ఏపని ద్వారానైనా తమరాష్ట్రంపై అక్కడి ప్రజలపై, ఒక అభిప్రాయం ఏర్పడుటకు వారికి కలుగుతుంది గాబట్టి, తమిళులు, బెంగాలీల లాగానే తెలుగువారు కూడ ఇక్కడి ప్రజలతో కలసి మెలసి మెదలు తారు. కాని తను వ్యక్తిత్వాన్ని తెలుగుతనాన్నీ మరచి పోతారని, ప్రవాసిగారు ఆరోపించిన విధంగా మాత్రం నేనేమీ ఇప్పటి వరకు యిక్కడి తెలుగు ప్రజలనుండి గ్రహించ లేదు. నిజం చెప్పాలంటే ఆంధ్రనుండి, తెలంగాణ ప్రవాసాంధ్రులకున్నంత ప్రేమాభిమానాలు ఆంధ్రలోనే ఉంటున్న తెలుగు వారికే లేవని చెప్పగలను. తెలుగువ్యాప్తికి మేము చేసే కృషి ప్రార్థనలు వారు చేయటం లేదు. ఆంధ్రలో జరుగుతున్న ప్రాంతీయ యుద్ధం వలన మేము పడే అవమానాలు ....అవి ప్రవాసాంధ్రులకే తెలుసు.

—సీతారామయ్య. [లక్నో]

● ఇంతటితో ఈ వస్తువు మీద ఉత్తర ప్రత్యుత్తరాలని ఆపివేస్తున్నాము. — సం॥

* * *

నేడు మనదేశం ఎదుర్కొంటున్న సమస్యలలో మత సమస్య ముఖ్యమైనది. మతకలహాలు జరిగినప్పుడు మన నాయకులు ఉపన్యాసాలివ్వడం తప్ప వానిని నివారించుటకు తగిన ప్రయత్నములు చేయుట లేదు.

భారతదేశము "సెక్యులర్ స్టేట్"—మత ప్రసక్తి లేని రాజ్యము. కానీ, ఇది ఆచరణలో ఎంత వరకు నిజం—?

మనదేశములో మతకలహాలు జరుగుటకు దేశానికి వెన్నెముక వంటి వారైన విద్యార్థులలో, యువకులలో పరమత ద్వేషం ఎక్కువగుటకు బాధ్యత ప్రభుత్వానిదే. ఉదాహరణకు. కాలేజీల యందు ప్రవేశం విషయంలోను, స్కాలర్‌షిప్‌ల విషయంలోను, ఉద్యోగాల విషయంలోను, ప్రభుత్వము వెనుకబడిన జాతులవారికి కొన్నింటిని రిజర్వు చేసి, వెనుకబడిన జాతులవారి యందు అర్హులైన అభ్యర్థులు లేకున్నను, ఇతర జాతులందు జన్మించిన వారిలో ['అగ్రవర్ణములు'గ పరిగణింపబడుచున్న వారిలో] తగిన అభ్యర్థులున్నను, వెనుకబడిన జాతులవారికి ఇచ్చుచున్నారు ఇచ్చట గమనించవలసిన విషయం—వెనుకబడిన వారికి తగిన ప్రాధాన్యత లభించుటలేదు కానీ, వెనుకబడ్డ జాతి లేక కులంలో జన్మిస్తే చాలు.

అర్హతలేని వ్యక్తికెందుకు ఉన్నత చదువులు, ఉన్నతోద్యోగములు? విద్యలో తమకన్న తక్కువ స్థాయి విద్యార్థులకు, వెనుకబడిన కులమందు జన్మించినందున, అధిక ప్రాధాన్యత చూపబడినప్పుడు, తెలివైన విద్యార్థులలో కలిగే నిరాశా నిస్పృహలే, వారిలో పరమత విద్వేషాన్ని రగిలిస్తాయి.

ఈ మత విషయం వలన ఆర్థికముగా వెనుకబడ్డ బ్రాహ్మణులు, ముస్లిములే అనేక కష్టనష్టాలకు గురి యగుచున్నారు. ఏ వ్యక్తి మాత్రం తనకు, తన కులానికి అన్యాయం జరుగుతుంటే ఎంత కాలమని సహిస్తాడు?

ప్రభుత్వము ఈ విషయం గమనించి బ్రాహ్మణులను, ముస్లిములను కూడా వెనుకబడినవారిగా గుర్తించాలి. వారికి కూడా వెనుకబడిన జాతుల వారితో సమానముగా సౌకర్యాలు కలుగజేసి, ఆర్థిక అసమానతను తొలగించాలి. ఆర్థికముగా వెనుకబడిన వారికి, మెరిట్ ననుసరించి, కాలేజీలలో ప్రవేశంగానీ, ఉద్యోగాలివ్వడంగానీ జరుగాలి. ఈ విధంగా చేయుడం వలన విద్యార్థులలో, యువకులలో ఐక్యమత్యం పెరుగుతుంది. దేశానికి ఉడుకు రక్తం పొంగి పారలే విద్యార్థులు, యువకులే శ్రీరామరక్ష! వంటివారు. మహారాష్ట్రలో జరిగిన మతకల్లోలాలు ఇతర ప్రదేశములకు వ్యాపించకుండా, మళ్ళీ దేశంలో ఎక్కడా మతకలహాలు జరుగకుండా వుండాలంటే, తీసికొనవలసిన ముఖ్య ప్రాథమిక చర్య ఇది.

యస్. సత్యనారాయణ [కడప] ●


ఇండియాని రక్షించండి
కష్టాల్లో ఉన్న మరో కరిరాజు




చచ్చిందా లేక దొంగెత్తా?
ఆంధ్రప్రదేశ్‌లో నక్సలైట్ల వరద


మెదడుకి మేత
యు.పి. మున్సిపల్ ఎన్నికలలో మతవాదులకి ముస్లిమ్‌లు వోటు చేశారు


రాజకీయ వాతావరణం
చేరువవుతున్నారు

శ్రీకృష్ణ

# పార్టీల కుతంత్రాలకి బలిఅవుతున్న భారతదేశం

ఈ వారం విశేషాలు: న్యూఢిల్లీకి సోవియట్ మంత్రి శ్రీ ఫిర్యూబిన్ అనుకోకుండా రావటం, శ్రీ జార్జి ఫెర్నాండెజ్ వామ పక్షాలన్నీ కలవాలనటం సోషలిస్టు పార్టీలు '5 పాయింట్ల' కార్యక్రమాన్ని అమలు పరచటానికి ఉద్యమం లేవదీసి కమ్యూనిస్టులని అనుకరించాలనుకోనటం ఈ '5 పాయింట్లు' ఏమిటంటే [1 అదనం భూములని పంచటం, భూమ్యాస్తి పరిమితిని తగ్గించటం 2] ఉద్యోగం కోసే హక్కుని ప్రాథమిక హక్కుగా గుర్తించటం 3] ఆదాయం, వ్యయాలని రు. 1500 లకి పరిమితి చెయ్యటం, 4] ఇళ్లు లేనివారిని ఇళ్లు ఇప్పించటం, 5] వోటింగు వయస్సుని 21 నుంచి 18 కి తగ్గించటం.

కమ్యూనిస్టు పార్టీ పత్రిక 'న్యూఏజ' 50,000 ఎకరాలని తీసుకొని పంచటం జరిగిందని రాసింది. "భూమి ఆక్రమణ ఉద్యమం బాగా మొదలయింది. ఎనిమిది రాష్ట్రాలలో భూముల ఆక్రమణ ప్రారంభం అయింది. వానలు పడిన తర్వాత తక్కిన రాష్ట్రాలలకి కూడా ఉద్యమం మొదలవుతుంది.

"ఇటువంటి పెద్ద ఉద్యమం స్వతంత్ర భారతదేశంలో ఇంతకిముందు జరగలేదు.

"మొదటి మూడు రోజులలో 50,000 ఎకరాలని లోబరుచుకున్నారు. పశ్చిమ బెంగాలులో 25,000 ఎకరాలు, ఒరిస్సాలో 17,000 లోబరుచుకుని మొదటి రెండు స్థానాలనీ ఈ రెండు రాష్ట్రాలూ పొందాయి.

"జూలయి 1 నాడు అన్ని రాష్ట్రాలలోనూ పెద్ద ప్రదర్శనలు జరిగాయి. కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి రాజేశ్వరరావు స్వయంగా తామే సాహ్రత్ గర్‌లో [బస్తీ జిల్లాలో] ఒక పెద్ద వూరేగింపుని నడిపించారు.

"ఇప్పటికి 1000 మందికి పయిగా అరెస్టు చేశారు. ఉద్యమంలో నిరసన ప్రదర్శకులని చేసిన వారిని కొందరిని నిర్బంధించారు. మరికొందరు ప్రభుత్వంవారి బంజరు భూములని ఆక్రమిస్తూ ఉంటే వారిని పట్టుకున్నారు."

కమ్యూనిస్టులు, మహమ్మదీయ వక్ఫ్ భూములు అలయ మాన్యాలనీ కూడా చేజిక్కించుకుంటారని ఢిల్లీలో అనుకుంటున్నారు. ఈ రకం మాన్యాల సొంతదారులు స్వయంగా పొలంలో పని చేసుకోరు కదా!

ఇదంతా ఇలాగ ఉంటే, శ్రీ మొరార్జీదేశాయి గారు తమ పెద్ద మిత్ర మండలి గురించి కృషి చేస్తూ ఉన్నారు కాంగ్రెసు అధ్యక్షులు తమ నోరు ఎంత దాకా తెరవగలరో రుజువు చేశారు. పాత కాంగ్రెసువారు తమ బస్సు తప్పారు. ఒక వయిపు మహాత్మాగాంధి గురించి మాట్లాడుతూ మరొకవయిపు మేడమ్ ఇందిరాగాంధి కాంగ్రెసు వన్నా వామపక్షంగా మాట్లాడుతారు. అసలు పాత కాంగ్రెసువారి మిత్రమండలి ఇబ్బందులలో ఉంది. శ్రీ ఎస్. కె. పాటిల్, శ్రీ నిజలింగప్పలు ఒక రకంగా ఉపన్యాసాలు చేస్తున్నారు. శ్రీయుతులు మొరార్జీ దేశాయి, జార్జి ఫెర్నాండెస్‌లు వేరేవిధంగా చర్చలు జరుపుతూ 'మిత్రమండలి' పథకానికి పోలికలగిస్తున్నారు. న్యూఢిల్లీలో జరిగిన పాతకాంగ్రెసు సమావేశంలో కమ్యూనిస్టులకి ప్రతిపక్షంగా ఒకపార్టీ తయారు చేయాలనే ఉద్దేశం బయటపడింది. ఈ పార్టీ ఒక విధంగా అమెరికాలోని రిపబ్లికన్‌పార్టీ, బ్రిటన్‌లోని కన్సర్వేటివ్ పార్టీలాగ ఉంటుందని కొందరు అనుకున్నారు. ఈ వూహని శ్రీయుతులు రాజగోపాలాచారి, వాజపేయిలు బలపరచారంటే ఈ పార్టీలో కమ్యూనిస్టులు, వారి అనుచరులకి తావు లేదనే కదా అర్థం. శ్రీ దేశాయి జార్జి ఫెర్నాండెస్‌తో మంతనాలు జరపటం ఈ రకం ఉపాయాలకి విరుద్ధంకదా? ఇక స్వతంత్రపార్టీలో చేతులు కలుపుదామంటే గుజరాత్‌లో కాంగ్రెసు పార్టీ వారికి నచ్చదు. పాత కాంగ్రెసులో అతుల్యఘోష్, నిజలింగప్ప, మొరార్జీదేశాయి ఉన్నంత కాలం ఆ పార్టీకి భవిష్యత్తు లేదని కొందరు అంటారు. వారు తమ దృక్పథాలు మార్చుకోరు, చిన్న వయస్సువారికి అవకాశాలు ఇవ్వరు—వారు ఇక ఎక్కువ కాలం నిలవలేరు, వారి పార్టీ కూడా అంతే అంటారువారు.

## భారతదేశం పట్ల రష్యా భక్తి...

ఇటీవల మేడమ్ గాంధిగారు జర్మన్ ఇంటర్నేషనల్ వార్తా సంస్థతో ఇంటర్‌వ్యూ ఇస్తూ—భారతదేశం మాస్కో వయిపుకి మొగ్గలేదనీ, మాస్కోయే భారతదేశం వయిపుకి మొగ్గిందనీ అన్నారు. సోవియట్ ఉపమంత్రిగారు ఇటీవల భారత దేశానికి వచ్చారంటే వయి వ్యాఖ్యకి మరొక ఆధారం అనవచ్చునన్నమాట. ఆయన [శ్రీ ఫిర్యూబిన్] భారత దేశానికి వచ్చేముందు వియత్నామ్, కాంబోడియాలకి వెళ్లివచ్చారు. ఇక భారతదేశం ఏమి శాసిస్తుందో వచ్చి తెలుసుకుని శిరసావహిస్తారన్నమాట.

కొంతకాలంక్రితం రెండు పెద్దదేశాలనాయకులు భారతదేశం, మారిషస్ దేశాల నాయకులు—పోర్ట్ లూయిస్ అనేచోట కలిసి ఇండియా మహా సముద్రంలో విదేశాల పెతనం లేకుండా చూస్తామని గంభీరంగా ప్రకటించారు. [ఈనాయకులలో ఒకరయిన శ్రీ రామ్ గులామ్ రష్యాతోఒక ఒప్పందం చేసుకున్నారు. ఈ ఒప్పందం ప్రకారం రష్యాకి మారిషస్‌లో కొన్ని సౌకర్యాలు ఉంటాయి. ఇదంతా మారిషస్ సంగతి. భారతదేశం సంగతి ఏమిటి? రష్యా భారతదేశానికి విదేశం కాదేమో! భారతదేశం సహాయం కోసం రష్యా కృషి చేస్తున్నదేమో. అసలు రష్యా విదేశమని ఎవరన్నారు? ఆగ్నేయ ఆసియాలో విదేశ సేనలు ఉండరాదనీ, ఉన్నవన్నీ ఖాళీ చెయ్యాలనీ అ. బా. కాం. సం. సమావేశంలో అధ్యక్షులు శ్రీ జగజీవనరామ్ అన్నారు. చెకోస్లొవాకియాలో రష్యా సేనలు ఉండరాదని వారు అన్నారా? శ్రీ డూబ్‌చెక్‌ని చెక్ కమ్యూనిస్టుపార్టీనుంచి తరిమివేసినప్పుడు వారు అభ్యంతరం తెలిపారా? చెకొస్లొవాకియాలో జరుగుతున్న నిరంకుశ విదేశ పాలన ఎటువంటిదో అందరికీ తెలుసు.]

## శ్రీ డాంగే కోరిక?

రేపు భారతదేశంలో శ్రీ డాంగేకి ఇష్టంలేనిది ఏదయినా జరిగితే ఆయన రష్యా సేనలు రావాలని కోరుకుంటే?

ఈ ప్రశ్న అంత అసందర్భమయినదికాదు. రష్యా ఉపమంత్రి హఠాత్తుగా భారతదేశం వచ్చారు. మన ప్రధానమంత్రి వారితో కంబోడియా గురించి మాట్లాడారనే వార్తలు వెలువడ్డాయి. మేడమ్ గాంధిగారి కాంగ్రెసు కంబోడియాలో ఏ దేశానికీ చెందిన సేనలూ ఉండరాదని అన్నది. కాశ్మీరుసమస్య కూడా చర్చింపబడ్డదని కొన్ని పత్రికలు అన్నాయి.

...త కాంగ్రెసు ఎన్నిక పథకాలని కూడా శ్రీ షెరూ[illegible]
చివ్ చర్చించారేమో! మేడమ్‌గాంధిగారి ప్రభుత్వం పడగొడ్తేగాని భారతదేశంలో ప్రజాస్వామ్యం నిలవదని శ్రీ కామరాజా అనే అన్నారు. మేడమ్ గాంధిగారి ప్రభుత్వం నిలవదంటే రష్యా నాయకులకి ఆందోళన కలిగించక మానదుకదా?

అమెరికా రాయబారికాని, మరెవరయినా పాశ్చాత్య దౌత్యవర్గపు అధికారిగాని ఏదయినా చిన్న ఉపన్యాసం చేస్తే కమ్యూనిస్టులు [వారి సహచరులు] విరుచుకు పడ్తారు. అదే మాస్కో రేడియోవంటివి భారతదేశం సమాజం స్వరూపాన్నే మార్చాలని ప్రచారం చేస్తే ఎవరూ పట్టించుకోరు. ప్రావ్దా మన విధానాలు ఎలా ఉండాలో సంపాదకీయాలలో చెప్తూ ఉంటుంది. ప్రధానమంత్రి అన్ని అధికారాలూ చేజిక్కించుకోవటం ఎవరికి మంచిదో ఆలోచించాలి....

## శ్రీ జగజీవనరామ్ ఆరోపణ

మా విలేఖరి అనుకున్నంత పనీ చేశారు. రక్షణ శాఖమంత్రి బాబూ జగజీవనరామ్‌గారు. ఆయన సైన్యంలో కూడా కులతత్వం ఉందన్నారు. 1857 లో జరిగిన సైనికుల తిరుగుబాటు కులతత్వంవల్లనే జరిగిందన్నది లోక ప్రసిద్ధమే.

కుల సిద్ధాంతాలనీ, తత్వాన్నీ నేను బలపరచటం లేదు కాని అసలు భారతదేశంలో కుల విబేదాలని రెచ్చగొట్టి వినియోగించుకున్నది ఎవరు? కాంగ్రెసు పార్టీ కాదా? ఏ టెలిఫోన్ డయిరెక్టరీని చూసినా చాలు భారతదేశంలో మతాభిమానాలు ఇంకా ఎంత గాఢంగా నాటుకునిపోయిఉన్నాయో...

శ్రీ జగజీవన్‌రామ్ ముందు కాంగ్రెసు పార్టీలో కుల విబేదాలని పోగొట్టి తర్వాత సైన్యంలోని కుల తత్వాన్ని ఖండిస్తే బాగుండేది. శ్రీ జగజీవన రామ్ తపాలా, తంతి శాఖలమంత్రిగా ఉన్నప్పుడు ఎందరు అనర్హులయినవారిని షెడ్యూల్డ్ తరగతుల మిషతో ఉద్యోగాలలో చేర్చి ఎంత హానికి కారకులయారో అని అంతకిముందే మా విలేఖరిఅన్నారు. ఇంజన్ డ్రయివర్లుగా ఎందరో అర్హతలేని వారిని షెడ్యూల్డ్ తరగతుల వారనే మిషతో ఉద్యోగాలలో వెయ్యటంవల్ల ఎన్ని ప్రమాదాలు జరిగాయో పరిశోధించి చూడాలి.

భారతదేశ స్వాతంత్ర్యాన్ని కాపాడేది భారతదేశ సైన్యం. దానిని రాజకీయాలలోకి దింపి చెడగొట్టటం మంచిదికాదు. ●







# మనస్సాక్షి

శ్రీమతి మంచాళ శ్రీలక్ష్మి

పెండ్లిపందిరి పండు ముత్తైదువలతో, పట్టుచీరల గరగరలతో, కన్నెపిల్లల కమ్మని కోర్కెల ప్రతిరూపంగా హడావుడిగా ఉంది.

'అందరూ తమ తమ హడావుడిలో ఉన్నారు' మనలను గమనించడం లేదని అనుకుంటున్న వధూవరు లిద్దరూ ఒకరినొకరు వీక్షించుకుంటూ, మధుర మందహాసాల నొలికించు కుంటున్నారు. వారి శిరస్సులనుండి జారుతున్న తలంబ్రాలు, మెర్క్యురీలైట్ల వెలుగులలో ముత్యాల జల్లు వెల్లి విరుస్తున్నట్లుగా ఉంది.

ఈ హడావుడికి దూరంగా చెంపన చెయ్యి చేర్చుకుని ఏదో దీర్ఘాలోచనలో ఉన్నది కమలమ్మ. 'వధూవరు లిద్దరూ రతీ మన్మథుల్లా ఉన్నారు. తమ ఆశలకు ప్రతిరూపం అయిన పాపకు పెండ్లి ఎలా చేశాము? చాలా క్లుప్తంగా ఏ ఆర్భాటమూ లేకుండానే జరిగిపోయింది. భగవంతుడు చల్లగా చూడలేదుగానీ. ఇంత వైభవంగానూ జరగవలసిందే గదా! అందుకే తను ఏ పెళ్ళిళ్ళకూ రాదు. కానీ మీనాక్షి పట్టుదలవల్ల అక్కతో రాక తప్పలేదు. ఏనాటి మీనాక్షి? స్నేహాన్ని అంత మధురంగా మనస్సులో దాచుకోగల్గిన వ్యక్తియొక్క స్నేహం తనకు లభించింది. అక్క పెళ్లిలో మగపెళ్ళివారి తరపున పరిచయమైన వ్యక్తి. చాలా దూరపు చుట్టరికం. ఇన్నేళ్ళనుండి అక్కద్వారా క్షేమ సమాచారాలు తెలుసుకోవడం, అరుదుగా ఎప్పుడో కలుసుకున్నాగానీ అరగంటకంటే ఎక్కువగా మాట్లాడు కోవడానికి వీలేకపోవడంతో, ఇన్నేళ్ళకి తనకొడుకు పెండ్లికైనా వస్తే కనీసం రెండు మూడు రోజులైనా మనం కలిసి ఉండవచ్చునని మరీ మరీ కోరడంవల్ల మీనాక్షిమాట తీసివేయలేకపోయింది. ఈ వాతావరణమంతా సాక్షాత్తూ లక్ష్మీదేవి నివాసమూ అనిపించేటట్లుగా ఉంది.'

ఏదో చెప్పరాని ఆందోళన మనసులో కలిగింది కమలమ్మకు. చికాకుగా అనిపించి కొంతసేపు విశ్రాంతి తీసుకుందామని విడిదికివెళ్లి పడుకుంది. ఆవిడకు తమ పెళ్లి సంఘటనలన్నీ మనస్సులో మెదిలి, కొన్ని నిముషాలు కళ్ళుమూసుకుని మనోపథంలో మనోజ్ఞమైన ఆ దృశ్యాలను చూసుకుంది. కళ్లు విప్పేసరికి ఎదురుగా ధగధగ మెరుస్తున్న వెండిమర చెంబు కనిపించింది. 'తను నిన్న ఈ విడిదికి వచ్చిన దగ్గర్నుండి ఆ చెంబు అక్కడే అలాగే ఉంది. ఎవరిదో? ఏమో? బహుశా ఆడపెళ్లి వారిదై ఉంటుంది. వాళ్ళు ధనవంతులుకదా! పిల్లకి పది వేలు కట్నమిచ్చి, వైభవంగా పెళ్లి చేస్తున్నారంటే మాటలా మరి.'

'కమలా!' ఆలోచనల్లో ఉన్న కమలమ్మ మీనాక్షమ్మ పిలుపుకు ఉలిక్కిపడింది. 'ఏమిటిలా పడుకున్నావు? ఒంట్లో బాగాలేదూ? ఎక్కడా నువ్వు కనపడకపోతే ఇక్కడున్నావేమోనని ఇలా వచ్చాను.'

నుదుటిమీద చేయివేసి చూస్తూ అంది మీనాక్షి. 'అబ్బే. ఏంలేదు కొద్దిగా తల నొప్పిగా ఉందనిపిస్తేనూ ఇలా ఇప్పుడే వచ్చాను. వియ్యపురాలివి. నువ్వు ఇలా వచ్చేవేమిటి? అబ్బాయి దగ్గర ఉండలేక పోయావూ?' అంది కమలమ్మ. 'అగ్ని హోత్రందగ్గర ఉన్నారు అక్కడంతా ఒక్కటే పొగ. నువ్వు కనిపించకపోతే వెతు క్కుంటూ ఇలా వచ్చేను, భోజనాల వేళ కూడా అవుతోంది. ముందు నువ్వు కాస్త కాఫీతాగి మాత్ర వేసుకుందువుగాని రా. కొంచెం సర్దుకుంటుంది.' అన్నది మీనాక్షి. 'ఇప్పుడేం వద్దు మీనాక్షీ. భోజనం చెయ్యాలిగదా! నువ్వు పద. అరగంటలో నేనూ వస్తానూ' అంది కమలమ్మ 'సరే' నంటూ వెళ్ళిపోయింది మీనాక్షమ్మ.

'పాపం మీనాక్షికి తనంటే ఎందుకంత ఆపేక్ష. వెతుక్కుంటూ వచ్చింది. రేపు సాయంత్రమైనా ఇంటికి వెళ్ళిపోవాలి. ఈ రోజునే వెళతానంటే మీనాక్షి కోపం తెచ్చుకుంది. మనుగుడుపు లయ్యేవరకైనా ఉండమని బ్రతిమాలుతోంది. అమ్మో! అన్నాళ్ళే! ఇంటిదగ్గర పిల్లలు ఏం అవస్థ పడుతున్నారో ఏమో! వారు ఊళ్ళోకూడా లేరు పిల్లలు ఒక్కళ్ళూ ఉండాలి. ఏమైనా రేపు వెళ్ళిపోవాలి అక్కయ్యకూడా రేపే వెళ్దామంది. ఎలా గైనా రేపు వెళ్ళనిచ్చేందుకు మీనాక్షిని ఒప్పించాలి. మీనాక్షికి ఒక్కగా నొక్క కొడుకు పెద్దచదువు చదివాడు. తనకి ఆ ఈడు ఆడపిల్లలు లేరుగానీ, ఉంటే ఈపాటికి మీనాక్షికి కోడలవకపోయేదా? ఏమిటో నా పిచ్చిగానీ అప్పుడు అంతస్థులు అడ్డురావూ! స్నేహబంధమొకటే గనుక ఇంత గాఢంగా అభిమానం అల్లుకుం దేమో మామధ్య.

అరె! ఆ వెండి మరచెంబు ఇంకా అక్కడే ఉందేమిటి? పెళ్ళితంతు కూడా పూర్తి కావస్తోంది. విడిదికి పెద్ద యిల్లే ఇచ్చారు. పెళ్ళివారింటికి చాలా దగ్గర లోనే ఉంది కూడా ప్రత్యేకు ఒకగదిలో తను, అక్క, మీనాక్షి ఉంటున్నారు. ఎవరూ ఆ చెంబు గురించి ఆరా తీసినట్లే లేదు. భోజనాల వేళ తోంది గూడా.' ఆలోచనలలో ఉన్న కమలమ్మ అలసిన దానిలాగ పడుకుంది. ఆవిడ ఆలోచనా సరళి వక్రమార్గాన సాగిపోతోంది.

'ఈ గదిలో ఎవరూలేరు. వచ్చినప్పటి నుండి గమనిస్తూనే ఉంది. అంతకీ మీనాక్షిని అడగనే అడిగింది. ఆ చెంబు ఎవరిది? అని 'ఏమో నాకుతెలియదు. వియ్యాలవారిదేమో' అని వెళ్ళిపోయింది పనిమీద. పోనీ ఈ చెంబు నేను పెట్టెలో పెట్టేసుకుంటేనో 'వెంటనే చెంబు' పట్టుకుని చూసింది కమలమ్మ. 'అబ్బ! ఎంతబరువుగా ఉందో! ఎలా లేదన్నాగానీ నూరుతులాలకు తక్కువ ఉండదు. అమ్మితే ఐదువందల రూపాయలకు తక్కువ రాదు. సంసారభారాన్ని మోయలేక పాపం వారు చాలా బాధపడుతున్నారు. ఆ మార్వాడీ వెధవ రోజుకొకసారైనావచ్చి డబ్బుగురించి నానామాటలూ అని వెళతాడు. దీనితో వాడిపీడ విరగడ అయిపోతోంది. తక్కిన అప్పులు నెమ్మదిగా తీర్చుకోవచ్చు. ఇంటి కొచ్చి ఆవెధవ రోజూ అనే మాటలు వింటుంటే సిగ్గుతో ప్రాణం చచ్చిపోతుంది. ప్రక్కయింటి కామా క్షమ్మకు ఇది ఒక వినోద కాలక్షేపంలాగ ఉంటుంది కామోసు. వాడువచ్చి వెళ్ళిన తరువాత వంకరనవ్వు నవ్వుతూ లేని జాలిని ప్రదర్శిస్తూ 'కమలమ్మ వదినా! ఈరోజుకూడా మార్వాడీ వచ్చినట్లున్నాడే! పాపం గొప్ప అవస్థే వచ్చిపడింది. వాడి మొహాన ఏదో పరకో పడేస్తే ఈ గొడవ ఉండదుకదుటమ్మా!' అంటుంది. 'మొగుడు కొట్టినందుకు కాదుగానీ తోడి కోడలు దెప్పినందుకు' అన్న సామెత ఊరికే వచ్చిందా? ఆ వెధవ వచ్చి అన్న మాటలకంటె ఈవిడ జాలిని భరించ శక్యంగా కుండా ఉంది. ఏమైనాసరే ఈ చెంబు నా పెట్టెలో పెట్టేసుకుంటాను.'

ఈ విధంగా కమలమ్మ స్వగతంగా నిర్ణ యించుకున్న తరువాత వెంటనే ఒకసారి గది అవతలికివెళ్ళి, ఇటూ అటూ చూసి, ఎవరూ లేరని తేల్చుకుని, లోపలికివచ్చి గబ గబా పెట్టెతీసి అడుగున ఆ చెంబు పెట్టేసి పైన తనబట్టలు పెట్టు కుంది. పెట్టెలో పెట్టేటప్పుడు ఆవిడ చేతులు వణికాయి. పెట్టె మూతవేశాక గుండె దడదడలాడటం మొదలుపెట్టింది. ఆవిడ మనస్సు పరిపరివిధాలపోతోంది.

'ఛ-ఛ. ఏంపని చెస్తున్నాను. ఎలాంటి వంశంలో పుట్టాను. న్యాయాన్ని రక్షించే న్యాయవాది కూతురై పుట్టి ఈ నే దొంగ తనం చెయ్యడమా? దొంగతనం చేసిన నేరా నికి ఎటువంటి శిక్షలు అనుభవించవలసి వచ్చేదీ తనకి తెలియదా? నీతికి నిజా యితీకి ప్రాణాల నర్పించిన ఆ తండ్రికి కూతురినై నేనిలాంటి నికృష్టపు పని చేస్తే ఆయన ఆత్మ ఎంతగా క్షోభి స్తుందో? నా కడుపున చెడపుట్టావని శపిస్తారేమో? ఏనాడు ఏం పాపం చేశానో? ఈనాడిలా దరిద్రంతో బాధపడుతున్నాము. తెలిసికూడా ఈనాడీపాపం చెయ్యడ మెందుకు? తెలిసి యింతవరకు మనసా కర్మణా వాచా నేనే పాపం చెయ్యలేదు. అసలు నాకు ఈ దుర్బుద్ధి ఎందుకు కలి గిందీ? అదృష్టం బాగుంటె నాలుగైదు ఏళ్ళలో బాబు చేతికందడా? అప్పుడు సుఖంగా ఉండకపోతామా? ఆయన ఆరోగ్యం బాగుపడుతోంది. అంతే చాలు. వారు లేచి తిరుగుతే మార్వాడీకి కొంతలో కొంతైనా చెల్లు పెట్టవచ్చు. ఇంటా వంటా లేని అప్రాచ్యపు పనిచేయడం ఎందుకు? దీనిని మళ్ళీ యధాస్థానంలో ఉంచుతాను.'

వెంటనే కమలమ్మ పెట్లోంచి తీసి యథాస్థానంలో పెట్టేసింది. మీనాక్షి రమ్మని పిలిచిందని జ్ఞాపకంవచ్చి పందిట్లోకివెళ్ళి వియ్యపురాలితో కబుర్లు చెపు తున్న మీనాక్షి దగ్గరకెళ్ళి కూర్చుంది.

'వచ్చావా కమలా! వడ్డించేస్తున్నారు. ఇంకా నిన్ను పిలవడానికి వద్దామనుకుం టున్నాను.' అన్నది మీనాక్షి. ఇంతలో జానకమ్మవచ్చి, 'ఇంతసేపూ ఎక్కడ ఉన్నావే కమలా! కనిపించనేలేదు. మా బావగారి కూతురు అల్లుడు ఈఊళ్ళోనే ఉన్నారని చెప్పాను చూశావా! భోజనా లయ్యాక వాళ్ళింటికి రమ్మని బలవంత పెడుతోంది. వాళ్ళిల్లుకూడా దగ్గిర నుట.' అంది.

'నిన్ననగా వచ్చాంగదక్కా! పిల్లలొక్కరూ ఉన్నారాయె. ప్రొద్దునే బండికి వెళితే బాగుంటుందేమో! నువ్వు ప్రొద్దునే వస్తావా?' అంది కమలమ్మ.

'అదేమిటి కమలా! అప్పుడే ప్రయాణం అంటున్నావు. ఎల్లుండివరకు

ఉదల నివ్వనని చెప్పినా?' అంది మీనాక్షి మధ్యలో. 'అలా అనకు మీనాక్షీ. ఎలాగైనా రేపు సాయంత్రం వెళ్ళిపోతాం. మళ్ళీ ఎప్పుడైనా వస్తూనే ఉంటాంలే. దాని ధ్యాసంతా పిల్లలమీదే ఉంది. అయినా వారుమాత్రం అవస్థపడరూ? నేను రేపుదయమే భోజనంచేసి వస్తానే కమలా. సాయంత్రం బండికి వెళ్ళిపోతే రాత్రికి చేరవచ్చు.' అంది జానకి.

భోజనాలయ్యాక విడిదికి వచ్చారు. మీనాక్షి కమలమ్మ. మీనాక్షితో ఏవో కబుర్లు చెపుతూనే ఉందిగానీ కమలమ్మ పరధ్యానంగా ఉంది. కబుర్లు చెపుతూనే నిద్రలోకి జారిపోయింది మీనాక్షి. ఇంకా ఆ వెండిచెంబు తలపుల్లోనే ఉంది కమలమ్మ. 'భోజనాలు అయిపోయినా గానీ, కొంతమంది పెళ్ళివారు ఎవరిళ్ళకు వారు తరలి వెళ్ళినాగానీ, ఎవరూ ఆ చెంబును గురించి పట్టించుకున్నట్లు లేదు. ఒకవేళ అందరూ మర్చిపోయారేమో? ఏమిటో నా పిచ్చిగానీ ఇది నేను పట్టుకుపోతే చూసేదెవరు? అడిగేదెవరు? దీనితో ఆ మార్వాడీ అప్పు తీరిపోతే వారికి స్థిమితంగా ఉండి ఆరోగ్యం చక్కపడుతుందేమో! ఈ అప్పులతో ఆయన బెంగ ఎక్కువై పోయింది. అందుకే రోగం

# మనస్సాక్షి

తగ్గుముఖం పట్టినాగానీ మనిషి కోలుకోవడం లేదు. ఆ వెధవగోల రోజూ లేకుండా ఉంటే ఆయన తిన్న పట్టెడు మెతుకులైనా వంటపడతాయి. వారికి ఒంట్లో వోపికవచ్చి, తిరిగి పనిలో ప్రవేశిస్తే మిగిలినవాటిని తీర్చడం పెద్ద కష్టమేమీ కాదు. పాపం! అందరూ మా ఇబ్బందులు చూసి జాలిపడి డబ్బుకి రొక్కించడం లేదు.

'మా తాతలు నేతులు తాగారు. మా మూతులు వాసన చూడండి.' అన్నారట వెనకటి కెవరో? మా పూర్వీకులందరూ బాగా బ్రతికారుగదా! అని ఆ బ్రతుకులు మా కొస్తున్నాయా? ఏమైనా సరే. ఈ చెంబును నేను పెట్లో పడేసుకుంటాను.' చప్పుడు కాకుండా లేచి ఒకసారి మీనాక్షిని పిలిచి చూసింది కమలమ్మ. పలుకక పోయేసరికి గాఢనిద్రలో ఉందని భావించి, ఎందుకైనా మంచిదని ఒకసారి గది అవతలికి కూడా వెళ్ళి అటూ ఇటూ చూసి నిర్మానుష్యంగా ఉందని తెలుసుకొంది. సవ్వడి కాకుండా చెంబుతీసి పెట్లో పడేసుకుని, యథాప్రకారంగా పక్కమీద కొచ్చి పడు




కుని కళ్ళు మూసుకుంది.

ఫేను గాలి ఉన్నాగానీ ఆవిడ శరీరం అంతా చెమట పట్టేసింది. చిరుగాలికి కంపించిన చిగురుటాకులా వణికిపోసాగింది ఆపాద మస్తకమున్నూ. 'ఈ చెంబు ఎక్కడిదని వారు అడిగితే ఏమని సమాధానం చెప్తాను? ఇలా అని చెపుతే క్షమిస్తారా? పడ చీవాట్లు పెట్టరూ? జన్మలో తన మొహం చూడరింక. ఆ... దొరికిందని చెపుతాను ... అలా అంటే నమ్ముతారా? 'ఎక్కడ దొరికింది. పాపం ఎవరిదో అడగలేక పోయావే?' అంటారు. పైగా 'ఇంటావంటా లేని బుద్ధులొస్తున్నాయేమిటే నీకు? ఇరవై ఏళ్ళు కాపరం చేసి నువ్వు చేసిన ఘనకార్యం ఇదా' అంటూ ఆకాశమంటెత్తున లేస్తారు.

భగవంతుడే రూపుదాల్చినటువంటి మామగారు స్వర్గం నుండి 'సత్సంప్రదాయం గల ఇంటి పిల్లవని ఏరికోరి కోడలిగా తెచ్చుకున్నాను. పుట్టినింటికీ మెట్టినింటికీ అప్రతిష్ట తెస్తావా తల్లీ' అని అంటున్నట్లుగా కనిపిస్తున్నారు. మామగారి ఆత్మ ఎంత క్షోభిస్తుందో గదా! వంశగౌరవం మట్టిపాలవదూ? ఛీ. ఛీ, దరిద్రం మనిషిని ఏపనికైనా ప్రోత్సహిస్తుందిగదా! అందరూ అంటారని, అనుకుంటారని ఏమిటి? తను పుట్టి పెరిగిన వాతావరణం ఎటువంటిది? ఎటువంటి వ్యక్తితో జీవితం పంచుకుంది? తనకి తన చదువు నేర్పిన సంస్కారం ఇదేనా! మామగారికి రోజూ రామాయణ, భారత, భాగవతాదులు చదివి వినిపించేది? వాటిసారం తన మనస్సునకు పట్టలేదా? ఈ ప్రశ్నలన్నిటికీ నేనేమని ఆ పరమాత్మకు సమాధానం చెపుతాను? ఇంత పాపభీతి లేకుండా పోయిందేమిటి? ఏం చేస్తే నా ఈ పాపం పరిహారమవుతుంది. ఏం చేద్దామనుకున్నా గానీ, ఈ నికృష్టపు పని చేయడానికి నా మనస్సే నాకు ఎదురు తిరుగుతోంది గదా! మనస్సాక్షికి మించిన సాక్ష్యం వేరే ఇంక ఎందుకు? ఈ చెంబు ఎదురుగా ఉన్నంతసేపూ నా బుద్ధి వక్రమార్గాన ప్రయాణం చేస్తూనే ఉంటుంది. తెల్లవారగనే వియ్యాల వారింటికి వెళ్ళి ఇది ఎవరిదో కనుక్కుని భద్రంగా అప్పగిం

చాలి. అంతవరకు నాకు స్థిమితం ఉండదు. భగవంతుడు నన్ను పాపకూపం లోకి తొయ్యడు.'

మనస్సుని అదుపులో పెట్టుకుని దృఢంగా నిర్ణయించుకుని వెంటనే లేచి వెండిచెంబుని యథాస్థానంలో ఉంచేసి, తిరిగి ప్రక్కమీదికి వెళ్ళి, గట్టిగా కళ్ళు మూసుకుని భగవద్ధ్యానం చేస్తూ నిశ్చింతగా కళ్ళుమూసుకుంది కమలమ్మ. ఆలోచనా భారంతో అలసిపోయిన మనస్సు ప్రశాంతత చిక్కడంతో కొంతసేపటికే నిద్రలోకి జారిపోయింది.

తెల్లగా తెల్లవారిపోయాక మెలకువ వచ్చింది కమలమ్మకు. ఎదురుగుండా అద్దంలో ప్రతిబింబం చూసుకుని ఆశ్చర్య పోయింది. 'ఒక్కరోజులో తన మొహం ఎంత వడిలిపోయింది. మనిషి మనస్సు ప్రశాంతంగా ఉంటేనే ఆరోగ్యం. తన మనస్సు, నిన్నంతా విషపు ఆలోచనలతో నిండి ఉన్నందువల్లనే, ఈరోజు అనారోగ్యంగా ఉన్నట్లుగా కనిపిస్తోంది. అబ్బ! ఎంత ప్రొద్దెక్కిపోయిందో? మీనాక్షి లేచి పెళ్ళివారింటికి వెళ్ళిందేమో!'

'లేచావా కమలా! తలనొప్పితో రాత్రంతా బాధపడ్డావేమో? లేవలేదు, అని లేపలేదు నిన్ను. నువ్వు కూడా స్నానం చెయ్యి. ఈ బద్ధకం కూడా ఉండదు' అంది. అప్పుడే స్నానంచేసి వచ్చిన మీనాక్షి. కమలమ్మ త్వరగా స్నానపానాదులు, కాఫీ ఫలహారాదులు ముగించుకుని 'ఇప్పుడే వస్తాను ఉండు మీనాక్షి' అని చెప్పి వెండిచెంబుతో వియ్యాలవారింటికి వెళ్ళింది. వియ్యపురాలిదగ్గరికి వెళ్ళి, 'చూడండి ఈ చెంబు ఎవరిదో, ఏమో? మేము వచ్చినదగ్గరనుండి ఆ గది లోనే ఉండిపోయింది. మేము ఈ సాయంకాలము వెళ్ళిపోతాము కూడా. పనివాళ్ళు తిరుగుతున్నారు. ఎవరిదో జాగ్రత్తగా అప్పగించండమ్మా' అని ఆ చెంబు ఆవిడ ముందుపెట్టి తృప్తిగా గుండెలనిండా గాలి పీల్చుకుంది కమలమ్మ. 'ఆ ... మాదే లెండి' అనేసి ఆవిడ నిర్లక్ష్యంగా ఏదో పనిలో మునిగిపోయింది. 'ఔరా, డబ్బుంటే ఎంత విలువైన వస్తువైనా యింతేగదా' అని ముక్కుమీద వేలువేసుకుని ఆశ్చర్యపోతూ విడిదికి చేరుకుంది పిచ్చికమలమ్మ. ●

# ఆగ్రాలో చంద్రుడు

ఆగ్రాలో అమృతకిరణుణ్ణి<br>
చూశావూ ?<br>
అబ్బ! అమృతం గ్రోలిన<br>
అనిమిషులు కూడా<br>
అంత ఆనందం పొంది వుండరు!<br>
అప్పుడే రైలు దిగిన మేము<br>
ఆనందంతో ఎదురుచూశాం<br>
"ఆగ్రా ఛావనీ"<br>
దీనిని ఆగ్రా ఛావనీ అంటారా?<br>
"ఛావనీ" అంటే ఏమిటి చెప్మా?<br>
చెప్పొద్దూ, నాకూ అనుమానం<br>
వేసింది<br>
ఆంగ్లంలో దీనిని కంటోన్మెంట్<br>
అంటారు.<br>
అయితే, తెలుగులో దీనిని<br>
స్కంధావారమందామా ?<br>
అవునా, మరి తాజ్‌మహల్<br>
సౌందర్యం<br>
అమృతకిరణుడిలో కనిపించిందా?<br>
అవును! అచ్చంగా అదే<br>
కనిపించింది.<br>
వెన్నెలలు చెరిగిపోసే నెలరాజు!<br>
వన్నెల విసనకర్రల నందించే<br>
రేరాజు!<br>
అరే! ఆగ్రాలో అమృతాంజనం<br>
అయితే, ఆంధ్రులక్కడా<br>
వున్నారన్న మాట!<br>
ఇది రాజాకీమండీ—<br>
ఏమండీ! ఇక్కడ<br>
రాజు లుంటారుటండీ ?<br>
కాదు—గాజు కూజాలు,<br>
తాజ్‌మహల్<br>
ప్రతిమలూ<br>
దొరుకుతాయి.<br>
గాజులకీ, మేజాలకీ<br>
కూజాలకీ, రోజాలకీ<br>
వేతాలకీ, మతాలకీ<br>
ఈ తావులు ప్రసిద్ధములట ?<br>
నెమలి విసనికర్రలూ<br>
నమిలి మింగాలనిపించే<br>
దోసకాయలూ<br>
ఉప్పూ, కారం అన్నీ<br>
దొరుకుతాయి<br>
దప్పున జ్ఞాపక వచ్చింది వేసవిలో<br>
మన ఆంధ్రదేశం!<br>
తాజ్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం<br>
చేశావా ?<br>
ఆజ్ ఉత్ నా ముష్కిల్ నహీ!<br>
మస్తిష్కంలో తాజ్, నవాజ్!!<br>
హస్తినాపురినుండి బయలుదేరు<br>
సుస్తీ చేసినవాళ్ళు<br>
నీరసంగా నవ్వుతావేం?<br>
మస్తుగా చెరకు రసం పుచ్చుకొని<br>
మరీ బయలుదేరు.<br>
ఓ పున్నమి వెన్నెల్లో తాజ్‌ని<br>
చూడు<br>
నీ ప్రియురాలి కన్నుల్లోని మజా<br>
దవిచూడు!<br>
మంచితనంలా, మంచి గంధపు<br>
చల్లదనంలా<br>
మంచి మనిషి హృదయంలా,<br>
మరీచికల్లో మంచితీర్థంలా<br>
వెన్నెల్లో—నీ కన్నుల్లో<br>
ఎన్నరాని సౌందర్యంతో తాజ్<br>
ఎంతగా మెరిసిపోతోందో<br>
చూడు నేస్తం!<br>
ఇది ముంతాజ్ ప్రేమకు<br>
చిహ్నమట!<br>
ఇది మన నేత్రాలకు పర్వమట!

—పి. ఎస్. గోపాల్.

# ఒక వారం విపరీతం — ఫాలాక్షుడు

## బావిలో దూకిన బస్సు

41 మంది ప్రయాణికులను మోసుకుపోతున్న బస్సొకటి డోంగ్రి అనే ప్రాంతంలో గతితప్పి, రోడ్డుదిగి, దిబ్బన హోనూతిలోకి దూరిపోయిందట




ఆ బస్సులోంచి ఓ నలుగురు బయటికి వచ్చారని మిగతావారి విషయం తెలలేదనివార్త.

## కిళ్లీలో విషం

మద్రాసుకు 30 మైళ్ళ దూరంలో వున్న మత్తిగారు అనే ఊళ్లో కిళ్లీ వేసుకున్న పాపానికి ఏనమండుగురు అక్కడి కక్కడే చనిపోయారట— వారుతిన్న తమలపాకుల్లో ఏదో విషసంబంధ విషయం వుండుండాలంటున్నారు వైద్యులు.

## భార్యని కొడుకుని కాలవలో తోక్కిన ప్రొఫెసర్

కురుక్షేత్రంలో ఓ ప్రొఫెసరుగారు తన భార్యను 10 ఏళ్ళ కొడుకునూ కారులో ఎక్కించుకుని, ఓ కాలవవొడ్డుకు తీసుకు వచ్చి, వారిద్దరికీ బలవంతాన స్పృహకోల్పోయేమందిచ్చి. ఆనక—కాలవలోకి తోసేసి, చేతులు దులుపుకు వెళ్ళిపోయారట. దైవ వశాత్తు ఆయన కొడుక్కి నీళ్ళు తగలగానే స్పృహ వచ్చిందట. అతను ఈదుకు వొడ్డుకు చేరటమే గాక, కేకలు వేసి నదిలోంచి పిలిచి, మునిగిపోతున్న తన తల్లిని కూడా రక్షించుకున్నాడట.

* * *

పాట్నా హైకోర్టు మాజీ జడ్జి కె. కె. దత్తా షికారుకు వెళ్తుండగా ఓ ఆగంతకుడాయన్ని కత్తితో పొడిచి పారిపోయాడట.

## ప్రేమ-ప్రమేయం

సెయ్యారులో మునియ గవుండర్ అనే ఆయన తనకూతురు 17 ఏళ్ళ శకుంతలకు వరుణ్ణి చూసి, పెళ్ళి నిశ్చయించుకు చక్కా కూడుంటే తనకా వరుడు నచ్చలేదని, తను బావనే పెళ్ళాడతానని, శకుంతల తండ్రికి తెలియ చేసిందట. ఆమెకోర్కె తండ్రి వినకపోయేసరికామె పెళ్ళి ఇంకా ఓవారం రోజులుందనగా విషం తాగి మరణించిందట. ఏనాగాపోయినా పెళ్ళి వ్యక్తిగత విషయంకదా! ఇంట్లో తలిదండ్రుల ప్రమేయం అంతగా ఎందుకూ? ఇదే అనాదిగా వస్తున్న ఆచారం!

## పెళ్లిపంక్తిలో కత్తిపోటు

పెళ్ళి పంక్తిలో తనడిగిన పిండివంట మరోసారి వడ్డించమంటే వడ్డించలేదన్న కోపంతో పంక్తిలో భోజనం చేస్తున్న రూప్‌కిశోర్ అనేఅతను వడ్డిస్తున్న కృష్ణలాల్ అనే అతన్ని కత్తితో పొడిచేశాడట. [ఏవ్వి! ఎంగిలిచేత్తోనే!] పొడిచిన రూప్‌కిశోర్ పెళ్ళికొడుకు పార్టీకి చెందిన వాడట. ఇది ఢిల్లీకి చెందిన ప్రేమనగర్‌లో జరిగింది.

వస్తున్నా సార్!
సార్....!
ఒరేయ్ కూరా..!

## తోటలో దొంగలు

తనతోటలో కొబ్బరి కాయలు విపరీతంగా పోతున్నాయని. ఆదొంగలకో పాఠం చెప్పడానికి ఆతోట యజమాని మల్లేగవుండరు, అతని కొడుకు 22 ఏళ్ల పెప్పన్‌కలిసి పథకం వేశారట. వీరి పథకం ప్రకారం కొబ్బరి చెట్లకు కరెంటు తీగలను చుట్టి వదిలారట. రాత్రికి దొంగతనానికి వచ్చిన, మునియప్పన్ అనే అతను, గోవిందసామి అనే అతను షాకుతో అక్కడే పడి చనిపోయారట. చట్టం ఇూషని చేసిన తండ్రి కొడుకులను తనస్వాధీనంలోకి తీసుకుంది. ఇది కృష్ణగిరి వార్త.

* * *



# గుడ్డివారి సంఖ్య

ప్రపంచంలో వున్న గుడ్డివారిలో ప్రతిమూడో వ్యక్తి హిందూదేశానికి చెందినవాడేనని లెక్కలు తేల్చాయి. అనగా భూగోళం మీద వున్నమొత్తం ఒకటిన్నర కోట్ల గుడ్డివారిలో 50 లక్షల మంది మనవారట. హిందూ దేశంలో ఇప్పుడు మూడు వేలమంది కన్ను డాక్టర్లు, 15,500 మంచాలు [సౌకర్యాలనచ్చు] మాత్రమే వున్నాయట. ఈ విషయాలు ఆరోగ్య మంత్రి శ్రీ కె. కె. షా అన్నారట విన్నారా?

*　　*　　*

చిక్మగలూరు నుంచి బెంగళూరు గుర్రప్పందాల కోసంవచ్చిన 55 ఏళ్ళ చంద్రశెట్టి అనే ఆయన చిక్ పేటలో హోటల్లో రూము తీసుకుని శనివారం పందాలకు వెళ్ళి, తిరిగి రూముకువచ్చి




లోపల తలుపు వేసుకున్నవాడు ఆదివారానికి కూడ తీయలేదుట. పోలీసులు వచ్చి తలుపు పగలకొట్టి చూస్తే లోపలాయన చనిపోయివున్నాడట. చావు గుండె ఆగిపోడం వల్ల సంభవించిందని డాక్టర్లు అన్నారట.

*　　*　　*

కెంపు అనే అతని భార్యను అతని స్నేహితుడు ఏకాంబరం రహస్యంగా కలుసుకోసాగాడట. ఈ రహస్య ప్రేమాయణాన్ని పసిగట్టిన కెంపు కోసలు గురు స్నేహితుల సహాయంతో మొన్న మూడవ తేదీన ఏకాంబరాన్ని చంపి, నడిరోడ్డులో పారేసి, పారిపోయాడట. ఇది ఆరణిలో జరిగింది.

*　　*　　*

ఎన్నపళ్ళత్తూరుకు చెందిన తంగవేలు అనే అతనింటికి అతని స్నేహితుడు నారాయణస్వామి వచ్చాడట. ఇద్దరూ రాత్రి ఒకే మంచంమీద పడుకున్నారట. అర్థరాత్రి ఎవరో వారిద్దరినీ కర్రలతో క్రూరాతి క్రూరంగా బాది చంపేశారట. ఇద్దరి తలలూ పగిలి మెదళ్ళు బయటపడ్డాయట. ●




**కె. సి. ఎస్, నూజవీడు**

రామలక్ష్మిగారూ, మీ ముగ్గురమ్మాయిల ఫోటోలు మా గురువుగారింట్లో చూశాను. పాపం. వాళ్ల పెళ్లిళ్లు ఎలా చేస్తారో? మీ పరిస్థితి చూస్తే జాలిగా ఉంది?

ఏం అంత అనాకారిగా ఉన్నారా నా ముద్దు గుమ్మలు!

**వి. ఎస్. పి, పాలకొండ**

సృష్టిలోకెల్లా తియ్యనిదీ అందరూ వాంఛించేదీ ఏమిటి ?

ఏమిటబ్బా? స్నేహమా? డబ్బా. . . . దాటు వద్దానే!

**వి. ఎస్, నెల్లూరు**

ఒక నవలగాని కథగాని చదువుతున్నప్పుడు ఆ వాతావరణంలో ఒక వ్యక్తిగా కలిసిపోయి ఆ వ్యక్తులతోపాటు రసానుభూతిని పొందుతుంటాను ...

నాకలా కుదరదు సత్యవతిగారూ. నేను బొత్తిగా డిటెక్టివ్ సాహిత్యం, రొమాన్సు చదువుతాను! అందుచేత ఎప్పుడూ పాత్ర వేరు నేను వేరుగానే ఉంటాను. అంతేకాదు— ఏక బిగిని ఓ పుస్తకం చదవలేను. ఒకే పుస్తకం ప్రారంభించి పూర్తి చేయలేను. అందుచేత ఇష్టమైన రెండుమూడు పుస్తకాలు ఒకేసారి చదవడం ప్రారంభిస్తాను. . . . . ఒకటి విసుగేస్తే యింకోటి అందుకుందుకు అప్పుడే అనువుగా వుంటుంది. అందుచేత నవలలో కథలో లీనం చెందడం అన్నది నాకు కుదరదు. . . . చదవడంలో ఈ పద్ధతి కొంచెం గందరగోళమే అనుకోండి. అయినా అలవాట్లు ఓ పట్టాన మారి చావ్వు కదా ?!

**ఆర్. ఎన్. ఆర్, కాశీబుగ్గ**

అక్కయ్యా నా ప్రశ్నలన్నీ ఘాటుగా ఉంటున్నా యనుకుంటాను — అందుకే ప్రశ్నలన్నీ ఓ మూల పారేస్తున్నారు. ఈ కింది ప్రశ్నకు మీ చాకచక్యం ఉపయోగించి జవాబియ్యండి చూస్తాను: లౌ ఈజ్ నాట్ బ్లయిండ్ బట్ ఇట్ మేక్స్ ఎ మాన్ బ్లయిండ్ ఫెలో. వై ?

ఎస్. ఎస్. సి. చదువుతున్న నీ ప్రశ్నలు మరీ ముద్దుముద్దుగా ఉన్నాయి గాని ఘాటేమిటి నా ముఖం! ఇప్పుడీ ప్రశ్నలోని ఘాటుచూసి జవాబిస్తు దనుకోకు. పోనీ— నీ సహాధ్యాయులు, నీ వూరి వాళ్లు, నీ ఉపాధ్యాయుల వర్గం అంతా నీపేరు చూసి, నీ బుర్రచూసి గర్వించి ఓ సివిక్ రిసెప్షన్ యిచ్చే సదవకాశం నాకు కల్పించాలని జవాబిస్తున్నాను. లౌ యీజ్ నాట్ బ్లయిండ్' లౌ మేక్స్ ఎ ఫెలో బ్లయిండ్, సొ, లౌ యీజ్ బ్లయిండ్!!

**జి. వి. ఎస్, కాకినాడ**

నిన్ను పుట్టించిన దేవుడిప్పుడేం చేస్తున్నాడు రామలక్ష్మి ?

విషాన్ని విషంతో చంపాలి రావుడూ, వజ్రాన్ని వజ్రంతోనే ఖండించవలెను—అంటూ దేవుడు నిన్ను పుట్టించాడు వెంకటసుబ్బారావూ? ఆశ్చర్యంగా లేదూ?!

**కె. ఆర్. జె, మద్రాసు**

ఇప్పుడు నా కోరిక ఏమిటంటే — వ్యాసాల్లో మీరు ఉదహరిస్తుంటారే ఆ అత్తయ్య మామయ్యలను చూడాలని ఉందండీ. వాళ్లెక్కడున్నారు ?

వాళ్ళు వూళ్లో ఉన్నారు. నేనూ మా ఆయనా ముసలివాళ్లమయిపోతే—అలా అత్తయ్యామావయ్యలం అవాలని నా కోరిక.

**వి. వి. ఎమ్. ఎస్, అమలాపురం**

మావో అంటే మీ కిష్టమేనా ?

చాలా చాలా. అందుకే నా పెంపుడు కొడుక్కి వీరవెంకటసత్యప్రసాద్ పేరు మార్చేసి—వీర వెంకట మావోప్రసాద్ అని పెట్టాను. బాగుందా?.

**మాధవీలత, కామారెడ్డి**

రామలక్ష్మిగారూ మీ కెందుకింత పక్షపాతం. ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబివ్వరేం ? మీకూ ప్రాంతీయ భేధాలు గాని ఉన్నాయా ?

లేవు చిట్టితల్లీ— అసలు నేను ఏ ప్రాంతం మనిషిని— ఒక ప్రాంతం వారికి ఆదరణా ఇంకొక ప్రాంతంవారికి నిరాదరణా చూపడానికి? కలలో కూడా అలా తలపోయవద్దు.

**ఎమ్. ఎస్. ఆర్. ఆర్, ఏటికొప్పాక**

గురుశిష్య సంబంధం నానాటికి నశించడానికి కారణం ఏమిటి ?

విద్యాశాఖాధికారుల ఆధిపత్యం పెరిగి అధ్యాపకుల పరువు సన్నగిల్లడం సవాలక్ష కారణాలలో ఒకటి. అయినా కర్ర్నని చావుకి కారణాలువెతకాలా? నాశనం అయిపోతున్న చిన్నతరాల భావి గురించి బాధపడాలా? ఏం చేయాలో తెలియడం లేదు—తల్లితండ్రులకి,

**డి. హెచ్. జి, విశాఖపట్నం**

సాధారణముగా పెద్దవారు, పిల్లలు పడితే అయిందా పెళ్ళి అంటారు. దానికో గల అంతరార్థము ఏమిటి ? అసలు పెళ్లికి దీనికిగల సంబంధమేమిటి ?

చిట్టితండ్రీ ఈ పెళ్లి దెబ్బలపెళ్ళి. ఆ పెళ్ళి బాజాలపెళ్ళి. [మనలో మన మాట— ఇది—అంతే ఈ పెళ్ళిలో పడ్డాక లేచినవాడు అరుదు!]

**ఎమ్. వి, ఆర్, ఉరవకొండ**

ఆడవాళ్లంటే పక్షపాత భావంతో నువ్విలా రాస్తున్నావనీ మగవాళ్లని ఎన్నో సమస్యలలో యిరికించే ఆడవాళ్లుకూడా ఉన్నారనీ నువ్వు సహజత్వాన్ని కూలంకషంగా చర్చించటంలేదని పాఠకులు భావిస్తే ...

అదే నిజమైతే యీ చెవి తీయించేస్తా!?. . . ఆడవాళ్ళు మగాళ్లకి ప్రాముఖ్యం యిస్తున్నారు— మారు స్త్రీలై ఉంటే— ఇది అన్యాయం అంటున్నారు. మగవాళ్లు అలా అంటున్నారు. . . . అసలు న్యాయచట్టంలో మాక్జిమ్స్ వుమెన్ ఆల్సో ఏం చేస్తాం?

**ఎ. పి. సంతనూతలపాడు**

ఏమండోయ్ రామలక్ష్మిగారూ, నేను పత్రిక రావడంతోనే ఏమి చదువుతానో కనుక్కోండి.

వారఫలాలు. అవునా?! నేను ఫలాక్షుడు చదువుతాను. తరువాత శ్రీకృష్ణ.

**పి. ఎన్. ఆర్, కొవ్వూరు**

మీకు కుమార్తె లెందరు ? కుమారు లెందరు ?

ఏమిటి మీ ఉద్దేశ్యం? నేనేదైనా హాస్టలు వార్డెననీ అనుకుంటున్నారా?— నాకు ముగ్గురే పిల్లలు!

**సి. ఎన్. ఆర్, అనంతపురం**

పుష్పానికో పరిమళం, బుర్రకో బుద్ధి, జిహ్వకో రుచి. అలాంటప్పుడు ఒకరి అభిప్రాయం ఇంకొకరి అభిప్రాయంతో ఏకీభవించాలని ఎక్కడఉంది ?

ఎక్కడాలేదు. కాని, వాసనలేనిపూలు, బుర్రలేని బుద్ధి రుచి తెలియని నాలుకలు ఉంటాయి. తమ అభిప్రాయంతో ఏకీభవించని వాళ్లది తప్పనే ధోరణిలో అర్థంలేదు. అభిప్రాయప్రకటన రాజ్యాంగం ప్రసాదించిన బేసిక్ హక్కులలో ఒకటి—అయినా పెద్దలు, అనుభవజ్ఞులు— ఒక అభిప్రాయం ప్రకటిస్తే దానికి విలువ నివ్వడం చిన్నల విధి అనడం తప్పుకాదు.






















ఆ విధంగా శపథం చేసి సోంబాబు రాంబాబుతోసహా బస్టాపు చేరాడు! అనుకున్నట్లుగా సుజాత అక్కడుంది! పక్కనెవరో ముసలాయన తప్ప యింకెవరూ లేరు! బస్టాప్‌కి కొంచెం దూరంలో వున్న పాన్‌షాప్ దగ్గర..






బీచ్‌లో ఎలక్ట్రిక్‌పోల్ చుట్టూ గుంపుగా కూర్చున్న అరడజనుమంది అబ్బాయిల్ని చూసి 'బాబోయ్ అబ్బాయిలు!' అన్నది అపర్ణ.

'అదేవిటోయ్ అబ్బాయిలంటే అంత భయం? వాళ్ళేమన్నా కొరుక్కు తినేస్తారా, నమిలి మింగేస్తారా మనల్ని? మనం బీచ్‌లో కొచ్చేం, వాళ్ళూ వచ్చేరూ! దేనికంత భయం?' కనుబొమ లెగురవేస్తూ ఘరానాగా అడిగింది ఉష.

'నీకు తెలీదు, వాళ్ళు మనల్ని ఏడిపిస్తారేమోనోయ్?' జంకుతూ వడక నెమ్మది చేసింది ఇందిర.

'ఏడిపిస్తే ఏడవకూ! నువ్వూ వాళ్ళని ఏడిపించూ, బేలన్సు సరిపోతుంది!' ధీమాగా అన్నది ఉష, కాన్వెంట్ కాలేజీలో చదివిన నాల్గేళ్ళ అనుభవాన్ని చాటి చెప్తున్నట్టుగా.

'హోయబ్బో—అబ్బాయిల్ని ఏడిపించడమే, అందులో క్రొత్తగా జేరిన మనం వాళ్ళని ఏడిపించడమా, ఉష మరీ ఢడాయిలేస్తూ!'—జాహ్నవి ఉష 'ధీమా'ను తగ్గించే ప్రయత్నం చేసింది.

'ఏవర్రోయ్, మనం చచ్చినట్టు, అవిగో, ఆ మెట్లుదిగి, ఆ పార్కులోకి వెళ్ళాలంటే, వాళ్ళ పక్కనుంచే వెళ్ళాలి, వాళ్ళప్పుడే చూడు, మనవైపెలా చూస్తున్నారో?'—అంతకు ముందునుంచీ వాళ్ళనే చూస్తున్న శాంతి కామెంట్రీ ఇచ్చింది.

'నడవండోయ్, ఎవరేమంటారో చూద్దాం—' నడుం బిగించి, ఝాన్సీ—కీ-రాణి లాగ ముందుకు నడిచింది ఉష.

'లెట్స్ సీ ద ఫన్'— శాంతి మిగతా వాళ్ళవైపు చూస్తూ, 'ఆంగ్లో ఇండియన్ అమ్మాజీ' లా భుజాలెగుర వేసింది.

అబ్బాయిల తాలూకు కళ్ళజోడు చూపులూ, కళ్ళజోడు లేని చూపులూ, సిగరెట్ పోజులూ—అన్నీ తనమీదే పడే సరికి అమ్మాయిల నడకలో అదోలాంటి మార్పు ఆటోమేటిక్‌గా వచ్చేసింది. అందరి కంటె ముందున్న ఉష మరికాస్త బిగుసుకుపోయి 'టక్, టక్, టక్' మంటూ మెట్లు దిగ సాగింది.

'హూ ఇజ్ దిస్ పింగ్—పాంగ్ బాల్?' అన్నదో అబ్బాయి కంఠం.

వెంటనే మరొక కంఠం—'ఒకమ్మాయి తలమీద గోరింకా, చెప్పకు చెప్పకు చిన్న పాపా!' అని రాగయుక్తంగా పాడడం, ముందున్న ఉష దగ్గర్నించి, చివ్వరనున్న జాహ్నవి వరకూ ఏదో 'అసంకల్పిత ప్రతీకార చర్య'లా, అనుకోకుండా ఆగిపోయి తలలు తడిమేసుకొని, ఆనక ఒకళ్ళ తలలు మరొకళ్ళుకూడా తడుంకొని, ఎవరి తలమీదా గోరింకలుగానీ, కాకులు గానీ లేవని క్షణంలో నిర్ధారణ చేసికొని అంతలోనే ఏదో జయించిన వాళ్ళలా నవ్వేసుకుని మురిసిపోతున్న అబ్బాయిల్ని చూసి మూతి ముడుచుకొని, అనుకో

ఉండనే వాళ్ళ 'జెర్కు' తినేసినందుకు 'ఆనక నవ్వుకుందాంలే' అన్నట్టు కల్సి కట్టుగా ముందుకు పరుగెత్తినంత పనీ చేసేరు.

'జెర్కు గొప్పగా తినేసేరు గురూ గోపాలం!' అన్న అబ్బాయిల గుంపులోంచి వచ్చిన డైలాగు విని, 'ఊహూ, మనమీద విక్టేసేసే నన్నుకున్న వాడిపేరు గోపాల మన్నమాట!' అన్నది ఉష, ప్రక్కనున్న ఇందిరా, శాంతిలతో.

'ఏవోయ్ ఉషడూ, పేద్ద ఏదో అనేసేవ్, ఏం చేయగల్గేవ్? అందరి కంటె ముందుగా పరుగెట్టేసేవ్, వాళ్ళు విక్టేసేసరికి!' దెప్పింది జాహ్నవి.

'అదివిట్టా? చచ్చువిట్టు, ఆడారి వాట్టు!' ఉక్రోషంగా అన్నది ఉష.

'విట్లోకూడా ఆడా, మగా ఉన్నట్టు ఇప్పుడు తెల్సిందిగాని, ఒప్పేసో, వాళ్ల ముందు నువ్వేం చేయలేవని...' పుర్కెక్కించింది జాహ్నవి.

ఉష మనసంతా పాడైపోయినట్లైంది. ఆ అబ్బాయిల గుంపుని — ముఖ్యంగా ఆ గోపాలాన్ని—నమిలి మింగేయాలన్నంత కోపమొచ్చింది. ఆ కోపమే ఉషలో విపరీత మైన సీరియస్‌నెస్‌కు కారణమై కూర్చుంది. అందుచేతనే మిగిలిన అమ్మాయిల బృందమంతా పాటలు పాడుకొంటూ కేరింతాలు కొడుతూ, అలల మీదకు పరుగులెత్తుతూ 'హాయి' ననుభవిస్తుంటే, అదేమీ తనకు పట్టనట్టు నిర్లిప్తంగా ఓచోట కూర్చుండిపోయింది ఉష.

'అదేమోయ్, అలా డల్‌కొట్టేసేవ్?' తడిచిపోయిన చీరకుచ్చెళ్లను అలాగా పిండుకొంటూ వచ్చి అడిగింది శాంతి.

'ఏమీలేదు, ఇందాక ఆ కుర్రాళ్లు విక్టేసేరుకదా, దానికి బదలా తీర్చడ మెలాగా అని ఉష ఆలోచిస్తున్నది, అంతే సంగతి!' జాహ్నవి గాలిలా వచ్చి వాలింది.

'పదు చెప్తే నీపని!' అంటూ లేచింది ఉష. కిసుక్కున్నవ్వింది జాహ్నవి. 'డిస్కరేజ్ చేయకోయ్ జాహ్నవీ' అంది శాంతి. మిగిలినవాళ్లంతా కూడా వచ్చి జేరేక, వెనక్కు బయల్దేరింది అమ్మాయిల బృందం.



విలక్ట్రిక్‌పోల్‌కున్న ట్యూబ్‌లైటు— ఎవరో బ్రహ్మాండమైన విట్టువేసేరు గామోసు, సడన్‌గా వెలిగింది. ఆ లైటు వెలుగులో అబ్బాయిల తాలూకు ముఖాలు ఇంచుమించు స్పష్టంగా కన్పడుతున్నయ్.

అబ్బాయిలంతా సడెన్‌గా సైలెంట్ అయి కూర్చునేసరికి 'ఓహో, ఇందాకటి గోపాళం మరొక 'విట్టేదో' వండేడు గామోసు, అది మనకి వడ్డించడానికి ఏర్పాట్లు చేస్తున్నాడు!' అన్నది ఉష కోపంగా అటువైపు చూస్తూ.

'ఇదిగో, ఎంతమంది విట్టేసినా ఈసారెవ్వరూ నవ్వొద్దు ప్లీజ్!' బ్రతిమాలింది ఉష. ఉష బాధను చూసి 'వో.కే' అంటూ నవ్వుకొన్నారు శాంతీ, అపర్ణా, జాహ్నవీలు.

'శాంతీ, నువ్వు నాతో నడవ్వోయ్' వీళ్లంతా ముందు నడుస్తుంటారు, వెనకాల మనమిద్దరం ఉంటాం. ఆ గోపాళం విట్టేస్తే 'రీడైరెక్ట్' చేసేస్తా!' అంటూ 'ఎజెండా' తయారు చేసింది ఉష. మళ్లీ 'ఒకే' అన్నారు మిగిలినవాళ్లు.

ఇందిర, అపర్ణ, జాహ్నవి వర్సగా ముందు నడుస్తుంటే, రెండడుగుల వెనగ్గా శాంతి, ఉష నడవసాగేరు. అబ్బాయిలు కూర్చున్న 'లైటుపోల్' దగ్గరవుతున్న కొద్దీ ఇందిర, అపర్ణా బిగుసుకుపోసాగేరు. వస్తున్న నవ్వును బలవంతంగా రుమాల్లోకి కుక్కేసుకో సాగింది జాహ్నవి. బుర్ర ప్రక్కకేమాత్రం తిప్పకుండా 'గళంబర్ద మింగేసినట్టు' నడవసాగింది శాంతి. ఉష మాత్రం శాంతితో మాట్లాడుతున్నట్టుగా నటిస్తూ, గుంపులో గోపాలం ఎవరో గుర్తించాలనే ప్రయత్నంలో నిమగ్నమైపోయింది.

మెట్లొచ్చేసినయ్. అమ్మాయిల్లో సగం మందికి చెమట్లు పట్టేసినయ్. సీరియస్‌గా మెట్లెక్కుతున్న అమ్మాయిలు... ఒకటీ...రెండూ...మూడు ... నాల్గూ...

'వీరి వీరి గుమ్మడిపండూ, వీరి పేరేవరూ!' అన్నాడో అబ్బాయి—చివర్నున్న అమ్మాయిని చూపిస్తూ.

ఎప్పుడు నవ్వేద్దామా అని కాచుక్కూచున్నట్టున్న జాహ్నవి ఫక్కున్నవ్వేసి, కాలు మెలికపడి, పక్కనున్న ఇందిరమీద పడిపోయింది. 'అబ్బ ఉం ఫ్ వో ఫ్!'

# పాపం పైలట్

అంటూ సిగ్గుపడిపోయింది ఇందిర—

'...వీరిపేరు...ఆఁ-పింగ్‌పాంగ్‌బాలు...' అన్నాడు మరో అబ్బాయి.

'పింగ్‌పాంగ్ బాలూ, పారి పో!' అన్నాడు మొదటి అబ్బాయి. జాహ్నవి, ఇందిర, అపర్ణ ముందుకు పారిపోయారు.

ఉష సీరియస్సైపోయి ఆగిపోయింది. ఆ లైటు కాంతిలో మొదటి అబ్బాయి వైపు తీక్షణంగా చూసింది. రెండు గుటకలు మింగి, ఆ అబ్బాయికి కళ్లజోడున్నట్టు గమనించి, 'చూడు శాంతీ, భూతద్దాల కళ్లజోడుంటే ఎక్కడైనా సంపాదించు, మనరూమ్‌లో సినిమా వేసుకుందాం!' అన్నది శాంతి భుజంమీద చరుస్తూ.

శాంతి 'పకపకా' నవ్వేసింది. 'పోన్లే రేపు ట్రై చేసుకొందాం, నడు!' అంటూ విజయోత్సాహంతో ముందుకు సాగిపోయింది ఉష. 'ఏవిటిగురూ, దారుణం?' అంటున్న అబ్బాయిల కంఠాలు ఉషకెంతో ఆనందాన్ని కల్గించినయ్.

'డిపాజిట్లు పోయినియ్ గురూ గోపాలం!'

'వోకే, వోకే — లెట్స్ సీ — టుమారో!' అంటూ ఆలోచనలో పడ్డది అబ్బాయిల బృందం.

* * *

బీచ్‌లో జరిగిన సంఘటనను విజయోత్సాహంతో 'టముకు' వేసింది ఉష, ఆ రాత్రి బెడ్రేవ్‌మీద చేరిన జనాలతో.

'అమ్మ బాబోయ్, వాళ్లజోలికి పోయేవా నువ్వు?' అడిగింది ఉషను, సుందరి అనే సీనియర్ అమ్మాయి.

'ముందు వాళ్లే మాజోలికొచ్చేరు. అందులోనూ ఆ గోపాలం అట...'

'ఎవరూ, మన 'పైలెట్' వాళ్లసీనా? ఐతే, రేపట్నుంచి ఉష పని సరి!' అన్నదో సరస్వతి.

'పైలెట్ ఏవిటీ?' అడిగింది ఉష.

'అదీ, ఆ గోపాలాన్కి సుందరి పెట్టిన పేరు, అతనెప్పుడూ మా వెనక పడడు, ముందే నడుస్తుంటాడు, అప్పుడప్పుడు స్కూటర్‌మీద మా బస్‌కుముందే పైలెట్‌లా పడిపోతుంటాడు. అందుకు మేం అతన్ని 'పైలెట్' అని రిఫర్ చేస్తుంటాంలే. ఆ పేరు గన్క అతనిదగ్గరంటే, కొంతలంటుకుపోవయ్, తర్వాత నీ ఇష్టం—' అన్నది సరస్వతి.

'అలాగా!' అన్నది ఉష ఏదో ఆలోచిస్తూ.

'కావలిస్తే రేపొద్దున్న తొమ్మిది ముప్పై అయిదుకి మన బస్సును హాస్టల్ జంక్షన్‌దగ్గర ఒక స్కూటరు క్రాస్ చేసి, దూసుకు పోతుంది, దాన్ని నడిపే అతనే పైలట్, రేపే కాదు, ఏరోజైనా సరే, అదే జంక్షనూ, అదే స్పీడూ, అదే టైమూ, అదే పైలట్టూను!...'

'అహాఁ!' అంటూ మూతిని 'చిన్నిసున్నా'లా చుట్టి బుగ్గమీద వేలేసుకొని, ఆలోచనలో పడ్డది ఉష.

* * *

మర్నాడు ప్రొద్దుటే లేచి తలంటుకొని వాలుజడ వేసికొన్నది ఉష. మనసులో ఒకమూల గోపాలం ఇంచుమించు చోటు చేసుకున్నాడో ఏమో, 'ఒకవేళ పైలట్ అనబడే ఆ గోపాలం మనల్ని అల్లరి చేస్తాడు. అదిమాత్రం వీళ్లమాటల్ని బట్టి ఖాయం, అందుచేత...కాస్త డీసెంట్‌గా డెకరేట్ చేస్కోవాలి!'— అనుకొన్నది. అనుకొంటూనే సూట్‌కేస్‌లోంచి రోజాకలర్ జార్జెట్ శారీ, దానికి మేచింగ్ జాకెట్ తీసి 'ఫెమినా' అట్టమీద బొమ్మలా తయారైంది. హాస్టల్ గార్డెన్‌లోంచి ఎర్రగులాబీ ఒకటి సంపాదించి, జడ కుడివైపు చెవిప్రక్కన జారిపోతున్నట్టుగా ఉండేట్టు ఏర్పాటు చేసింది. హాస్టల్ బస్ రాగానే అందరికంటే ముందుగా వెళ్లిపోయి కుడివైపు ఫ్రంట్‌సీటులో కూర్చుండిపోయింది. 'ఒకవేళ 'స్కూటర్—పైలట్' బస్‌ని వోవర్‌టెక్ చేయాలంటే, బస్‌కి కుడివైపు నుంచే దూసుకు పోవాలిగా! అందుచేత ఈసీటే మంచిది!' అనుకొని ప్రక్కన శాంతికోసం సీటు అట్టేపెట్టింది.

తొమ్మిదిన్నరకి రంగురంగుల, రకరకాల భామినీ బృందంతో బస్ స్టార్టయింది. మెల్లగా హాస్టల్ జంక్షన్ వదిలింది. వెనకసీట్లోంచి సుందరి ఉషవైపు నవ్వుతూ అదోలా చూసింది. బస్ మెల్లగా 'గోపికానగర్' వదిలి 'కృష్ణ-

నగర్ ప్రవేశించింది. 'యువర్ ఎటెన్షన్ ప్లీజ్!' అని ఉషవైపు చూసి గట్టిగా అన్నది సుందరి.

ఇందాకట్నుంచీ ఎటెన్షన్‌లోనే ఉన్న ఉష కంగారుగా బైటికి చూసింది. బస్సు హాస్పిటల్ జంక్షన్‌కొచ్చి ఒక్క నిముష మాగింది. ఎవరెక్కారో పట్టించుకోకుండా స్కూటర్‌కోసం ఆదేపనిగా బైట రోడ్డువైపు చూడసాగింది ఉష. బస్ కదిలింది. ఏదో మోటర్‌సైకిల్లూ, రెండు అంబేసడర్ కార్లూ, రెండు సైకిల్ రిక్షాలూ, ఒక ఆటో, జాలీ ఎక్స్‌ప్రెస్ తోపుడుబండీ—ఇవన్నీ దాటుకుంటూ బస్ వెళ్ళిపోతున్నదిగాని పైలట్ స్కూటర్ ఎంతకీ రాకపోయేసరికి సుందరివైపు ఆశ్చర్యంగా చూసింది ఉష. బస్ 'ఎల్లిస్ గార్డెన్'—అదే—ఎల్లమ్మతోట—జంక్షన్ దాటి పోయేక 'ఎయిత్‌వండర్ ఆఫ్ ద వర్ల్డ్ — ఈవేళ పైలట్ రాలేదు!' అన్నది సుందరి — అందర్నీ ఉద్దేశించి. 'నిజమే, నిజమే!' నంటూ కోరస్ పాడేసయ్ సీనియర్ కంఠాలు.

'సరిగ్గా ఈవేళే రాకపోవాలా! ఎందుకు రాలేదు చెప్మా?' సనుకొని విసుక్కొన్నది ఉష.

'అడుగో పైలట్!' కంగారుగా విన్పడిన శాంతికంఠం విని, ఉలిక్కిపడి అటు తిరిగింది ఉష.

స్కూటర్‌మీద నల్లటి లావుపాటి శాల్తీని చూపెట్టి ఫక్కునన్నవ్వింది శాంతి.

'పోవోయ్, బోడి విట్టూ నువ్వూను! వాకిలా 'జెర్క్' ఇచ్చేవంటే ఆఁ... చూస్కోమరి!' అంటూ ఉడుక్కున్నది ఉష, మూతిని చిన్ని సున్నాలా చుట్టి.

బస్ కాలేజి కేంపస్ జేరుకొన్నది. ఉషా, శాంతీ వేగున బస్‌నుండి దునుకుతుంటే, 'ఆఁ ఆఁ ఆఁ...' అన్నారెవరో ప్రక్కనుండి.

అతుగు ముందుకువేస్తూ ప్రక్కకు చూసింది ఉష! 'అడుగోనే పైలట్' అన్నది సుందరి. చటుక్కున అటు తిరిగింది ఉష.

'స్కూటర్‌మించి అలా దుమికితే కాలు బెణుకుతుందోయ్ మురళీ, అనక కావడం అమృతాంజనం వానా ఘ్రాతవామ! కాస్త జాగ్రత్తమరి!' అంటున్నాడు పైలట్ వెనకనున్న అబ్బాయితో.

ఆమాటలు తన నుద్దేశించే అంటూ వెనకాల కుర్రాణ్ణి 'డిఫెన్స్'లో పెట్టేడని ఇట్టే గ్రహించిన ఉష, 'నువ్వా నాయనా పైలట్ అంటేనూ! నీ పని చెప్తానుండు!' అనుకొన్నది మనసులో.

* * *

లంచ్‌టైముకి కేంటీన్‌కి బయల్దేరిన ఉష శరవేగంతో తనను దూసుకుపోయిన స్కూటర్‌ను చూసి అదిరిపడింది.

'ఇంకెవరూ పైలట్టే!' అన్నది శాంతి.

'ఊళ్ళో ఇంకెవర్కీ స్కూటరు లేనట్టూ! డొక్కుస్కూటరూ వీడూను!' తిట్టుకొన్నది ఉష.

'స్కూటరుకేమే, బాగానే ఉన్నది, ఎటొచ్చీ — ఆ పైలట్టే — గొట్టం పంటాల్సం, గందరగోళమూను!' అన్నది శాంతి.

కేంటీన్ లేడీస్‌వింగ్ ప్రక్కనే బైట నిల్చొని ఎవరితోనో అర్జెంటుగా మాట్లాడేస్తున్న 'పైలట్'ని చూసి 'మళ్ళీ ఏం నిట్టేస్తాడో ఏమోనే బాబూ!' అన్నది ఉష.

పైలట్ తమవైపు చూడకపోయేసరికి ఉష మనసు రవంత చివుక్కుమన్నా 'పోన్లే, ఏదో వ్యవహారం గావోసు, అర్జంటుగా మాట్లాడుతున్నాడు'—అని సర్దిపుచ్చుకొని లోపలికెళ్ళింది.

'అబ్బ, ఈ అబ్బాయి లేవిటో! లేడీస్ సెక్షన్‌లో అమ్మాయిలకంటే ముందుగా వీళ్ళే తయారు!' మెల్లగా శాంతి చెవిలో విసుక్కొన్నది ఉష.

'ఉష్! వాళ్ళు వింటే గొడవ చేస్తార్లే. కిక్కిక్కట్, బోల్డు ఖాళీ ఉందిగా!' అన్నది శాంతి. ఇంతలోగా సర్వర్‌కి ఏవేవో తెమ్మని ఆర్డరిచ్చింది ఉష.

నాలైదు నిముషాలు గడిచేయ్! గుమ్మంవైపు చూసిన ఉష గుండెలు ఝల్లుమన్నయ్! ఎదురుగా—పైలట్—బృందం!

'హాయ్' అంటే 'హాయ్!' అంటూ ఇందాకటి గుంపులో జేరిపోయింది పైలట్ బృందం.

'వచ్చేర్!' అనుకొన్నది ఉష.

'రసగుల్లా ప్రాంటోవోయ్ సర్వరూ!' అన్నాడు పైలట్. 'ఉయనగారి పోక్కీ రసగుల్లా ఒకటే!' అని శాంతి చెవిలో గుసగుస లాడింది.

సర్వర్ స్వీట్‌ప్లేట్ తెచ్చి గోపాలం ముందుపెట్టి వెళ్ళిపోయాడు.

'వాటీస్‌దిస్.' అన్నాడు గట్టిగా గోపాలం, స్వీట్‌ని బైటకు తీస్తూ.

అందరూ అటు చూసేరు. ఉషా శాంతియుకూడా అటే చూసేరు.

'ఐసీ—దిస్ ఈజ్ నాట్ రసగుల్లా—బట్...'

'దెన్ వ్వాట్?' అన్నాడు ప్రక్కబ్బాయి.

'లుక్! దిసీజ్...ఎ...పింగ్ పాంగ్ బాల్!' అంటూ పాకంలోంచి తీసిన పింగ్‌పాంగ్‌బాల్‌ని టేబిల్‌మీద వేస్తూ కొట్టేడు గోపాలం. అది తిన్నగా ఎగిరి వెళ్ళి ఉష వళ్ళోపడి 'సెటిల్' అయిపోయింది. ఉక్రోషంతో పళ్ళు పటపట లాడించింది ఉష. అందరూ ఫక్కున్నవ్వే



సరికి హెల్ప్‌లెస్ అయిపోయింది ఉష.

'హలో పింగ్‌పాంగ్‌బాల్—' అని, ఒక్క క్షణమాగి 'ఇచ్చేశురా?' అంటూ వాక్యాన్ని పూర్తిచేసిన గోపాలంమీదకు కసిదీరా 'బాల్'ను విసిరికొట్టింది ఉష. 'శక్'మని పట్టుకొన్న గోపాల్ ని—'వెల్ క్యాచ్!' అంటూ బృందం అభినందించింది.

'హౌ లవ్లీ యు ఆర్, మై డియర్ పింగ్ పాంగ్‌బాల్!' అంటున్న 'పైలట్'ని చురచురా చూసి, 'కమాన్ లెట్స్‌గో అవుట్!' అంటూ చిర్రున లేచి బైటికి వెళ్ళి పోయింది ఉష.

'గ్రేండ్ సక్సెస్‌బాస్!' అంటూ గోపాలాన్ని 'చేతులు పడేసారు' మిగిలిన బాబ్బీలు, బైటికొచ్చేక.

పక్కనేఉన్న 'లైటుపోలు' ఎక్కేయాలన్నంత ఉషారు పుట్టుకొచ్చింది గోపాలాన్కి.

*           *           *

'అబ్బబ్బబ్బా! నా ప్రాణం తీసేస్తున్నాడే ఈ పైలట్టూ! హాస్టలొదిలి అడుగు బైటికి పెడ్తే చాలు—ఎదురుగా ప్రత్యక్షం! బీచ్‌కెళితే, అక్కడ నాకంటె ముందే తయారు, సినిమాకెడితే - అదే సీటో నా ప్రక్కనో, సరిగ్గా వెనకాలో ఏర్పాటైపోతాడు. సిటీబస్సుల్లో—స్కూటరెక్కడో పారేసి—నాముందే ప్రత్యక్షమైపోతుంటాడు. రోజూ కేంటిన్ దగ్గర మావిడి చెట్టుకింద నిలయ విద్వాంసుడిలా కన్పడుతుంటాడు. కోతికి కొబ్బరికాయ దొరికినట్టు ఆ స్కూటరొకటి! దాని సైలెన్సర్ తీసేసి నానాగోలానూ! దానికి తోడు విపరీతమైన స్పీడూ, పోజూనూ! ఎప్పుడో గురుడికి ఏ ఏక్సిడెంట్ అయినా బాగాని తిక్క కుదరదు. మళ్ళీ మరి విర్రవీగడు! ఏ కాలో చెయ్యో పోతేగాని ఇటువంటాడికి రోగం కుదరదు—' పళ్ళు పట పట లాడిస్తూ శపించసాగింది ఉష.

'ఊరుకోవోయ్, మరీ అంత దారుణంగా కాలో చెయ్యో పోవాలని శాపనార్థాలు పెడ్తావ్ ఛీ ఛీ!' ఉషను కోప్పడింది శాంతి.

'నీకు తెలీదోయ్. వాడికి అలాగే అవ్వాలి. లేప్పోతే బుద్ధి రాదు!' కసిగా అన్నది ఉష.

'పోన్లే, అప్పుడానందిద్దూగాని! ఏదో

# పాపం పైలట్

కాస్త ఉషారుగా అల్లరి చేసినంత మాత్రాన అంత ఘోరంగా, అసహ్యంగా శాపనార్థాలు పరికేయడమే? అసలు అందంగా అల్లరి చేయడం కూడా ఆర్టేనోయ్, తెల్సా?'

'ఔనౌను! అలాగే అందంగానో, అసహ్యంగానో అల్లరి కొనసాగించమను, మనం వెళ్ళిపోయేలోగా వాడు స్కూటర్ మీదనుంచి గ్యారంటీగా బోల్తా కొడ్తాడు! ఒక్కసారి గట్టిగా అలా అవ్వాలి!'

ఉష మాటలు వింటూ మరి కాస్త విసుక్కుని, 'అస్తమానం 'వాడూ, వీడూ' అని అంటావేమిటి, మరీ లేబర్ లాగ!' అని మందలించింది శాంతి.

'మనల్ని మాత్రం వాళ్ళల్లో వాళ్ళు 'అదీ, ఇదీ' అని అనుకోరనా నీ ఉద్దేశ్యం? సరేం ఫర్వాలేదు—'వాడూ వీడూ'అంటే వాళ్ళ పరువేం తరిగిపోదు!' అంటూ మూతి ముడుచుకొన్నది ఉష.

*           *           *

'ఏడిపింపు'తో ప్రారంభమైన పరిచయం గోపాలాన్కి పెద్ద ప్రోబ్లమైపోయి కూర్చుంది. ఏదో విధంగా ఉషకి రోజూ వీలైనన్ని ఎక్కువసార్లు 'అటెండెన్సు' వేయాలి. కన్పడినప్పుడల్లా ఏడ్పించడమో, కవ్వించడమో చేయాలి. లేకపోతే రోజు గడవడం కష్టం!'—ఇలా అలవాటు పడిపోయిన గోపాలానికి సర్వం 'ఉషమయం' ఐపోయింది. దాంతో మిత్ర బృందంలో మాటల సిలబస్ మార్చిపారేసేడు. అంటే, 'విశేషాలేమిటీ?' అనడాన్కి బదులు 'ఉషేషాలేమిటీ' అనీ, 'విష్ యూ గుడ్‌లక్'కు బదులు 'ఉష్ యూ గుడ్‌లక్' అనీ, 'ఉష కన్పడిందా?' అనడాన్ని 'ఉషోదయమైందా?' అనీ—సిలబస్‌లో మాడిఫైడ్ రెగ్యులేషన్స్ ప్రవేశబెట్టేడు. అంతటితో ఆగక, రోజూ మధ్యాహ్నం మిత్ర బృందంతో తను నిలబడేచోట ఉన్న లేత మామిడిచెట్టు తనే ఐనట్టూ, 'ఉష పాప' మాధవీలత అయిపోయినట్టు వో చక్కటి కల కనేసి, ఆ కలలో మాధవీలతను మావిడిచెట్టుకు అల్లించేసి, మావిడి చెట్టును చిగిర్పించి, పూత పూయించేసేడు. అనక ఆ మావిడిచెట్టు లేత చిగుళ్ళమధ్య వో కోయిలని కూర్చోబెట్టి, 'కుహూ, కుహూ' అని జ్ఞాపకమున్న ప్రేమ గీతాలన్నీ పాడించేసేడు.

అంతటితో ఆగక ఉష ఏయే రోజున ఏయే 'డ్రెస్' వేస్తుందో, పర్మనెంట్ ఎడ్రస్ ఏమిటో, డేటాఫ్‌బర్తూ, వాళ్ళ నాన్నారి కారు నెంబరూ, డోరు నెంబరూ—అన్నీ గడ గడా అప్పజెప్పేయగల జనరల్ నాలెడ్జ్' సంపాదించేసేడు.

ఒక రోజు ఉషతో 'మీ కారు నెంబరు ఇదీ, మీ డోరు నెంబరు ఇదీ!' అని చెప్పినపుడు, ముందు ఉష నిజంగానే ఆశ్చర్యపోయి, అనక తేరుకుని 'మొన్న మా కారుకీ, డోర్లుకీ రంగు లెయ్యించేవని మా ఫాదర్ రాసేరేం. బహుశ, పెయింటరు ...మన...పైలట్‌గారేనేమో...!'అని పక్కనున్న శాంతి దగ్గర 'విట్టే'సేసరికి, గోపాలం కళ్ళంటుకొన్నాయి! ప్రక్కనున్న 'గ్యాంగు' విట్టుని రీ డైరెక్ట్ చేసేయమని ఎంత బలవంతం పెట్టినా వినకుండా, 'లేదు గురూ, ఈ రోజునుంచి 'ఉష పాప'ని ఏమీ అనను'...అన్నాడు ఫీలింగు మార్చేస్తూ.

'ఏం?' అని కసిరింది 'బ్యాచి.'

'ల...ల...'లవ్వు'!...' అన్నాడు వో సుబ్బారావు, 'లవ్వు' అనే మాటను నొక్కి పలుకుతూ.

గోపాలం 'లవ్వు'తో సిగ్గుపడిపోయాడు!

*           *           *

విపరీతమైన స్పీడుతో 'హాస్టలమ్మాయిల బస్'ని 'వోవర్‌టేక్' చేసిన'పైలట్' స్కూటర్‌ను కిటికీ ప్రక్క సీట్లోంచి చూస్తూ 'ఈనాడేదో మూడింది—లేకపోతే చూడు, ఆ స్పీడూ!' అన్నది ఉష—శాంతితో.

అంతలోనే 'బస్'లో జనం అంతా ఒక్కసారి 'అరెరే!' అంటూ కంగారుగా అరవడం, బస్ ఆగిపోవడం, అందరి మెడలూ కిటికీలోంచి బైటకు తొంగి చూడడం జరిగిపోయినవి!

'ఎక్లిన్ గార్డెన్' టర్నింగ్‌లో, ఎదురుగా వస్తున్న నెంబర్ వన్ బస్‌కు 'ఢీ' కొని, సగం నల్పైపోయిన స్కూటరూ, ఆరడుగుల దూరంలో ఎగిరిపడి స్పృహ కోల్పోయిన 'పైలట్టూ!'

'ఈ స్టూడెంట్ కుర్రోళ్ళని పట్టుకోలేమమ్మా! ఉఫ్, ప్రాణాలతో చెలగాటం!'

24—7—70.

అంటూ బస్ స్టార్ట్ చేసేడు డ్రైవరు.

'మంచి పనైంది. లేకపోతే ఏమిటా పొగరూ?' కళ్ళజోడు కామాక్షి కామెంట్.

'రోజూ చూస్తున్నాంగా—వెధవ పోజూ వీడూను!'

'ఇలా పర్సుగా నల్గురైదుగురికి అయితే గాని, ఈ స్కూటరుగాళ్ళకు బుద్ధి రాదు!'

'చెయ్యో, కాలో తుక్కైపోయుంటుంది!'

'పాపం, ఊరుకోండే. అతను అంతలా అన్‌కాన్షస్‌గా ఉన్నాడుట. అనవసరంగా మనం ఇలా—'

'ఎవడు చేసికొన్న ఖర్మ వాడే అనుభవిస్తాడు. కాస్త నెమ్మదిగా పోతే పోయిందేముందీ? లేడీస్ బస్‌దగ్గర పోజెయ్యబోయేడు! తప్పులుడుక లేదు!'

—బస్‌లో ఎవరిష్టం వచ్చినట్టు వాళ్ళు కామెంట్ చేస్తుంటే మనసంతా వికలమైపోయింది ఉషకి.

'ఊఁ, నీ కోరిక తీరిందోయ్ ఉషా! ఆనందించు!' అన్నది శాంతి—కోపంగా. అనుకోకుండా కళ్ళల్లో నీరు తిరిగింది ఉషకి. 'ఏం, జాలి పుట్టుకొచ్చిందా? ఇన్నాళ్ళూ కోరుకున్నావ్‌గదా, అతని కాలో, చెయ్యో పోవాలని! నీ శాపం ఫలించింది, ఆనందించు. పార్టీ చేస్కో. కాస్త ఉషారుగా ఉంటే అల్లరి వెధవని, రౌడీ అని నానా మాటలూ అంటారు, లేకపోతే మబ్బుగాడని, 'మడ్డి' అనీ హేళన చేస్తారు. ఏం చేసినా ప్రమాదమే! అసలు నీ మూలంగానే అతనికీ ఏక్సిడెంటయింది! ఓవర్‌టేక్ చేస్తూ ఎదురుగా చూడకుండా, నువ్వు కూర్చున్నావని ఇటువైపే చూస్తుంటే సరిగ్గా ... ఏక్సిడెంటయిపోయింది! సెలబ్రేట్ చేస్కో!' అంటూ గోపాలంమీద సానుభూతి చూపిందిశాంతి. మాట్లాడకుండా తలదించుకొన్నది ఉష.

ఆ రోజు మామిడిచెట్టుకింద పైలట్ బృందం లేదు! అక్కడ మౌనం రాజ్యం చేస్తుంటే, ఏదో వెలితి కొట్టొచ్చినట్టుగా కన్పడింది ఉష బృందానికి!

* * *

'పైలట్‌కి చాలా సీరియస్‌గా ఉందటోయ్, పాపం!'

'స్కూటర్ పప్పు పప్పైపోయిందిట!'

'ఆ పప్పే రాత్రి మన మెస్‌లో వడ్డిస్తారుట!'

'వెధవజోకూ నువ్వూను! అవతల అతనికి సీరియస్‌గా ఉండి చావూ బ్రతుకూ సమస్య ఐతే, నువ్విలా దారుణంగా మాట్లాడ్తావేమిటోయ్?'

'ఎంతమంది చావడం లేదు, ఎంతమంది పుట్టడం లేదు? అందరి చావులకీ భోజనాలు మానేసి, ఏడవమంటావా?'

—హాస్టల్లో అమ్మాయిల మాటలు వినలేక చెవులు మూసికొని రూమ్‌లోకెళ్ళి పక్కమీద కూలబడిపోయింది—ఉష—'దీనంతటికీ తనే కారణం! తన మూలంగానే అతనికి ఈ ఏక్సిడెంట్ అయింది! దేవుడా, అతనికేం ప్రమాదం కలగకుండా చూడు తండ్రీ!...ఔను! ఒక్కసారి హాస్పిటల్‌కెళ్ళి చూస్తే? ఎవరేమనుకొన్నా ఫర్వాలేదు. శాంతి రాగానే వెళ్ళాలి!' బాధగా నొసలు పట్టుకొని కళ్ళు మూసుకొన్నది.

* * *

'మెన్స్ స్పెషల్—ఫస్ట్‌ఫ్లోర్'లో లిఫ్టు దిగింది ఉష, శాంతితో కల్సి. చుట్టూ కలయజూసింది—పైలట్ ఫ్రెండ్స్ ఎవరైనా కన్పడతారేమోనని! ఎవరూ కన్పడకపోయేసరికి కంగారుగా 'స్టాఫ్‌నర్స్' దగ్గరికి పరుగెత్తింది.

'ఎక్స్‌క్యూజిమి సిస్టర్! ఇక్కడ—పైలట్ రూమ్ నెంబరు...' అన్నది కంగారుగా.

'పైలట్టా? హూ ఈజ్ హి?'—సిస్టర్ ఏమీ అర్థమవనట్టు చూసింది.

'ఐయామ్‌సారీ—అతని పేరు—మిస్టర్ గోపాల్! ఆఁ, స్కూటర్ ఏక్సిడెంట్!...' వణుకుతూన్న కంఠంతో చెప్పింది.

'హోఁ, ఆ కేసా! చాలా సీరియస్ కేసు! 'స్కల్ ఫ్రేక్చర్'—ఆపరేషనౌతుంది. ఇంకా రెండు మూడు గంటలు పట్టొచ్చు. కానీ, నో హోప్స్! ఇంతకీ మీరు అతనికేమౌతారు?'—అడిగింది సిస్టర్.

జవాబియ్యకుండా శాంతితో కల్సి ఆపరేషన్ థియేటర్‌వైపు పరుగెత్తింది ఉష. 'ఔను! నేనేమౌతానతనికి? ఏమీ అవ్వను! అతని పాలిట మృత్యువుని! శనిని! దెయ్యాన్ని'—తనని తనే కసిదీరా తిట్టుకొన్నది.

'రక్తం చాలదట!' అన్నారెవరో ఆపరేషన్ థియేటర్ దగ్గర. తలలమీద చేతులు వేసుకుని, నీరసించిపోయిన ముఖాలతో నిశ్శబ్దంగా కూర్చునున్నారు—పైలట్ స్నేహితులు.

'ఏమండీ—గోపాల్ కెలా ఉందీ?' ధైర్యంగా అడిగింది ఉష. ఆశ్చర్యంగా అందరూ తలలెత్తి చూసి, 'ఛీ! దీనికంతా నువ్వే కారణం!' అన్నట్టు ముఖాలు ప్రక్కకు త్రిప్పుకొన్నారు.

'ఏమండీ—చెప్పరా, ప్లీజ్!' బ్రతిమాలింది!



# పాపం పైలట్

'శో బోన్స్ అన్నాడు డాక్టర్. బ్లడ్ చాలదట! మాదెవ్వరిదీ 'మేచ్' అవలేదు. ఆపరేషనింకా జరుగుతుంది. రక్తంకోసం 'బ్లండ్ బ్యాంక్' దగ్గర ప్రయత్నిస్తున్నారు!' అంటూ కళ్లు తుడుచుకొన్నాడు గోపాల్ కుడిభుజంలా అల్లరిచేస్తే మురళీ.

'నేనూ ట్రై చేస్తే' 'మ్యాచ్' అయితే నా 'బ్లడ్' తీసుకోమనండి — ప్లీజ్!' కళ్లనీళ్లు తుడుచుకొంటున్న ఉషనిచూచి విస్తుపోయారు గోపాలం స్నేహితులు.

'ఐతే బ్లడ్‌బ్యాంక్‌కి నడవండి!' అన్న మురళీ వెనకాల పరుగుతీసింది ఉష.

'అతను నీకేమవుతాడమ్మా?' అన్నాడు డాక్టరు, రక్తాన్ని పరీక్షిస్తూ.

'ఏం చెప్పాలో పాలుపోలేదు. నర్వసంగా తలవంచుకొన్నది ఉష.

'ఐసీ! నాకు తెల్సింది. అందుకా మీకీ త్యాగం!'—ఏదో కనిపెట్టేసినట్టు నవ్వేడు డాక్టర్.

'ఉహ్, ఈ డాక్టర్లవి గుండెలుకావు, నాపరాళ్లు! ఈ టైములో విట్లు!'— కోపగించుకొన్నది ఉష.

'హాహో, అదృష్టవంతుడమ్మా మీ గోపాల్! నీబ్లడ్ అనుకోకుండా మ్యాచ్ అయింది.' డాక్టర్ ఆనందంగా అన్నాడు.

'క్విక్ డాక్టర్! ప్లీజ్, అతనికెంత కావాలో అంత రక్తాన్నీ తీయండి. నాకేమైపోయినా ఫర్వాలేదు. అతన్ని బతికించండి! ప్లీజ్!'

'నీ కెక్కువైన రక్తాన్ని మాత్రమే తీస్తామమ్మా! డోంట్‌వర్రీ—'

కళ్లు మూసుకొని మరోసారి దేవుణ్ణి ప్రార్థించుకొన్నది ఉష—'అతనికేం ప్రమాదం లేకుండా చేయి భగవాన్' అని!

నిమిషాలు గడుస్తున్నాయ్ ఉష కళ్లు మూతలు పడ్డాయ్. 'చేయి కదపకమ్మా!' అన్నాడు డాక్టర్.

'డాక్టర్!' అన్నది ఉష, ఉలిక్కిపడి కళ్లు తెరుస్తూ. చుట్టూ ఎవరూ లేరు. శాంతికూడా లేదు. కంగారుగా లేవబోయింది. కళ్లు తిరిగినట్లైంది. నీరసమైన శరీరం, అలసట కలిగింది. అయినా లెక్కచేయకుండా రెండో ప్రయత్నంలో ఒక్క ఉదుటున లేచి ఆపరేషన్ థియేటర్‌కు పరుగెత్తింది. అక్కడా ఎవరూ కన్పడక పోయేసరికి భయంతో వణికిపోతూ స్పెషల్‌వార్డ్‌కు పరుగెత్తింది.

'సిస్టర్ సిస్టర్! స్కూటర్ ఏక్సిడెంట్ గోపాల్—ఆపరేషన్—ఏమైందీ?' బొంగుపోయిన కంఠంతో ఉష.

'బ్లడ్‌ఇచ్చిన అమ్మాయి మీరేనామ్మా?' తాపీగా అడిగింది సిస్టర్.

'యస్, సిస్టర్ అతనికెలా వుంది; రూమ్ నెంబరెంత! ప్లీజ్!...'

'రూమ్‌నెంబర్ 'టూ' గానీ,...'

'చెప్పండి సిస్టర్...ప్లీజ్!'

'అతనిబాడీ 'మార్చురీ' రూమ్‌కి వెళ్లిపోయిందమ్మా!...'

'సిస్టర్! నిజమేనా?' కూలబడిపోయింది ఉష.

'ఔనమ్మా, ఆపరేషన్ సగంలో ఉండగానే ఆయుషు నిండిపోయింది!' ముఖం ప్రక్కకు తిప్పుకొన్నది సిస్టర్.

'మార్చ్యురీ' వైపు పరుగెత్తింది ఉష. అక్కడ గోపాల్ స్నేహితులంతా ఉబికి, ఎర్రబడిపోయిన కళ్లతో జీవచ్ఛవాల్లా నిల్చుండిపోయి కనబడ్డారు.

'స్ట్రెచర్'మీద శవానికి తెల్లదుప్పటి పూర్తిగా కప్పి, 'ఆంబులెన్స్'లో కెక్కిస్తున్నారిద్దరు స్నేహితులు.

'గో...పా...ల్!' అంటూ కెవ్వున కేక వేసింది ఉష.

* * *

'ఏయ్, ఏమిటా కేక? ఏమైందీ?' అంటూ ఉషని బలంగా కుదిపివేస్తూ లేపింది శాంతి.

భయంగా లేచి కూర్చుని 'పైలట్ చచ్చిపోయేడే!...' అన్నది ఉష.

'ఛ, పాడుమాటలూ, నువ్వూను! ఏదో పీడకల వచ్చినట్టున్నది. లే! హాస్పిటల్‌లో 'రికవర్' అవుతున్నాట్ట! చేతికీ, కాలికీ చిన్న చిన్న దెబ్బలు తగిలినయ్యట. స్కూటరుమాత్రం తుక్కైపోయిందట. ఇందాక వాళ్ల ఫ్రెండుని ఆంక్సనాదగ్గర అడిగితె చెప్పేడు.' అన్నది శాంతి.

'ఒకసారి వెళ్లిచూడాలని వుందోయ్ శాంతీ!' మెల్లగా అన్నది ఉష.

'ఎవరైనా ఏమైనా అనుకుంటారేమో!' క్రీగంట చూసింది శాంతి.

'అనుకుంటే అనుకోనీయ్ నామూలంగానే కదా పాపం, పైలట్‌కి ఇంత ప్రమాదమొచ్చింది!' వెళ్లిచూస్తే తప్పేముందీ?'

'అయితే నడు! మెన్స్‌స్పెషల్ రూమ్ నెంబర్ టెన్ అట!...' శాంతిమాట వింటూనే ఛంగున లేచింది ఉష.

* * *

నీటుగా తయారై చేతుల్లో ఏపిల్ పళ్లసంచి పట్టుకొని వస్తున్న ఉషా, శాంతీలను చూసి ఎవరికోసమోలే!' అనుకొన్నారు గోపాలం బృందంలో సభ్యులు. కాని ఉష తిన్నగా రూమ్‌నెంబర్ టెన్ కొచ్చి 'పైలట్‌రూమ్—ఐమీన్—గోపాల్ రూము ఇదే కదాండీ!' అనడిగేసరికి గోపాలం ఫ్రెండ్సు నిలువునా కొయ్యబారిపోయారు!

స్వింగ్‌డోర్ తెరుచుకొని లోపలికెళ్లింది ఉష.

ఎదురుగా— బెడ్‌మీద—యాపిల్‌పండు అలాగా కొరుకుతూ, చేతికి చిన్న బేండేజుతోనూ, నుదుట రెండు ప్లస్ మార్కు పలాస్త్రీలతోనూ — కూర్చుని హాస్యకొడుతున్న పైలట్!

ఉషను చూడగానే ఉలిక్కిపడి, సర్దుక్కూర్చున్నాడు గోపాల్.

'హలో, హౌ ఆర్‌యూ?' నవ్వుతూ అడిగింది ఉష, చేతిలో ఏపిల్‌పళ్లు గోపాలం ప్రక్కనే పెడుతూ.

'ఎవర్ని, నన్నే?' నిజమో, కలో నమ్మలేక అడిగేసేడు గోపాలం, అటూ ఇటూ చూస్తూ.

'ఔను, మిమ్మల్నే అమ్మాయిలమీద విజ్లేసినట్టు స్కూటర్‌మీద విజ్లేస్తే ఏమౌతుందో తెల్సిందా? ఇకనైనా కాస్త స్పీడు తగ్గించండి!' సలహా ఉచితంగా ఇచ్చింది ఉష.

'మ్యాటరు తుక్కు బిపోయిందిగా !
ఇంక బస్సే !' అన్నది శాంతి.

'మరి మీరూ వెళ్ళేయకండి. మ్యాటర్‌ని ఇమ్మీడియెట్ గా రిపేర్ చెయించేస్తానుగా. కొత్తదొస్తుంది !' అన్నాడు గోపాలం. అంటూ నవ్వేడు. నవ్వినమూలంగా తలలో నరాలు కదిలినయ్ గామోసు; 'అబ్బా !' అని తలపట్టుకు కూర్చుండిపోయేడు.

ఎప్పుడూ ఉషారుగా, నవ్వుతూ, అల్లరిగా అరవై మైళ్ళ స్పీడులో ఉండే పైలట్ అలా 'డల్' అయిపోయేసరికి విపరీతమైన జాలి పుట్టుకొచ్చేసింది ఉషకి. 'పాపం పైలట్ !' అన్నది శాంతి చెవిలో.

'మీరు మెల్లగా ఏదో విష్పేస్తున్నారు!' అన్నాడు గోపాలం.

'అబ్బెబ్బే—లేదు. ఇంద, ఈ ఏపిల్సు తీస్కోండి. హేపీగా రికవర్ అవండి.'

'ఉ ఉ ఊఁ, నా కొదు !' మారాం చేసాడు గోపాలం.

'తీస్కోమంటుంటే !' కోప్పడింది ఉష.

'మీకు చెరొకటీ, నాకొకటీ !' బేరం పెట్టేడు గోపాలం.

'హోకే !...ఇంక మేం వెళ్ళిపోమా ?' కళ్ళు చక్రాల్లా తిప్పింది ఉష.

'వొద్దు !' ముద్దుగా అన్నాడు గోపాలం.

'బావుంది వర్స ! వెళ్ళొస్తాం —'

'వెళ్ళొస్తారా, ఎంత ప్రేపట్లో ?' ఉషారుగా గోపాలం.

'విష్యూ ఎండి, గుడ్ నైట్' — వెనక్కు తిరిగిన ఉష.

'ఉషా—' గోపాలం.

'ఊఁ ?' — ఉష.

'నా కాలూ, చెయ్యీ విరిగిపోవాలని శపించేరుటగా, నిజంగా విరిగిపోతే—'

'ఉష్ !' అంటూ గోపాలం పెదిమల మీద చూపుడువేలు పెట్టింది ఉష.

'ఉష్' అయిపోయాడు గోపాలం— ●

క్షీరదాలు

# చుంచు




జమ్మి కోనేటిరావు

చుంచు : షేక్స్పియర్ "చుంచును లొంగదీయడం" అని ఒక చక్కని నాటకం రాసాడు. చుంచు తత్వానికి ఎంత ప్రాముఖ్యం ఇచ్చాడో దీన్నిబట్టే తెలుస్తుంది. చుంచులు సామాన్యంగా మన ఇళ్లల్లో సంచరిస్తూనే వుంటాయి. ఎక్కువగా రాత్రిపూట ఎలకలాగే తిరుగుతూ ఉంటుంది. కాని ఇది చాల చురుగ్గాను, గోప్యంగాను, తిరగడం వల్ల అంత తరుచు కనబడదు. దాని ముట్టె పొడవుగా ముందుకు పొడుచుకొని వచ్చి ఉంటుంది. కీచ్, కీచ్ మని అరుస్తూ తిరుగుతూంటుంది. ఆహారాన్ని దాని ముట్టె సహాయంతోనే తెలుసుకొంటుంది. ఆ ముట్టె ఇటూ అటూ కదుల్తూ ఉంటుంది.

చుంచు చెవులు, కళ్ళు చిన్నవి. తోక పొట్టిగా, దాని మీద వెంట్రుకలు పల్చగా ఉంటాయి. చుంచుల జాతుల్లో కొన్నిటికి దుర్గంధం వెదజల్లే స్రావగ్రంధి ఉండడం వల్ల సాధారణంగా మాంసాహారులు దీని మీదకు రావు. పిల్లి వాటిని చంపుతుంది కాని తినదు! పాపం! ఎటూ ఉపయోగంలేని స్థితి.

చుంచులు చాలా జాతులున్నాయి. వాటి తత్వం కూడా వేరుగా ఉంటుంది. మడగాస్కరులో టెన్‌రెక్ అనే చుంచుకాటు బాధ పెడుతుంది. అమెరికాలో బ్లేరినా అనే చుంచు విషపూరితం కూడా. దాని విషం అది తినే జంతువుల మీద బాగా పని చేస్తుంది. మనకు ప్రమాదం చెయ్యదు. కొన్ని జాతులు చెట్ల మీద, కొన్ని నీళ్లలోనూ ఉంటాయి. ఐర్లండులోని ఒక చుంచు 5, 6 సెం మీ. మాత్రం ఉంటుంది [తోకతో సహా]. ఇంత చిన్న స్తన్యజీవి వేరే లేదు.

ఇక ఆహారం విషయంలో చుంచు ప్రజ్ఞ విపరీతం. బహు చురుకుదనంతో తన ఆహారాన్ని నిత్యం వేటాడుతూ ఉంటుంది. పురుగూ, పుట్రా దీని ఆహారం. చిమ్మెట, బొద్దింక, వానపాము, నత్త ఇంకా ఇలా చాలా జంతువులు దీనికి ఆహారం. తన కన్నా పెద్దదయిన ఎలకని కూడా చంపి తినేస్తుంది. నీటిలో నివసించేవి చేపల్ని తింటాయి. చుంచుకు ఆకలి అధికమయి అవసరమైతే తన జాతి చుంచుతోటే పోరాడి చంపి తినేస్తుంది [స్వజాతి భక్షణ] కొద్ది గంటల పాటు ఆహారం లేకపోతే చాలు ఆకలితో చచ్చిపోతాయి. ప్రతి మూడు, నాలుగు గంటలకి తనపాటి బరువు తిండి కావాలి దానికి. దాన్ని బట్టి మనం ఎంత తక్కువ తింటున్నామా అనిపిస్తుంది. దీని జీవ వ్యాపార క్రియలు అంత చురుగ్గా సాగుతూంటాయి అన్నమాట.

చుంచు తన పిల్లల్ని ఆహారం కోసం తీసికొని పోవడం చిత్రంగా ఉంటుంది. తల్లి తోకనో వెంట్రుకనో నోటిలో బట్టి ఒకపిల్ల, ఈ పిల్లని బట్టి మరొకటి వెనక, అలా దాని పిల్లలన్నీ సుమారు ఒక అరడజను వరకు పోతూ ఉంటాయి. నేలని త్రవ్వి కాని, బయటనే కాని సులభంగా దొరికే వానపాములు ఈ చిన్నవయస్సులో వాటికి ఆహారంగా ఉపయోగపడతాయి. చిన్నపిల్లల ఆటరైలు బండిలా పోతూ ఉంటాయి.

ఎలకలుంటే ఇబ్బంది గాని, చుంచులు ఒకటి రెండు ఉంటే మన ఇంట్లో సదుపాయంగానే ఉంటుంది కదా!




**జరిగిన కథ**

అనూరాధ తల్లి అన్నపూర్ణమ్మ. తమ్ముడు రాజా. అన్నపూర్ణమ్మ కన్నబిడ్డల చదువుకోసం ఎంతో కష్టపడుతూవుంటుంది. ఒకనాడు అనూరాధ డాన్సు చూచి బహుమతినీయడానికి ఆగంతుకుడుగా వచ్చి డా. హరికృష్ణ పరిచయమవుతాడు. ఇంతలో మద్రాసులో ఒకనాటక సమాజం వారి పిలుపుతో నాట్యప్రదర్శన ఇవ్వటానికి మద్రాసు బయలుదేరుతుంది. స్టేషనులో హరికృష్ణ కలుసుకొని మద్రాసుకు ఆమెను తీసుకెళ్తాడు.

## 3

ఏదో చిన్న స్టేషను రాగానే దిగి వెళ్ళి మామిడిపళ్ళు తెచ్చి అందించాడు 'తినండి', అంటూ. కాదనలేక స్వీకరించిందామె. కానీ ఎందుకో తినాలన్పించలేదు.

మద్రాసు రాగానే అన్నాడతడు—

'ఒక్క గంట మా యింట్లో గడపగలరా?' ఆ కంఠాన ధ్వనించిన అనురాగానికామె కదిలిపోయింది. స్నేహితురాలు మంజులకు ఫోను చేసింది వో గంట తర్వాత రాగలనని. ఆమె అంగీకారం వినగానే ఆ యువకుని ముఖాన ఆనందం కాంతులు విరజిమ్మింది.

స్టేషన్నుంచి బయటికి వెళ్ళి అయిదు నిమిషాల్లో వచ్చాడు. తరువాత పది నిమిషాల్లో వారి ముందో అందమైన కారాగి వుంది. అది అతనిదేనని గ్రహించింది అనూరాధ. నౌకరు వెంటనే 'డోర్' తెరిచి వినయంగా నిలబడ్డాడు.

అపరిచితుల మధ్య, అతని యింట్లో ఎలా మెలగాలో అని అనుకున్నదామె. 'ఈ డాక్టరి జీవితంలో ఆనందం మచ్చుకైనా లేదనిపించుతోంది. ఎవరు శపించగలిగారింత మృదు హృదయుణ్ణి?' ఆమె ఆలోచనలో తేలిపోతోంది.

'దిగండి! మళ్ళీ వెళ్ళిపోతానంటారు గంట పూర్తి కాగానే' అన్నాడతడు. ఆలోచనల్లోంచి తేరుకుని దిగిందామె. రెండంతస్తుల మేడ. ముందు అందమైన పూలతోట. గేటుతీసి సవినయంగా నమస్కరించాడో నౌకరు.

'జమీందారు కాదు గదా!' అనుకున్నదామెలోని అనుమానం.

పూలతీవలెన్నో రంగు లొలికించుతోన్న మేడపై అందంగా పాకి వున్నాయి. అందాల సుమబాలలు వయ్యారంగా కదులుతూ నవ్వులతో చిందులు వేస్తున్నాయి.

ఎదురుగా వో తెల్లని కుక్కపిల్ల చెవులు వూపుకుంటూ వచ్చి అతని పాదాల చుట్టూ తిరగసాగింది.

'టామీ! ఈ డాక్టరికున్న ఒకే కుక్క స్నేహమయి.' అంటూ పరిచయం జేశాడతడు.

ఎందుకతడు మాటి మాటికీ తన ఒంటరితనాన్ని అలా వ్యక్తం చేస్తున్నాడో ఆమెకు అర్థమవ్వడంలేదెంతగా ఆలోచించినా. ఆమె అతని వంక చూసింది. కాని అతడు కుక్కపిల్లను ఆప్యాయంగా ముద్దు పెట్టుకుంటున్నాడు. క్రింద నాలుగు గదులు. విశాలమైన హాలు.

'పార్వతమ్మా! అమ్మగారికి వేడినీళ్ళు వుంచు బాత్‌రూమ్‌లో' అన్నాడతడు. వద్దని వారించినా అతడు విన్పించుకోడని మౌనం వహించింది అనూరాధ.

సుమారు యాభై యేళ్ళున్న వో స్త్రీ 'రండమ్మా!' అంటూ బాత్‌రూమ్ చూపించింది. అంతే! 'మీరు బాబుగారి కేమౌతారని ప్రశ్నించలే దొక్కరూ!' అతనికి తల్లిదండ్రులు లేరని తెలిసికొందా పార్వతమ్మనడిగి.

'బాబుగారెంతో మంచోరమ్మా కానీ బగవంతుడు అన్నేయం జేశాడు తల్లీ! అమ్మను తీసుకుపోయినాడు. అయ్యనుకూడా కరువు జేసినాడమ్మా! అచ్చులున్నారు. ప్చ్! పాపం! కానీ వోరుండారు? సిన్నప్పుడే మేనమామగోరు తీసికెళ్ళారు. చదువు సందెలు జెప్పించారు. ఎంత తిన్నారో, ఏం జేశారో తల్లీ! ఎవరికి తెలుసు! బాబుగోరు డాకటేరయ్యాక యీ మేడ

కట్టి వచ్చేశారు. ఒక్కరన్నా 'అయ్యగారి' క్షేమం అడిగేవాళ్ళు లేరు గందా! రామ! రామ! తిరణాల పెజలా వస్తారమ్మా ఎప్పుడూ!' ఆమె చెప్పుకుపోతూనే వుంది.

కొంతవరకు ఆ డాక్టరి మనస్సును అర్థం చేసికోగలిగిందప్పటికి. జడ అల్లుకుని నుదుట కుంకుమ వుంచుకోబోతోంది —వో పాకెట్ తెచ్చింది పార్వతమ్మ—

'అమ్మాయిగోరూ! ఇదిగో చీర, పూలు పంపారు అయ్యగోరు బాయిగా రిచ్చ్యాల సంతోసంతో వుండారమ్మా వాళ్ళకి. ఎవరికీ యింత యిదిగా పూలు పంపించలేదు. కట్టుకోండమ్మా! కాదంటే సిన్నబోతారు' అన్నదో పాకెట్ తెచ్చి అనూరాధ ముందుంచుతూ.

అనూరాధకా కోరిక వింతగా వుంది. తిరస్కరించాలనీ అనిపించడంలేదు అంగీకరించాలనీ అనుకోవడంలేదు.

హాల్లో చప్పుడైంది. అతను వస్తున్నాడని గ్రహించింది. వెంటనే పూలు తురుముకుంది. చీర కట్టుకుంది.

'లోపలికి రావచ్చునా?' మృదువుగా వినదించిందతనిలోని అనురాగ వీణియ.

'పరదా పద్ధతి లేదులెండి. రండి!' అన్నదామె.

పార్వతమ్మ 'బంగారు బొమ్మలాగుండారు! తల్లి!' అంటూ మురిసిపోతూ, పనుందంటూ వెళ్ళిపోయింది. హరికృష్ణ లోనికి రాగానే తన వంక చూసి వర్ణించుతాడనుకున్నది అనూరాధ. కాని అతడు కనులెత్తనే లేదెంత సేపటికి.

అక్కడే వున్న కుర్చీలో కూర్చుని ఎదురుగా వున్న కిటికీలో నుంచి కన్పించుతూన్న రోడ్డువైపు చూస్తూ అన్నాడు—

'మిమ్మల్ని యిబ్బంది పెట్టాననుకుంటాను.'

కావాలనే మౌనంగా వుండిపోయిందామె. ప్రక్కనే వున్న పుస్తకాల బీరువా వంక చూస్తూ,

'అమ్మ లేదు కాని వుగాది నాడు అమ్మకో చీర పెట్టి పూజ చేయడం అలవాటయిపోయింది డాక్టరికి. ఎందుకంటారా? అదే నా పుట్టిన రోజు. స్వర్గంలో వున్న అమ్మ తప్పక నన్ను దీవించుతుందని నా నమ్మకం...' అతని కంఠం జీరవోయింది. కన్నులలో నీళ్ళు తిరిగాయి. క్షణమాత్రం ఆగిపోయాడు. దివంగతురాలైన మాతృమూర్తి స్మృతులతో కదిలి పోయిందా మృదుహృదయం.

'ఆ చీరలన్నీ అలాగే వుండిపోయాయి. ఎవరికీ యివ్వాలనిపించలేదు. కానీ మీకు యివ్వకుండా వుండలేక పోయాను.'

అనూరాధ మనస్సున వేయి ఆలోచనలు పడగలు విప్పాయి ఒక్కమారుగా. 'ఇదేమిటి? ఇంత పవిత్రంగా వూహించుకుంటున్నాడు నన్ను? నేనెవర్ని ఈయనెవరు?! వింతగా వుంది! ఎవ్వరూ ఆత్మీయులే లేరంటున్నాడు? మరి...నేను ఆత్మీయురాలినా? ఎలా? పెళ్ళి జేసికోవచ్చుగా? అందం వుంది. ఆస్తి వుంది. అందుకు తగిన హోదా వుంది. అందాల సహచరిణి దొరికి తీరుతుందిగా?' మధ్యలో అతని వంక చూసింది.

పొడుగైన విగ్రహం! నిర్మలంగా నవ్వుతున్న కళ్ళు! ఎర్రని ఛాయ!

'ఏం తక్కువ యీ డాక్టరికి? ఎందు



వ్రాహాలోకంలో నుంచి వెలికి వచ్చే సూచ నలే కన్పించక పోవడంతో అతడే అన్నాడు తిరిగి—

'మీ స్నేహితురాలికి 'ఫోను' చేశాను లెండి. రావడం కొంచెం ఆలస్యమౌతుం దని'

అప్పటికి గానీ గుర్తుకు రాలేదామెకా సంగతి. అతడంత హడావిడిలోనూ ఆ సంగతిని మరిచిపోనందుకెంతో అభినందిం చింది లోలోన.

భోజనాలు చేస్తూన్నంత సేపూ మాట్లాడుతూనే వున్నాడు. ఎంతో దగ్గరి బంధువులా, ఆత్మీయుడిలా అను రాగాన్ని కురిపించుతూ వ్యథలో నవ్వించు తూన్నాడు.

'ఎన్నాళ్ళకో నవ్వుతూ తిన్నారు బాబుగోరు' అన్నది పని మనిషి—పాత్రల్ని పెర్దుతూ—

అనురాధ తాంబూలం వేసుకుంటూ అన్నది.

'ఇక వెళ్ళనిస్తారా?'

ఏదో చెప్పాలని ఆమెవంకే చూస్తూన్న హరికృష్ణ ఆ మాట వినగానే విరమించు కున్నాడు తన ప్రయత్నాన్ని. ఆ సంగతి గ్రహించింది అనూరాధ.

'మరీ యింత మృదువుగా వుండ కూడదు మగవాళ్ళు. అలా వుంటే ఎన్నో యిబ్బందులున్నాయి.' అన్నదామె ఏదో భావాన్ని చెప్పాలన్న వుద్దేశ్యంతో.

అతడామె వంక చూశాడో క్షణం.

'మీకు తెలియదసలు సంగతి. నేనెవరి తోనూ మృదువుగా మాట్లాడలేను. అందుకే నా కెవరూ ఆత్మీయులు లేరు.' అన్నాడు.

'ఆ! ఒక్క నిమిషం ఆగండి! చాలు!' అంటూ అతడు లేచి వెళ్ళాడు లోనికి. మేడపైకి వెళ్ళి వస్తూ చేతో వో ఆల్బమ్ తెచ్చి ఆమె కందించాడు.

మొదటి పేజీలో అతని 'ఫోటో'యే వుంది. రెండో పేజీ తీయగానే నవ్వుల పువ్వులు జల్లుతూన్న అందమైన వో అమ్మాయి 'ఫోటో' వుంది. ఎవరన్నట్టు చూసింది అనూరాధ.

'నా క్లాస్‌మేట్! వరుసకి మేనగోడలు కూడాను.'

'పేరేమిటి?'

'శారద! ఎంతో మంచిది. నేనంటే ప్రాణం పెడుతుంది.' అన్నాడు అతని స్వరం కొంచెంగా వణికిందా మాట అంటూండగా.

'మరి...' ఏదో అడగబోయింది అనూ రాధ.

'ప్లీజ్! ఇపుడేమీ అడక్కండి! అంతా చెబుతాను సారి. పదండి! మీ మంజుల గారికి కోసం వస్తుందేమో!' అంటూ లేచి నిల్చున్నాడు. డ్రైవర్ని కేకవేసి కారు




అంతలోనే పరాయి మనిషిలా మారి పోయిన అతడి ప్రవర్తనకామె విస్తుపోయిం దెంతగానో. అంతవరకూ 'వెళ్ళవద్దు' అన్న మనిషే 'పదండి' అంటూ తానే పంపించుతున్నాడు.

'ఏమిటీ మనిషి? వింతగా వుందే? ఎవరికీ అర్థంగాడనుకుంటానే! ఎవరా శారద? ఎక్కడుందో ఆ అమ్మాయి?!' కారులో కూర్చున్నా ఆమె అతని వింత మనస్తత్వాన్ని గురించే ఆలోచించుతూండి పోయింది.

కారు ఆగగానే మంజులగారి యిల్లేమో అని దిగబోయింది. కానీ ఎదురుగా 'డాక్టర్ శారద యమ్. డి.' అన్నబోర్డు వేలాడు తోంది. సందేహిస్తున్నమకుని దిగిందామె.

హరికృష్ణ గేటుతీసి 'లోనికి రండి' అన్నాడు.

'అరే! ఇదేమిటివాళ?! ఇంత శ్రద్ధ బావకి? కబురు చేసినా, రావన్నావుగా? మరి......' ఎదురుగా అనూరాధ వుండడం చూసి ఆగిపోయిందామె.

తెల్లని చీరలో పాలరాతి బొమ్మలా మెరిసి పోతోందా యువతి.

'అనూరాధ అని మొన్న వో సారి పేపర్లో పడింది చూశావా? అదిగో ఆమె యీ అనూరాధ! మన మద్రాసులో వో ప్రోగామ్' యివ్వడానికి వచ్చారు!...

మా శారద! చెప్పానుగా మీకు!' అన్నాడు అనూరాధవైపు తిరిగి.

నమస్కరించుకున్నారిరువురూ. శారద కనులలో ఆశ్చర్యం తొంగి చూస్తోం దెందుకో అనూరాధను చూసినపుడు.

'సతీశ్' లేడనుకుంటానే!' అన్నాడు హరికృష్ణ.

'లేరు బావా! ఆయన కాకినాడ వెళ్ళారు నిన్ననే! ఏదో పనుందని' అన్నదామె. శారదకు వివాహమైందని గ్రహించింది అనూరాధ. ఆమె కాఫీ, టిఫిన్ తీసికొని రమ్మని నౌకర్ని కేకవేయబోతూండగా వద్దని వారించాడు హరికృష్ణ.

బయలుదేరి వెళ్తూండగా అన్నది శారద—

'ఈ చీర చాలా బావుంది! ఎక్కడ తీసుకున్నారు?'

ఆమె ఆ ప్రశ్న ఎందుకడిగిందో అర్థం

వేసుకోలేదు అనూరాధ.

'ఏం చెప్పమంటారన్నట్లు హరికృష్ణ వంక చూసింది.

'ఇక్కడే! మద్రాసులోనే కొన్నాను శారదా! నువ్వూ వున్నావు ఆరోజున!'

'ఓహో! అదా! అత్తయ్య చీరా! గుర్తుకు వచ్చిందిలే!'

అనూరాధకా చీరనా క్షణంలో విప్పి వేయాలన్నంత అభిమానం ఆవహించింది. కానీ నిగ్రహించుకుందెంతో ప్రయత్నం మీద.

'క్షమించండి! అపార్థం చేసికోవద్దు! బావ ఎవరికీ ఏనాడూ స్వయంగా కానుకగా ఏ వస్తువునీ యివ్వలేదు. మీకు తానెంతో అపురూపంగా భావించే అత్తయ్య చీరనే యిచ్చినందుకు ఆశ్చర్యం వేసింది. మీరందుకు అర్హులనే అనిపిస్తోంది నాకిప్పుడు. బావ జీవితం యికనైనా వో దారిన పడుతుందన్న ఆశ కలిగింది మిమ్మల్ని చూడగానే!' అన్నదామె హరికృష్ణ బయటికి వెళ్ళిన తరువాత.

ఆశ్చర్యం పరువు లెత్తిందామె కనుల నిండుగా ఆ మాటలు వినగానే.

''మీరే భావంతో అంటున్నారో నా కర్థం కావడం లేదు కానీ ఒకటిమాత్రం నిజం శారదగారూ! హరికృష్ణగారిలోని కళాహృదయం అందించిన కానుక అనే స్వీకరించాను నేను. మరో వూహ నాలో లేదు.' అన్నదామె మృదుస్వరంతో.

క్షణమాత్రం మౌనం వహించింది శారద.

'మంచిది! మీ డాన్సు చూడాలి! రేపు తప్పక వస్తాం!' అన్నది మాట మార్చి. కానీ ఆ గొంతున యిదివరకటి మాధుర్యం వర్తించలేదు.

అనూరాధ కారులో కూర్చుంటూండగా అన్నదామె తిరిగి—

'నీ మనస్సు నొచ్చుకుందేమో చెల్లాయ్! ఈ అక్కయ్యది కొంచెం తొందర స్వభావం. మరేమీ అనుకోకు. రేపోసారి వస్తాను. కొంచెం కోపగించుకోక మనస్సు విప్పి మాట్లాడు!' ఎంతో ఆత్మీయత దొర్లిందా స్వరం నిండుగా. ఏదో చెబుదామనుకుంటూండగా కారు కదలిపోయింది. ఆ హోరులో అనూరాధ పెదవులపైనుండి అక్షరాలు విన్పించనే లేదెవరికీ.

మంజులగారి యిల్లు యిదేనని కారు ఆపించాడు హరికృష్ణ వో మేడ ముందు.

'మళ్ళీ వస్తాను రేపు సాయంత్రం!' అంటూ సెలవు తీసికొన్నాడతడు. అంతలో మంజుల వచ్చింది బయటికి. ఇంటరులో మంజులా, అనూరాధ లిద్దరూ ఎంతో స్నేహంగా వుండేవారు. మంజుల తండ్రి జడ్జి కావడంతో మద్రాసు వచ్చేశారు.

'రా! అనూరాధా! మద్రాసు వచ్చికూడా దాక్కున్నావన్న మాట! ఎవరింటిదగ్గరున్నావు తల్లీ! ఆయనెవరో ఫోను చేశారిందాక. మీ బంధువులే ననుకుంటానే!' అంటూ ఆప్యాయంగా లోనికి తీసికొని వెళ్ళిందామెను.

మంజుల తల్లి మనస్సున మృదుత్వం అన్నది మచ్చుకైనా కన్పించదు. తామే మహారాజుల వంశంలో పుట్టినట్లు, యితరులంతా బానిస వంశంవారన్నట్లు ఎదుటివారిని హీనంగా చూస్తుంది.

'ఏమ్మా! అనూరాధా! నాన్నగారు

# ఆరాధన

లాయారంటగా! ఎలా జరుగుతోంది?! అందు కేనా తల్లీ! దాన్ని బ చేస్తున్నావ్? ఏం చేస్తాంలే మరి! తిండి తినాలి గదా! ఇంకా సమయం ఆ దాన్ని అవ్వా వుంది...' దండకం ఆరంభమైంది.

'అమ్మా! నాన్నగారు పిలుస్తున్నా రెందుకో చూడు! అనూకి నిద్ర వస్తోందను కుంటాను పక్కలిపి వేయించు తాను.' అంటూ మంజుల తల్లి దండకాన్ని ఆపివేసింది. అనూరాధ వూపిరి పీల్చు కుందప్పటికి.

'నువ్వేమీ బాధపడకు అనూ! అమ్మ ధోరణే అంత!' స్నేహితురాలికి నచ్చ జెప్పింది.

కాని ఆయింటిలో క్షణం కూడా వుండ లేనేమో నన్పించుతోందామెకు. స్నేహితు రాలి మనస్సు బాధపడుతుందని పైకి మాట్లాడకుండా వుండిపోయింది. మంజుల చెల్లెళ్ళిద్దరు. తమ్ముడొకడు. వాళ్ళ అమ్మదగ్గరజేరి అనూరాధను గురించి హరికథ జెప్పించు కుంటున్నారు.

'వాళ్ళకేమీ లేదురా! ఈ అమ్మాయి సంపాదనే తిండికీ బట్టకీ సరిపెట్టు కుంటున్నారట. పాపం! ఎక్కడైనా హోటల్లో దిగితే ఖర్చవుతుందని మన యింటికి వచ్చింది.' అయాసమన్నదే లేకుండా గ్రోతలకి విందు చేస్తోందా మహాతల్లి.

అనూరాధలోని అభిమానం దావా జ్వాలలా లేచింది. కాని లాభం లేదని దిగ్మ్రింగింది బాధను. ఆ పిల్లలు మాటిమాటికి గది తలుపుల సందుల్లో నుంచి చూస్తూ చిన్నగా నవ్వుతున్నారు.

'పాపం! నిద్రబోతోంది పాప! అమ్మ చెప్పిందిగా! వాళ్ళకు పడుకోడానికి మంచాలు కూడాలేవనీ.'

'దుప్పటి కూడా లేదటరా!' అంటోందో పిల్ల.

'అన్నమే లేదని అందిగా అమ్మ!' మరో అమ్మాయి సన్నాయిలా పాడుతోంది.

'భగవాన్! ఎలా పుట్టించావు తండ్రీ! ఈ మనిషిని? ఎదుటివాళ్ళ నింతగా చిత్రవధజేసే వాళ్ళమీద నీ కెందుకు ఆగ్రహం రాదు?' ఆక్రోశించింది అనూ రాధ మృదుహృదయం. ఎంత ప్రయత్నించినా నిదురే రాలేదామెకు. మంజుల హాయిగా నిద్రబోతోంది. ఆలో చనలు తెరల్లా కమ్ముకుంటూనే వున్నాయి. ఎప్పటికో నిదురలోకి జారిపోయిందామె

* * *

రాత్రి నిద్రసరిగా లేకపోవడం మూలాన ఉదయాన ప్రొద్దెక్కి లేచింది అనూరాధ. లేవగానే ఆ యింటి వాతావరణం గుర్తుకు వచ్చి పారిపోవాలన్పించిందామెకు. అంతలో మంజుల 'కాఫీ, రెడీగా వుంది అనూ! ముందు ముఖం కడిగి స్నానం జేసిరా!' అంటూ వచ్చింది.

ఎలాగో స్నానపానాదులు ముగించింది. పది గంటలు కాగానే శారదకు ఫోను చేసింది, మంజుల వంట యింట్లోకి వెళ్ళినపుడు.

'అక్కయ్యా! వో చిన్నకోరిక. నేను ఏలూరు వెళ్ళేవరకూ మీ యింట్లో వుందా లనుకుంటున్నాను. కాదనరని తెలుసు, కాని మీరు వో గంటలోవచ్చి నన్ను వెంట బెట్టుకుని వెళ్ళమని అడుగుతున్నాను. వివ రాలు తర్వాత చెబుతాను.' అన్నది ఫోనులో.

'అలాగేనమ్మా! ఇదో ఇప్పుడే బయలు దేరుతున్నాను! నిన్ననే వుండిపొమ్మని అందామనుకున్నాను. కాని మీ స్నేహితు రాలు ఏమనుకుంటుందోనని ఆగిపోయాను.' అంటూ ఫోను పెట్టేసింది శారద.

> **ఇది మీకు తెలుసా?**
>
> ## వెన్న
>
> పిల్లలకి వనస్పతి నెయ్యికి బదులు తాజావెన్న వాడడం మంచిది.
>
> పిల్లలకి రోజుకి మూడు అవున్సుల వెన్నైనా పెట్టాలి.
>
> నూనె ఎండలో పెట్టి తరవాత వాడాలి. ఎండవల్ల నూనెలో 'డి' విటమిను అధికం అవుతుంది
>
> పెద్దవాళ్లు తగుమాత్రంగా వేపుడు పదార్థాలు వాడాలి.
>
> పిల్లలకి కూడా వేపుడు కూరలు అంత మంచిది కాదు
>
> —వె. రా.

'అమ్మయ్యా!' తృప్తిగా నిశ్వసించింది అనూరాధ. ఆయింట్లోనుంచి ఎంత త్వరగా బయటపడితే అంత మేలు అన్పిస్తుం దామెకు. ఆ వాతావరణంలో వుంటే మరు నాడు 'నృత్యం'లో ఒక్క అడుగు కూడా అందంగా కాదుకదా! భావయుక్తంగా కూడా పడదన్నభయం వూపివేస్తోం దామెను.

అందుకే శారదకు ఫోనుచేసింది వేరే దేమీ లేక.

శారద వో అరగంటలో వచ్చి మంజులకి నచ్చ జెప్పి అనూరాధను వెంట దీసికొని వెళ్ళింది. వాళ్ళ యింటికి రాగానే వో గ్లాసుడు మంచినీళ్ళు త్రాగి అన్నది.

'అబ్బ! ఇప్పటికి ప్రాణం కుదుట పడిందక్కా! మీచేతి మంచినీళ్ళు తాగ గానే!'

'అక్కా, చెల్లెళ్ళ మధ్య 'మీ' అన్న పరాయి పదం వద్దు అనూరాధా! అక్కా! అని పిలుపు చాలు!' అన్నది శారద.

మంజుల తల్లి స్వభావం చెప్పగానే నవ్వింది శారద.

'ఉంటారు అనూ! అలాంటి వాళ్ళీ రోజుల్లో చాలా మంది వున్నారు. వాళ్ళను గురించి పట్టించుకో గూడదు. సరే! ఇంతకూ బావ నీకెలా తెలుసు?' అన్నది.

జరిగిన సంగతంతా చెప్పింది అనూ రాధ. చెప్పినదంతా జాగ్రతగా విన్నదామె.

'అనూ! నేనో మాట చెప్పనా! బావ మనస్సున నువ్వున్నావు. సందేహం లేదు. ఆ! ఆగు! నన్ను చెప్పనివ్వు! నీకా వూహ లేదు. నాకు తెలుసు. మల్లెకన్నా తెల్లనైన నీ మనస్సు బావ నెంతగానో ఆకర్షించింది. నా గురించి నీకేం తెలు సునని ప్రశ్నించకు. ఏదో మంత్రం వేసి మాయ చేస్తున్నానని అపోహ పడకు. కాని ఈ అక్కయ్యకు మాత్రం వో మాట యివ్వాలి!' వో క్షణం ఆగిపోయిందామె అనూరాధ కనులలోకి చూస్తూ.

'బావ మనస్సు ఎంతో సున్నితం! ఇప్పటికే ఎంతో బాధ రగులుతోందా గుండెల్లో. ఆ బాధని నీ మనస్సులో పరువులెత్తుతూన్న అమృతంతో మాయం జేయగలవని నమ్ముతున్నాను.'

'ఉండక్కా! అంత వుప్పెంతగా వూహించకు. మాట యివ్వలేను. క్షమించు? ఇలా అంటున్నందుకు ఏ శిక్ష విధించినా భరించుతాను. ఈ పెళ్ళాయి

జనకంగా లేవు. ఒకరికి మాట యిచ్చేంత వోపిక లేనెప్పుడునాలో' అన్నది అనూరాధ.

'శిక్షించకుండా వదలదీ అక్కయ్య! కానీ ఆ శిక్షలో ఆనందమేగానీ, బాధ వుండదని మాత్రం గుర్తుంచుకో!' అన్నది శారద మందహాసం చేస్తూ.

అనూరాధ తర్వాత మౌనంగా వుండి పోయింది. మరునాడే 'ప్రోగ్రాం' కావడం మూలాన అభినయంలో వున్న మెలకువలను మరోసారి సరిజూచుకుందా రాత్రి.

తొమ్మిది గంటలు కొట్టింది గడియారం. వెన్నెల వెలుగులో ప్రకృతి అందాల నవవధువులా మెరిసిపోతోంది. చల్లని గాలులు వచ్చి పలుకరించి పోతున్నాయి. మల్లెలు తెల్లగా నవ్వుతున్నాయి. మాలతీలత ఒయ్యారా లొలుకబోస్తోంది.

విరిసిన మల్లెలు పరిమళాల్ని వెదజల్లుతూన్నాయి. తోటలో పూవుల దర్బారులో ఆ సుమబాలల ముచ్చట్లు వింటూ, అందాల్ని కంటూ కూర్చున్నారు శారదా, అనూరాధలు.

హరికృష్ణ పది నిమిషాల్లో వస్తానని ఫోను చేశాడు. అందుకే నిదుర తూలి పోతూన్నా అనూరాధ మేల్కొనే వుంది. శారదకిలా మెలకువగా వుండటం అలవాటే. రాత్రి పదిన్నరా, పదకొండు గంటలయ్యే వరకూ భర్తతో ఏవో సంగతులు ముచ్చటించుతూనే వుంటుందామె.

శరత్‌బాబు 'నవల' శ్రీకాంత్‌ని గురించి మాట్లాడుకుంటూండగా వచ్చాడు హరికృష్ణ.

'ఎన్నాళ్లకో అన్నమాట నిలబెట్టుకొన్నావు బావా! నువ్వు నిజంగా వస్తావని అనుకోలేదు. మా చెల్లాయి 'అనూరాధ' ముందు మంచివాడిలా మారిపోదామని అనుకుంటున్నావేమిటి?' పరిహాసంలో యదార్థం తళుక్కున మెరిసింది.

'నటించడం నాకు రాదు శారదా!' కించిత్ కోపం ధ్వనించిందతని గొంతులో.

'దాని కోసం మాత్రం పిలిస్తే పలుకు తుంది' నవ్వుతూనే అన్నదామె.

'అని అనూరాధగారికి చెప్పావుటే!' అన్నాడతడు. తర్వాత అతను 'డాన్సు ప్రోగ్రాం' గురించి మాట్లాడి వెళ్ళి పోయాడు.

శారదకూడా తోడుగా వెళ్ళిందారోజున. సమాజం మేనేజరు ఆహ్వానిస్తూ ఆయుదు మనస్సున ఎంతో సంతోషం నిండి సందడి చేసింది.

కృష్ణునికోసం వేచివున్న గోపికగా అభినయించింది ముందుగా. ఆ కంఠాన అమృతం నిండివున్నట్లు, మధురాతి మధురంగా శ్రోతలను రసమయ జగత్తులో వూయలలూపి వేసింది.

మయూరికన్నా వయ్యారంగా వంపులు దిరిగి పోతోందా సన్నని నడుము. ఆ విశాల నయనాలలో అనురాగం మెరుపులా మెరిసి పోతోందోసారి. విరిసిన మల్లియలా స్వచ్ఛంగా నవ్వులు చిందించుతోంది మరోమారు.

వెన్నెలరేఖలా తళుక్కు మంటున్నదా అందాల మయూరి. విరిసిన మందారంలా ఎర్రదనంతో మెరిసిపోతున్నాయి చెక్కిళ్ళు.

అందెలు కదలుతున్నాయి. భావాలు పులకించి పరవశతతో తూలిపోతున్నాయి. అడుగు అడుగునా అందమైన భావం అభినయం అన్పించడం లేదు.

దివినుంచి భువికి దిగివచ్చిన దేవతా మూర్తిలా మనస్సులలో మందారాల్ని పూయించుతోందామె.

విమర్శ కూడా వినరానంతటి ఆనంద పారవశ్యాలతో ప్రేక్షకులు కనురెప్ప వేయకుండా చూస్తూండి పోయారా కమనీయ నృత్యాన్ని.

ఆ సన్నని నడుము ఎన్నో వంపులు తిరుగుతోంది.

ఆ కమ్మని కంఠం ఎంతో సొంపుగా వినదించుతోంది. శారద ఆశ్చర్యంతో పెదవి కదుపలేక పోయింది. ఆనందంతో నిండిన ఆమె హృదయం పరవశతతో కూలిపోయింది.

హరికృష్ణ కనులనిండుగా ఆనందం వెల్లి విరిసింది. అనూరాధ అతని హృదయాన దివ్యభామినిలా, అనురాగ సిరియలా మెరిసిపోతోంది. **(ఇంకా ఉంది)**

డాక్టర్ కబుర్లు

## కాలు ఆన్చటం మంచిది

కొన్నిచోట్ల కాఫీ, సారాయం మొదలయినవి నుంచుని తాగే ఏర్పాట్లు ఉంటాయి. నుంచుని తాగేందుకు ముందు బల్లలు ఉంటాయి. వీటినే 'బార్'లు అంటారు. ఈ బార్లకింద కాలు ఒకదానిని ఆన్చి నుంచునేందుకు కడ్డీలు ఉంటాయి.

ఇది చాలా ముఖ్యమయిన 'సౌకర్యం'. నుంచున్నప్పుడు ఒక కాలిని దేనిమీదనయినా ఆన్చి మోకాలు, నడుంవద్ద దేహం వంగి ఉంటే మంచిది. ఇస్త్రీ చేసేటప్పుడు బల్ల ముందు నుంచోవలసి వస్తుందికదా, అప్పుడు ఒక కాలు కొంచెం వంచి దేనిమీదనయినా ఆనిస్తే ఎంతో సౌకర్యంగా ఉంటుంది.

షాపులలో పనిచేసేవారు ఎందరో ఎక్కువ కాలం నుంచునే ఉంటారు. వీరికి షాపు 'కవుంటర్'కింద కాలు ఒకటి ఆన్చి నుంచునేందుకు ఉపాయం కలిగించాలి. అడ్డంగా



ఒక కడ్డీవేస్తే దానిమీద ఒకకాలు ఆన్చి నుంచోవచ్చు.

ఇటువంటి కడ్డీ నేలమీద కొన్ని అంగుళాలకన్నా ఎత్తు ఉండరాదు.

(కాపీరయిటు)

# వారఫలం

## 31-7-1970 శుక్రవారం మొదలు 6-8-1970 గురువారం వరకు

**మేషం:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృషభం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం మధ్యలో స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిధునం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేయగలరు. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం:** అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**సింహం:** కొన్నివ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారంమధ్యలో వృత్తివ్యాపారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కన్య:** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించ గలదు.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం.** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు —అలంకార వస్తువులు కొంటారు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**ధనుస్సు:** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం మధ్యలో వృత్తివ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మకరం:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వారం మధ్యలో సాహసముతోకూడిన వ్యవహారాలలో నష్టం రాగలదు. ఆందోళన కలుగుతుంది. అనుకూలమైన వార్తలను వింటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**కుంభం:** వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో యితరులకు నిమిత్తం శ్రమకు గురికాగలరు. వారం మధ్యలో ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు.

**మీనం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభించగలదు. వారం మధ్యలో ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

స్త్రీలకు—సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

—మహేష్


ఉపన్యాసాలు
సుబ్బారావ్-
మహాజనులారా
సోదరసోదరీమణులారా
మిత్రులారా-
అభిమానులారా


ఏస్కూల్లో చదువుకున్నావ్
ఇంతతేసి పెద్దమాటలు
రాశావ్.. నానోరు తిరగాలా
వద్దా?


డబ్బు
సగమే
యిచ్చారేం?
ఇది విని
జనాలు చప్పట్లు
కొడితే..
మిగతాది
యిస్తా!


సెక్రెటరీ! మన ఉపన్యాసాలు
పేపర్లవాళ్లు బొత్తిగా కత్తిరించి
కొస్త కొస్త వేస్తున్నారు! అందుకని
మనం సొంతంగా పేపరు
పెట్టుకుందాం! మన గ్రూపును
కదిపి చూడు!!


ఇప్పటికే కాలాతీత
మయింది! అంచేత-
నేను క్లుప్తంగానే
మాట్లాడతాను




ఆనాడు ఆఫీసునుంచి ఆలస్యంగా వచ్చిన రమణమూర్తి 'అమ్మయ్యా' అంటూ పడకకుర్చీలో నడుము వాల్చాడు. చొక్కా పాంటూ విప్పలేదు. చివరికి బూట్లుకూడా విప్పలేదు. ముఖం చూస్తూవుంటేనే బాగా అలిసిపోయిన వానిలా కనిపిస్తున్నాడు. అవును మరి చేస్తున్నది బ్యాంకు ఉద్యోగం. ఏరోజు లెక్కలు ఆరోజే పూర్తిచేసి యింటికి రావాలి. అందులోనూ అది మార్చి ఆఖరివారం!

శివాలయంలో జరుగుతున్న పురాణ కాలక్షేపానికి వెళ్ళడం ఆలస్యమయిందన్న విసుగుని వ్యక్తంచేస్తూ 'ఇదుగోరా నాయనా కాఫీ' అంటూ రమణమూర్తి

తల్లి వేడికాఫీని పడక కుర్చీకి దగ్గరగా ఉన్న చిన్న టేబిలుమీద పెట్టింది.

'ఉత్తరం వచ్చిందా అమ్మా?'

'ఆ' అని ఒక దీర్ఘం తీసింది తల్లి. గుడికి వెళ్ళడం ఆలస్యమైనందుకు అసహనం ప్రకటిస్తూ, ఉత్తరం తీసుకు వచ్చి ఆమె మూర్తి చేతి కిచ్చింది. 'ఆడ పిల్లట' అంది.

రమణమూర్తిలోని అలసట ఒక్కసారిగా మాయమయింది. అమాంతంగా పడక కుర్చీలోంచి లేచికూర్చుని ఉత్తరం చదవ పొగాడు.

'వెడుతున్నారా' అంటూ తల్లి దారి తీసింది శివాలయానికి.

భార్య సుఖంగా పురుడు పోసుకున్నందుకు సంతోషించాడు మూర్తి. తానూ ఒక తండ్రి అయినందుకు గర్వించాడు. నవ జాత శిశువుని చూడాలనే ఉత్కంఠ గూడు కట్టుకుంది.

'ఆడపిల్ల తండ్రిని !' అనుకున్నాడు తనలో తాను. ఉన్నట్టుండి ఏదో భయమూ దిగులూ ఆక్రమించాయి మూర్తి మనస్సుని.

మళ్ళీ పడక కుర్చీలో నడుము వాల్చాడు.

మనస్సు పరిపరి విధాల పోయింది.

తన కుమార్తె జీవితం కమల జీవి తానికి నకలు కాకూడదనుకున్నాడు. భయకంపితుడైనాడు.

కమలపేరుతో పాటు ఆమె విషాద గాధకూడా ఒక్కసారి మూర్తికి స్ఫురణకు వచ్చింది.

కమల తన ప్రేయసి! ఎంత మంచిదని. అంత అందగత్తె కాదు. కాని మనస్సు! బంగారం లాంటిది. ఆమెకున్న సంపద అంతా మంచితనమే. ఆమెను తొలిసారిగా యూనివర్సిటీ ఆవరణలో చూశాడు. అప్పుడు మూర్తి యం. యస్సి. చదువు తున్నాడు. చూసిన మరుక్షణమే, ఆమెను తప్ప మరెవ్వరినీ పెళ్ళిచేసుకో కూడ దనుకున్నాడు. ఆమెకూడా అలాగే అను కుంది. చివరికి మాత్రం అనుకున్నట్లు జరగలేదు.

ఒకనాడు మూర్తి ధైర్యంచేసి తల్లికి తన కోరికను తెలియజేశాడు. అంతే. ఆమెతోక తొక్కిన తాచులా కనిపించింది,

'ఎంత ధైర్యం వచ్చిందిరా నీకు! మా యింటావంటా వున్నదిట్రా ఇలాంటి ఆచారం! ఆ పిల్ల యెవరో, యేమిటో — ఏమీ తెలుసుకోకుండా పెళ్ళి చేసుకుంటా వ్రట్రా?'

'చాలా మంచిదమ్మా'

'నిన్ను బుట్టలో వేసుకునేందుకలా మంచిదిగా నటిస్తోందిరా. నువ్వవట్టి పిచ్చి వాడివి కాకపోతే, ముక్కూ మొగం తెలి యని ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటా వట్రా?'

'నిజంగా చాలా మంచిదమ్మా. నా మాట నమ్మవూ ?'

'ఇహనైనా ఆ పిచ్చివేషాలు కట్టి పెట్టు. నీ చదువెప్పుడు పూర్తవుతుందా, ఎప్పుడు పెళ్ళిచేద్దామా అని మీ మామయ్య నీ మీద కొండంత ఆశ పెట్టుకుని కూర్చుంటే, వాడి ఆశని కాస్తా అడి యాస చేస్తావా ? పార్వతి నిక్షేపంలాంటి పిల్ల...'

'అని ఎవరు కాదన్నారు ?' అన్నాడు మూర్తి.

'అది తెలిస్తేనా, ఎవరో ఆ అమ్మా యిని పెళ్ళి చేసుకుంటానన్నావు, రత్నం లాంటి పిల్లని వదిలి పెట్టి.'

'పార్వతికి నేనేం వంక పెట్టడం లేదమ్మా. తెలివైన పిల్ల. అందమైన పిల్ల. నేనే పార్వతికి తగను.'

'అదేం మాటయిరా? అదేం పరా యిది కనకనా ?'

'అది కాదమ్మా. మామయ్య బాగా ఉన్నవాడు. మరి మన సంగతి నేను చెప్పక్కర్లేదు...'

'ఆ దుగ్ధ మామయ్యకు లేనప్పుడు, నీ కెందుకురా అనవసరంగా ?'

'నేను కనక పార్వతిని పెళ్ళి చేసు కుంటే, చూసేవాళ్ళంతా ఏమనుకుం టారో తెలుసా ?'

'ఏమనుకుంటా రేమిటి ? ఈడూ జోడూ కుదిరింది. అయిన సంబంధం...'

'కాకిముక్కుకి దొండపండనుకుంటా రమ్మా.'

'మగవాడు ఎలావుంటే యేమిరా ? కోడలు నలుపైతే కులమంతా నలు పంటారు గాని...'

'ఏమోనమ్మా, పార్వతికి నేను తగను' మూర్తి అన్నాడు.

'నీ మొహం నువ్వూను ... అంతా నీ యిష్టమనుకున్నావ్రట్రా ... ఆయనే కనక వుంటే, యీ పాటికి పార్వతితో నీకు పెళ్ళి జరిగేది కాదూ...'

ఇక మూర్తి యేమీ మాట్లాడలేక పోయాడు.

తండ్రి తన చిన్నతనంలోనె చనిపో వడం, తనావెగా తనకోసం తల్లి పడిన పాట్లూ అన్నీ గుర్తుకి వచ్చాయి మూర్తికి. తాను బాగా చదువుకోవాలనీ, పైకిరావా లనీ ఆశించడమే కాదు, అష్టకష్టాలు పడింది. మగదిక్కులేని సంసారమే అయినా ఆ లోటు కనిపించకుండా ఎంతో నేర్పుగా సంసారాన్ని దిద్దుకు వచ్చింది. తాను కాలేజీలో ప్రవేశించినప్పుడు డబ్బు తక్కువయితే తన నగలను అమ్మివేసింది. ఆ తర్వాత తనకే విషయంలోనూ ఏటు వంటి లోటూ రానీయలేదు. మరి అటు వంటి తల్లిమాటను యిప్పుడు కాదన డమా అనుకున్నాడు మూర్తి.

ఆ తర్వాత కమల విషయాన్ని తల్లి యెదుట ప్రస్తావించలేదు రమణమూర్తి. కాని కమలను మోసం చేశానని అప్పు డప్పుడు బాధ పడేవాడు.

తల్లి అనుకున్నట్టుగా పార్వతి రమణ మూర్తుల వివాహం వైభవోపేతంగా జరి గింది. పెళ్ళినాడుగూడా మూర్తి మన స్సులో కమల మెదలకపోలేదు. రోజులు గడవను గడవను ఆమెను క్రమక్రమంగా మరచిపోయాడు, దైనందిన జీవిత యాత్రలో పడిపోయి.

ఒకనాటి దినపత్రికలో పిడుగువంటి వార్త ను చూశాడు మూర్తి. 'చెరువులో యువతి శవం' ఇటువంటి వార్తలు పత్రికా పాఠకులకు కొత్తకాదు. కాని ఆ విషయాన్ని పూర్తిగా చదవా లనిపించింది మూర్తికి. చదివాడు. కంట తడిపెట్టాడు. గుండె ఆగిపోయినట్లనిపించింది. పరి సరాలన్నీ చీకటిముద్దలా కనిపించాయి. ఎక్కడా వెలుగురేఖ ఒక్కటైనా కని పించలేదు.

కొంతసేపటికి తేరుకున్నాడు. ఆ వార్తను మననం చేసుకోసాగాడు మూర్తి. 'చెరువులో శవం...పేరు...కమల...చదువు కున్నది...'

# ఆడపిల్ల తండ్రిని

తల్లి వద్దంటున్నా మూర్తి ఆ సాయంకాలం కమలవాళ్ళ ఊరికి వెళ్ళాడు. కమల తండ్రిని కలుసుకున్నాడు. తాను రమణమూర్తిననీ, కమల స్నేహితుడననీ చెప్పుకున్నాడు.

'ఛీ, దుర్మార్గుడా! నీ వల్లనె నా కూతురు చచ్చిపోయింది. ఎందుకొచ్చావ్ యిక్కడికి!' అని గర్జించాడు కమల తండ్రి.

మూర్తి నిలువునా నీరయి పోయాడు. తనవల్ల కమలకు నూరేళ్ళూ నిండాయి!

'నేనేం పాపమూ ఎరగనండి. నామాట నమ్మండి.' దీనాతి దీనుడై చెప్పాడు.

'నువ్వు కమలను ప్రేమించావా?'

'అవునండి.'

'పెళ్ళి చేసుకుంటానని చెప్పావా?'

'అలా కమలతో అనలేదు కానీండి, పెళ్ళి చేసుకోవా లనుకున్నాను.'

'మరి ఎందుకు చేసుకోలేదు,?'

'మా అమ్మ ఒప్పుకోలేదు.'

'అయితే నాతో ఎందుకు చెప్పలేదు?'

'చెప్పే ధైర్యం చాలక...'

కమలతండ్రి యేమీ మాట్లాడలేదు.

'నామాట నమ్మండి నేనేం పాపమూ యెరుగను' అన్నాడు రమణమూర్తి.

అంతవరకూ రౌద్ర రుద్రుడిలా కని పించిన కమల తండ్రి కళ్ళనీళ్ళు గుక్కు కుంటూ 'ఇప్పుడు ఎవర్నని యేం లాభం? నాయనా అంతా అయిపోయింది. నా కూతురు దక్కలేదు. అంతే' అన్నాడు.

రమణమూర్తి మనస్సు వెయ్యి వ్రక్కలయింది. పొంగివస్తున్న దుఃఖాన్ని అణచుకోలేక పోయాడు. కళ్ళు నీటి బుంగలయినాయి.

'కమలకూడా నీలా ఏ పాపమూ ఎరగనంది. నీచేత ఆ సంగతి చెప్పిస్తానంది. కాని ఆ త్రాష్టుడు నమ్మితేనా? నాతల్లి మీద నాకు నమ్మకం ఉంది...'

రమణమూర్తి కళ్ళనుంచి నీటిబొట్లు కింద రాలుతూనే వున్నాయి.

ఆ తర్వాత మరికొన్ని వివరాలు తెలుసుకున్నాడు మూర్తి.

ఒకరోజు కమల ఏదో ఒక పుస్తకం చదువుతూ వుండగా అప్పుడు ఆమె భర్త ఆమెదగ్గరకు వచ్చాడనీ, ఆ పుస్తకంలో ఒకచోట రమణమూర్తి సంతకం కనిపించిందనీ, అది యెవరిదని అడగ్గా అది తన స్నేహితునిదని కమల చెప్పిందనీ ఆ తర్వాత వాళ్ళిద్దరి మధ్యా వాగ్వాదం సాగిందనీ కమల తండ్రి చెప్పలేక చెప్పాడు.

కమల తాను నిర్దోషిననీ, తన శీలాన్ని శంకించవద్దని భర్తను కాళ్ళావేళ్ళా పడి వేడుకుంది. కాని అతడు మాత్రం తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళని కూర్చున్నాడు. కటూక్తులాడి కమల మనస్సుని గాయపరిచాడు. ఇక అటువంటి భర్తతో కాపరం చెయ్యడం కంటె ప్రాణత్యాగం మంచిదనుకుంది. చెరువులో పడి ప్రాణాలు విడిచింది.

కమల విషాదగాథనంతా విని కన్నీరు మున్నీరుగా విలపించాడు రమణమూర్తి. తనవల్లనే ఒక నిండు ప్రాణం బలిఅయిందనుకున్నాడు.

పడక కుర్చీలోంచి మెల్లగా లేచి కూర్చున్నాడు మూర్తి.

పురాణానికి వెళ్ళిన తల్లి అప్పుడే లోపలికి అడుగు పెడుతోంది.

మూర్తి కళ్ళు తుడుచుకున్నాడు. పడక కుర్చీలోంచి లేవబోతూ వుండగా తల్లి దగ్గరికి వచ్చింది.

'కాఫీకూడా తాగకుండా, ఇందాకటి నుంచీ ఏం చేస్తున్నావురా నువ్వు?' అని అడిగింది.

మూర్తి మాట్లాడలేదు.

'ఆడపిల్ల తండ్రివవ్వావని అప్పుడే దిగులు పడుతున్నావా యేమిటి?'

'లేదమ్మా, సంతోషిస్తున్నాను.'

'ఇప్పుడు సంతోషంగా వుంటుంది...'

'ఇప్పుడే కాదమ్మా, ఎప్పుడూ సంతోషంగానే వుంటాను. చచ్చిపోయిన కమల మళ్ళీ బతికింది.' అన్నాడు రమణమూర్తి, గంభీరంగా. అతని కళ్ళల్లో ఒక కొత్త వెలుగు కనిపించింది. ●









తగ సంస్కృతము తెనుంగుగ జేయ, తెనుగు సంస్కృతముగ జేయంగల చతురమతి, నలుదెసలంగుల నెన్నగల కావ్యధారల ఘనుడు, ఆశువునందు గరము మేటి, అఖిలభూమీ పాలకాస్థాన కమలాకరోదయ తరుణ సూర్యోదయుడు శైవ వైష్ణవ పురాణావళీ నానార్థములు కరతలామలకమైనవాడు, ఆంధ్రభూమికి భాగ్యహారాభమైన శ్రీ తెనాలి అగ్రహార నిర్ణేత, అగ్రశాఖికా కోకిలము, సరసకవి, రామకృష్ణమహాకవి విరచితమైన 'పాండురంగ మాహాత్మ్యము'ను ఎమెస్కోవారు సగర్వంగా విడుదల చేస్తున్నారు-

# '70 జూలై ఎమెస్కో పాకెట్ బుక్స్ విడుదలలు

126. **దంతపు దువ్వెన**
విశ్వనాథ సత్యనారాయణ - రు 2/-

127. **గిరీశం ది గ్రేట్ ఫిలిం ప్రొడ్యూసర్**
కొడవటిగంటి కుటుంబరావు - రు 2/-

128. **విచిత్ర వినోదం** రోషన్ - రు 2/-

129. **రామచంద్ర విజయము**
చిలకమర్తి లక్ష్మీనరసింహము - రు 2/-




మీ వూళ్లో లేకపోతే మాకు రాయండి
అయిదూ ఒకేసారి తెప్పించుకుంటే
పోస్టేజి వుచితం - మొత్తం డబ్బు
ముందే మనియార్డరు కట్టాలి -
వి.పి.లుగా కావాలంటే, ప్రతిసారీ
అదనంగా పావలా పోస్టేజీ చెల్లి
ముందే మనియార్డరు కట్టాలి
రిజిస్టరు పోస్టయితే ప్యాకెట్ కి 95 పైసలు అదనం

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**
రాష్ట్రపతి రోడ్. సికింద్రాబాద్

ఎమెస్కోవారు ఇంతవరకూ 129 పాకెట్ బుక్స్, సంప్రదాయ సాహితి నాలుగు ప్రచురించారు పూర్తిలిస్టు ఎమెస్కో పాకెట్ బుక్స్ చివరి పేజీల్లో వుంటుంది -

# ఒకనాటి ప్రముఖులంతా ఏమయ్యారీనాడు?

సినిమాతారల భవిష్యత్తు ఏ రోజున ఎలా మారుతుందో చెప్పలేం ఇవాళ జూనియర్ ఆర్టిస్టులుగా నటించేవారు రేపు టాప్ రాంకింగ్ ఆర్టిస్టులు కావచ్చును ప్రస్తుతం పెద్దతారలుగా చెలామణీ అవుతున్నవారు రేపు కనిపించకపోవచ్చును. ఒకనాటి ప్రముఖ తారలంతా ఈనాడు లేరు సినిమాతారలకు ఈ స్థితి ఏ భాషలో అయినా ఏ దేశంలో అయినా తప్పదు ఈ విషయంలో హాలీవుడ్‌ని తీసుకున్నా ఇంతేనని స్పష్టమవుతుంది

బాల తారగానే ఎంతో ప్రతిభను సంతరించుకున్న షిర్లీ టెంపుల్ యునైటెడ్ నేషన్స్‌కి డెలిగేట్ అయింది. పాటలు పాడే తార డెన్నాడర్బిన్ గృహిణిగా మారింది డగ్లస్ "ఫెయిర్‌బాంక్స్ ఇప్పుడు ఒక కంపెనీ డైరెక్టరుగా ఉంటున్నాడు సుమారు 30 లేక 40 ఏళ్ల క్రితం సినిమా పరిశ్రమలో గొప్ప వెలుగు వెలిగిన బడాతారలు తిరిగి తెరకు రాగలరని ఊహాగానాలు చేయబడుతున్నవి అలాంటి వారిలో 'మే వెస్ట్' అనే ఆమె తన 76 వ ఏట—అంటే 29 సంవత్సరాల తర్వాత వెండితెరపై పునర్దర్శనమిచ్చింది



"మైరా బ్రికెన్‌రిడ్జ్ చిత్రం"లో తన 76 వ ఏట తెరపై పునర్దర్శనమిచ్చిన మే వెస్ట్ (ఎడమవైపు) ఆమె ప్రక్కన ఉన్నది రాక్వెల్ వెల్చ్

## 76 ఏళ్లు వచ్చినా తరగని సౌందర్యం!

'మే వెస్ట్' 1930 ప్రాంతాలలో తన అపురూపమైన అందంతో, అంగసౌష్టవంతో ప్రేక్షక హృదయాలను కొల్లగొట్టి 'సెక్స్ సింబల్'గా పేరు గాంచింది 1941 తర్వాత ఇంతవరకూ తిరిగి ఆమె ఏ చిత్రంలోనూ పాల్గొనలేదు ఈ మధ్య 'మైరా బ్రికెన్ రిడ్జ్' అనే ఒక్క చిత్రంలో మాత్రం నటించింది ఆ చిత్రం కిందటినెల 24 న న్యూయార్క్‌లోని క్రిటెరియన్ థియేటర్‌లో విడుదల అయింది

ఆ చిత్రం ప్రీమియర్‌కి 'మే వెస్ట్' వచ్చినపుడు జనం థియేటర్ బయట మూకవేస్తే రాలనంతగా ఉన్నారు, ఆమెను చూడాలని. ఆమెతోపాటు ఆ చిత్రంలో నటించిన నేటి ప్రసిద్ధ సెక్సీతార రాక్వెల్ వెల్చ్‌కూడా వచ్చింది. రాక్వెల్ వెల్చ్‌ను జనం గుర్తించినా పట్టించుకోలేదు 'మే వెస్ట్'కోసం ఎగబడ్డారు ఆమెను లోపలికి వెళ్లనివ్వకుండా చుట్టుముట్టారు పోలీసులు కల్పించుకుని లాఠీఛార్జి చేశాకగాని, లోపలికి వెళ్లలేకపోయింది మే వెస్ట్ ప్రజలే కాదు, ఫోటోగ్రాఫర్లు కూడా రాక్వెల్ వెల్చ్‌ను పట్టించుకోలేదు దాదాపు అన్ని కెమెరాలు 'మే వెస్ట్' నే క్లిక్ చేశాయి. అంత వయసున్నా ఇప్పటికీ ఆమె సౌందర్యం చెక్కు చెదరలేదు

'మే' గురించిన జోక్స్ ప్రజల్లో నేటికీ బహుళ ప్రచారంలో ఉన్నవి. ఏ తారా నిలవనంత చిరస్థాయిగా ప్రజల జ్ఞాపకాలలో మిగిలిపోయింది ఆమె — ఇన్నేళ్లు గడిచినా.

# 11 వ ఏటనే బాక్సాఫీసుతార

'ది గుడ్‌షిప్ లాలీపాప్' అనే పాట 1934 లో వచ్చిన 'బ్రైట్ ఐస్' చిత్రంలోనిది. ఈ పాటలోని మాటలంత పట్టుబడక పోయినా, విజిల్‌తోనయినా ట్యూన్‌ని పట్టేయగలిగే పాట అది ఆ పాట పాడి నటించినతార షిర్లీ టెంపుల్. అపుడా అమ్మాయి వయసు అయిదు సంవత్సరాలే! ఆ తర్వాత ఒక యేడాదికి బాక్సాఫీస్ తార అయింది. క్లార్క్ గేబుల్, మే వెస్ట్, జాన్ క్రాఫర్డ్ లాంటి ప్రసిద్ధతారల జాబితాలో చేరిపోయిందా పిల్ల, ఆ లేత వయసులోనే. 11 వ ఏట అంటే 1940 లో రిటైర్ అయి మళ్లీ చిత్రాల్లోకి రాలేదు. అటుపిమ్మట పాతికేళ్లదాకా ప్రజల కంటికి కనిపించలేదు. ఆ మధ్యలో పెళ్లి ... పిల్లలూ...ఇల్లూ...1965 నుంచి షిర్లీ అమెరికా రాజకీయాల్లో ఆసక్తితో పాల్గొనటం ప్రారంభించింది 1967లో కాంగ్రెస్‌కి నించుంది. 1969 లో ప్రెసిడెంట్ నిక్సన్—విద్యా, వైజ్ఞానిక సాంస్కృతిక సంస్థకు యునైటెడ్ స్టేట్స్ ప్రతినిధిగా ఆమెను నియమించారు.

# గృహిణిగా మారిన పాటలుపాడే తార!

1936 లో వచ్చిన 'హండ్రెడ్‌మెన్ అండ్ ఎ గర్ల్' చిత్రం సింగింగ్ స్టార్ డెన్నా డర్బిన్‌కి తన 16 వ యేటనే — మిగిలిన పాటలు పాడే తార లందరికన్న మంచిపేరు తెచ్చిపెట్టింది తర్వాత నాలుగేళ్లకి హాలీవుడ్‌ని వదలిపెట్టి ఫ్రాన్స్ వెళ్లిపోయింది స్వంత పనులమీద తప్ప చిత్రాలకోసమని ఆమె ఎన్నడూ మళ్లీ హాలివుడ్‌కి రాలేదు. ప్రస్తుతం డెన్నా తూర్పు ఫ్రాన్స్‌లోని ఒక చిన్న పల్లెటూరిలో గృహిణిగా జీవితం వెళ్లబుచ్చుతున్నది

# కంపెనీ డైరెక్టరయిన నటుడు!

'ది ప్రిజనర్ ఆఫ్ జెండా', 'సింద్‌బాద్ ది సైలర్' చిత్రాలద్వారా విశ్వఖ్యాతిగాంచిన పేరు ప్రఖ్యాతులు గడించుకొన్న డగ్లస్ ఫెయిర్ బాంక్స్ ఇంగ్లండులో వుంటున్నాడు ఇపుడు అతనొక కంపెనీకి డైరెక్టరు 60 ఏళ్లున్న డగ్లస్ 37 ఏళ్లలో 75 చిత్రాల్లో నటించాడు.

అద్భుతమైన శరీరం సౌష్టవం కలిగిన జానీవైస్ ముల్లర్ 'టార్జాన్'గా యింకా ప్రేక్షక హృదయాల్లో ముద్ర వేసుకునే వున్నాడు. టార్జాన్‌గా అతను వేసుకునే 'లైన్‌క్లాత్' ఎం జి ఎం. సంస్థ అమ్మకానికి పెట్టినపుడు 200 డాలర్లు వచ్చిందట! సినిమాల్లోకి రాక ముందు వైస్‌ముల్లర్ ఒలింపిక్ ఈతగాడు. ఇపుడతను — తను స్వంతంగా స్థాపించిన 'వైస్‌ముల్లర్ స్విమ్మింగ్ స్కూల్'కి ఈత సలహాదారుగా ఉంటున్నాడు.

ఇలాగ ఇంకా ఎందరెందరో...ఎక్స్‌ట్రాలుగా ... ఉండిపోయారు. ఒకప్పుడు చిత్ర రంగంలో గొప్ప తారలుగా గుర్తించబడ్డ వీరంతా ఈ నాడు తెరమరుగున పడిపోయారు. మరణం మరికొందరు ప్రతిభావంతులైన తారల్ని మనకి దూరంచేసింది. వారిలో ఎరోల్‌ఫ్లిన్, స్పెన్సర్‌ట్రేసీ, గారీ కూపర్, క్లార్క్ గేబుల్, జీన్‌హార్లో, బస్టర్‌కీటన్, రుడోల్ఫ్ వాలెన్‌టినో, జూడీ గార్లెండ్, స్టాన్ లారెల్ ఉన్నారు.

ఛార్లీ చాప్లిన్, కారీగ్రాంట్, బెట్టీ డేవిస్, జింజర్ రోజర్స్, మార్క్స్ బ్రదర్స్ మొదలయినవారింకా మనతో ఉన్నారు.

(ఫోవఫే) ●



"ప్రిజనర్ ఆఫ్ జెండా"లో డగ్లస్ ఫెయిర్‌బాంక్స్ (జూ)




ఉన్నవ విజయలక్ష్మి

## 2

ఒకరోజు—లంచ్ అవర్‌లో, కాఫీ త్రాగటానికి వెయిటింగ్ రూమ్‌వేపు వెళ్ళబోతోంది కళ్యాణి.

ఉద్యోగంలో చేరిన మరునాటినుంచీ కళ్యాణికూడ ఫ్లాస్కునిండా ఏదో తెచ్చుకోటం మొదలుపెట్టింది.

కేంటీన్‌వేపు వెళ్ళబోయిన మురళీ మళ్ళీ వెనక్కి వచ్చాడు. అప్పటికి మిగిలిన వాళ్ళంతా వెళ్ళిపోయారు. కమల అవాళ ఆఫీసుకి రాలేదు. తార భోజనం చేస్తోంది గదిలో.

'ఇవాళ మీరు, నాకో చిన్నసహాయం చెయ్యాలి?' అన్నాడు మురళీ.

'నేనా ?' తెల్లబోయిన కళ్యాణి గుమ్మందగ్గరే ఆగిపోయింది.

'మరేంలేదు...రేపు దసరాకి మా చెల్లాయిల కిద్దరికీ చీరలు కొని పంపించాలని సరదాగా వుంది.— నాకేమో ఈ చీరల అందాలూ, నాణ్యాలూ అస్సలు తెలియవు — ఎప్పుడూ డబ్బు పంపించటమేకాని ఏదీ కొనటం అలవాటులేదు—ఇన్నాళ్ళ తరువాత ఇవాళ గొప్పగా వాళ్ళకి చీరలు పంపించబోయి ఏ వెర్రిమొర్రి రకాలో కొన్నానంటె, వాళ్ళు వాటిని జాగ్రత్తగా అట్టేపెట్టి ఈసారి నేను వెళ్ళినప్పుడు నా మొహాన్న పారేస్తారేమోనని భయం వేస్తోంది...'

'చీరలు సెలక్టుచేసి పెట్టమని నన్నే అడగటం బలేవిచిత్రంగా వుంది— చీరల్లో కొత్త ఫ్యాషన్లూ, ఈ రోజుల్లో వస్తున్న రకరకాల డిజైన్లూ వాటిపేర్లూ కూడ నాకు తెలియవు. ఏదో వో షాపులోకి వెళ్ళటం అక్కడ ఎదురుగా కనిపించిన చీరేదో కొనుక్కు తెచ్చుకోటం తప్ప పది షాపులు తిరగటం పది రకాలు తీయించి గంటలకొద్దీ బేరం చెయ్యటం నాకు చేతకానూ కాదు...ఇష్టమూ వుండదు!'

'మరేం ఫర్వాలేదు. మీరు ఏదిబాగుంది అంటే అదే తీసుకుంటాను.' అని, అంతలో మరేదో ఆలోచన వచ్చి 'లేకపోతే మీచేతికి డబ్బు ఇస్తాను. మీరే తెచ్చిపెట్టండి.' అన్నాడు.

'అహా, అలా ఎందుకూ ? సాయంకాలం ఆఫీసు అయిపోగానే వెళ్దాం— సుల్తాన్‌బజారులో, నేనెప్పుడూ కొనుక్కునే షాపుకి వెళ్దాం.'

'వో, థ్యాంక్సు—వస్తానుమరి.' అనేసి హాలుదాటి కేంటీన్‌వేపు వెళ్ళిపోయాడు.

సాయంకాలం ఇద్దరూ షాపింగ్ ముగించుకుని బస్సుస్టాపులో నిలబడ్డారు.

'వో, మురళీ !' అన్న పలకరింపుతో మురళీ తలతిప్పి చూశాడు. కాస్త దూరంలో వాసు, పాపచెయ్యి పట్టుకుని నిలబడి వున్నాడు. ఆ ప్రక్కనే అతని భార్య శారద వుంది. ఇద్దరి మొహాలలోనూ అభిమానంతో కూడిన చిరునవ్వు తొణికిసలాడుతోంది. వాళ్ళని చూస్తూంటే, వాళ్ళు చాలా సేపటినుండి తనని గమనిస్తున్నారేమో ననిపించింది మురళీకి — ఇంతసేపూ తను మరో ధ్యాసలేనట్లు కళ్యాణితో ఆ కబురూ ఈ కబురూ చెప్పటం వాళ్ళు గ్రహించారేమో అన్న వూహవచ్చి ఒక్కసారి సిగ్గుపడిపోయాడు. అయినా తన మనస్సులోని వులికిపాటుని తొట్రుపాటుని పైకి కనబడనీయకుండా మామూలుగా మాట్లాడేస్తూ 'శవిక మిస్. కళ్యాణి—మా ఆఫీసులోనే పని చేస్తున్నారు.' అని వాళ్ళకి,

'మిస్టర్ అండ్ మిసెస్ వాసుదేవరావు.' అని కళ్యాణికీ చెప్పి పరిచయం చేశాడు.

'మొన్న ఆదివారం, ఇంటికి వస్తావను కున్నాము,' అంది శారద...

మూడేళ్ల క్రిందట, అంటే మురళీ వుద్యోగంలో చేరిన కొత్తలో వో రోజున బస్సుస్టాపులోనే మురళీ వాను కలుసుకున్నారు. తరువాత తరుచూ అక్కడ కలుసుకోటంతో పేర్లూ వూర్లూ చెప్పుకుని పరిచయం చేసుకున్నారు — తరువాత ఆ పరిచయం స్నేహంగా మారింది. ఒకరింటికి ఒకరు రాకపోకలు సాగించుకోటం దాకా వచ్చింది — శారదని మురళీ చనువుగా అక్కయ్యా అని పిలుస్తాడు — అతని గదికి వాళ్లు రావటం అరుదే అయినా మురళీ తరుచు వాళ్లింటికి వెళ్తాండేవాడు. ముఖ్యంగా ఆదివారం సాయంకాలం అక్కడికివెళ్లి శారదపెట్టిన టిఫిన్‌తిని కాఫీతాగి, వాళ్లకి వేరే మరే ప్రోగ్రామూ లేకపోతే కాస్సేపు అక్కడ బాతాఖానీ వెయ్యటం పరిపాటి అయిపోయింది — మధ్యలో ఎప్పుడైనా ఒకటి రెండు వారాలు అతను వెళ్లకపోతే వాళ్లు గుర్తు వుంచుకుని మరీ అడుగుతారు. అల్లా అడిగిన ప్రతిసారీ, మరో ఫ్రెండు వచ్చాడనో, అనుకోకుండా సినిమా ప్రోగ్రాం పడిందనో టకీమని సమాధానం చెప్పగలిగే మురళీ ఇవాళ శారద అడిగిన ప్రశ్నకి ఏం సమాధానం చెప్పాలో తోచక ఒక్క క్షణం తబ్బిబ్బు పడిపోయాడు. అవాళ అనుకోకుండా పార్కుకి వెళ్లాననీ, అక్కడ అదృష్టవశాత్తు కళ్యాణి కనిపించిందనీ ఆమెతో ఖబుర్లు చెప్తూ కూర్చుంటే మరెవ్వరూ కూడా గుర్తు లేకుండా పోయారనీ చెప్పటానికి మొహమ్మాట పడిపోయాడు. ఇంతలోనే ఆపద్బాంధవుడిలాగా బస్సు వచ్చి ఆగింది. వో నలుగురు పాసెంజర్సుని దింపి, క్యూలో ముందుగావున్న నలుగుర్ని ఎక్కించుకుని వెళ్లిపోయింది ఆ బస్సు — ఆ హడావిడిలో అతను సమాధానం చెప్పలేదన్న సంగతి వాళ్లు మరిచిపోయారు.

'మరో బస్సు వచ్చేసరికి ఎంతసేపవుతుందో — మేం రిక్షాలో వెళ్లిపోతాం.' అంది శారద.

ఆ మాటకోసమే ఎదురు చూస్తున్నవాడిలా, 'సరే వెళ్లండి' అనేసి బ్రతుకు జీవుడా అనుకున్నాడు మురళీవాళ్లు వెళ్లిన వైపే చూస్తూ... లేకపోతే ఇంకా ఇంటికి వెళ్లిపోయాడు.

మాట్లాడుతూ అలాగే నిలబడివుంటే, తనూ కళ్యాణి కలిసి షాపింగుకి వచ్చిన సంగతి ఎక్కడ బయటపడి పోతుందో, దానికి వాళ్లేమనుకుంటారో అన్నట్లు మొహమ్మాట పడిపోయాడు.

కాస్సేపటి తరువాత కళ్యాణి వెళ్లాల్సిన బస్సు వచ్చింది. ఆమెకి మరోసారి థ్యాంక్సు చెప్పి బస్సుఎక్కించి తను రిక్షాలో

* * *

గేటు తెరుచుకుని ఇద్దరూ పార్కులో అడుగుపెట్టారు —

ఇంక తరువాత జరగబోయే సంభాషణని తలుచుకుంటూంటేనే మురళీ మనస్సు పట్టలేని వుత్సాహంతో ఎగిరెగిరి పడుతోంది — ఆ వుత్సాహం అంతా వచ్చి మొహం మీద ముద్ర వేసుకు కూర్చు



న్నట్లు అతని కళ్ళూ మొహం అదో వింత కాంతితో మెరిసిపోతున్నాయి...అతని కళ్ళకి చుట్టూ పరిసరాలూ ప్రకృతీ అంతా మరీ మనోహరంగా అనిపించింది. అదివరకు ఎన్నిసార్లో వచ్చి కూర్చుని గంటలు గంటలు గడిపే పార్కులో అదివరకు ఎన్నడూ కనిపించని ఎన్నో కొత్త అందాలు ఇవాళ అనుభవంలోకి వస్తున్నట్లుంది. అక్కడి ప్రతి మొక్కా ప్రతి పువ్వూ కొత్తగా మెరిసిపోతున్నట్లున్నాయి. మనస్సుని గిలిగింతలు పెట్టే వూహలు, ఇంతటి ఆహ్లాదంతో పరవశించిపోయేలా చేసే పరిసరాలు ఒక్కక్షణం తన నిగ్రహాన్ని చెదరగొట్టేసినట్లయి; అలా తనకి దూర దూరంగా నడుస్తున్న కళ్యాణిని గబుక్కున దగ్గరకి లాక్కుని ఒక్కసారి తనివితీరా గుండెలకి హత్తుకోవాలనే కాంక్ష కలిగింది—మళ్ళీ అంతలోనే తెలివి తెచ్చుకున్నట్లు తన వూహలకి తనే సిగ్గుపడిపోయాడు...ఇన్నాళ్ళ స్నేహంలోనూ తను అతి చనువు తీసుకున్న సందర్భాలు కాని మాటలలోనయినా హద్దులు మీరిన సన్నివేశాలు కాని ఏనాడూ జరగలేదు. అందుకు తన సభ్యత సంస్కారం ఒక్కటే కారణం అనేకంటే కళ్యాణి ప్రవర్తన కూడా తమ ఇద్దరిమధ్యా వో ఇనపగోడలా నిలిచేది అని చెప్పవచ్చు—పెదవులు చిరునవ్వుతో స్వాగతం పలుకుతున్నట్లే వున్నా ఆమె మొహంలో ఏదో గాంభీర్యం తనని శాసించి అడుగు ముందుకు వెయ్యకుండా చేసేది—మనస్సు విప్పి మాట్లాడుతూన్నట్లే వున్నా ఆమె చూపులు మాత్రం తనని చొరవగా దగ్గర జేరనీయకుండా అంత దూరంలోనే నిలబెట్టేస్తాయి — ఇంక ఎన్నాళ్ళు ఈ బింకం సాగించుకుంటుంది? తనుచెప్పేది వినగానే కళ్యాణి మొహంలో రంగులు ఎలా తిరిగిపోతాయో ఆమె చెక్కిళ్ళల్లో గులాబీలు ఎలా విచ్చుకుంటాయో తాను వూహించుకో గలడు... అసలు— సిగ్గుతో మొగ్గలా ముడుచుకుపోతూ కళ్ళెత్తి తనవంక చూడగలదా? పెదవి విప్పి మాట్లాడగలదా? పెళ్ళికూతురులా తలవంచుకుని మౌనంగానే తన ఇష్టాన్ని వ్యక్తం చేస్తుందేమో? లేకపోతే, 'నా కెప్పుడో తెలుసు మీ సంగతి' అంటూ చిలిపిగా తనవంక చూస్తుందా?

ఊహాలలో తేలిపోతూనే కళ్యాణితో పాటు నడిచి ఫౌంటెన్ దగ్గరికివచ్చి పచ్చికమీద కూర్చున్నాడు మురళీ. అతనికి కొంత దూరంలో కూర్చున్న కళ్యాణి తల ఎత్తి అటువేపు నీటి తుంపరల కేసి చూస్తోంది.

'అక్కడేమిటి చూస్తున్నావు? ఇటు తిరుగు...నీకో మంచిమాట చెప్తాను.వింటున్నావా? ... వో నాలుగు రోజులయినా శలవుపెట్టి వో సారివచ్చి వెళ్ళమని నాన్నగారి దగ్గరనుంచి వుత్తరంవచ్చింది — వాళ్ళెందుకు రమ్మన్నారో కారణం కూడ వ్రాశారులే—నేను అక్కడ పెళ్ళికూతుర్ని చూడాలిట—అలాంటి వుత్తరం రావటం మంచిదే అయిందిలే. లేకపోతే నే నిలాగే ఇంకా కొన్నాళ్ళు తాత్సారం చేసేవాడిని...ఇంక, ఇప్పుడు ఏం చేస్తానో తెలుసా? ఏం వింటున్నావా? నేను అంతదూరం రానక్కరలేదు. నా నిర్ణయం ఏదో ఇక్కడే జరిగిపోయింది అని వ్రాసేస్తాను—ఏం వ్రాసేయనుంటావా మరి?...' మురళీగొంతు ఉల్లాసంగా, ఆ ఎదుటి మనిషి మనసు పురివిప్పిన నెమలిలా నాట్యం చేసేటంత మధురంగా మృదువుగా పలుకుతోంది ... అయితే కళ్యాణి మీద వాటిప్రభావం ఏమీలేనట్లు కదలిక మెదిలిక లేకుండా అలాగే కూర్చుంది...

'కళ్యాణి!'

'............'

'వో, కళ్యాణిదేవి, ఏమిటా పరధ్యానం.'

కళ్యాణి తల తిప్పకుండానే, ఊఁ... ఏమిటి?' అంది, అప్పుడే నిద్రలోంచి మెళుకువ వచ్చినట్లు అంతక్రితం అతను చెప్పిందంతా అసలు విననే లేదన్నట్టు.

'ఏమిటే అంటూ ఇవ్వడడుగుతున్నావా? నేనింత హుషారుగా చెప్పుకుపోతుంటే నువ్వు వినకుండా చేస్తున్న ఘనకార్యం ఏమిటి.' చిరుకోపం నటిస్తూ చేతికందిన గడ్డి పరకలు తుంపి కళ్యాణి మీదకి విసిరాడు.

మెల్లిగా తలతిప్పి మురళీ కళ్ళలోకి చూసింది కళ్యాణి—అతను అనుకున్నట్లు ఆశించినట్లు కళ్యాణి చూపులలో చిరునవ్వు చిలిపి తనం చిందులాడటం లేదు— ఆ కళ్ళు సిగ్గుబరువుతో వాలిపోవటం లేదు— ఆక్షణంలో అతను చూస్తున్న కళ్యాణికి ఇన్నాళ్ళ తనకి పరిచయమైన కళ్యాణికి అసలు పోలికే లేదేమో ననిపించింది—సాయంకాలపు వల్చటి నీరెండలో పసిమిఛాయలో మరీ అందంగా మెరిసిపోతూవుండే కళ్యాణి మొహం ఇవాళ దైన్యానికి ప్రతిరూపుగా వుంది — తనని నవ్వించి రెచ్చగొట్టకపోయినా ఆదరంగా అభిమానంగా పలకరించే ఆ కళ్ళల్లో అసలు జీవకళ అన్నదే లేనట్లు గాజుబుడ్లలా వున్నాయి— మురళీ ఎలాగో అయిపోయాడు. ఆశాభంగంతో పాటు ఆశ్చర్యంతో అతనికి క్షణం నోటమాట రానట్లే అయింది.

'సారీ కళ్యాణి— నా ధోరణిలో నేను చెప్పుకుంటూ పోయానేకాని నువ్వు వింటున్నావా లేదా అనయినా ఆలోచించలేదు. వచ్చేటప్పుడు వున్న సరదా క్రమంగా దూరం అయిపోయి నువ్వు ముభావంగా వుండిపోయావు అనే విషయాన్నికూడ గమనించలేక పోయాను. చెప్పు దేన్నిగురించి నువ్వు దిగులుపడుతున్నావు...ఆ ఆలోచనలతో ఇలా నువ్వు ఒక్కదానివే తలబద్దలు కొట్టుకోకపోతే నాతో కొంచెం చెప్పరాదా—' కళ్యాణి నోటితో చెప్పించాలని అడిగాడే కాని ఆమె దేన్నిగురించి ఆలోచిస్తోందో అతనికి చూచాయగా అర్థం అయిపోయినట్లే వుంది.

'ఇన్నాళ్ళూ మా మధ్య కులాల ప్రసక్తి రాలేదు—ఒకవేళ ఇప్పుడు అదే ఒక అభ్యంతరంగా నిలిచినా నేను దానిని లక్ష్యపెట్టదలచుకోలేదు. అని స్పష్టంగా చెప్పేస్తాను—మనసులు కలిసిన తరువాత కులాలు ఒక ప్రతిబంధకం ఎప్పుడూ కావు అని కళ్యాణికి నమ్మకం కలిగేలా బుజ్జగించి చెప్తాను...' అనుకున్నాడు. తన మనస్సు గ్రహించకుండా దోషిలా తల వంచుకుని పచ్చికమీద చేతో నిమురుతూ మౌనంగా కూర్చున్నకళ్యాణిని చూస్తుంటే జాలి ముంచుకు వచ్చిందతనికి— 'ఊఁ— చెప్పాలి మరి. అన్నాడు చిరునవ్వుతో కవ్విస్తూ.

'మీకు అంతా చెప్పాలనే చాలా రోజుల

నుండీ ప్రయత్నిస్తున్నాను— కాని చేత కావటం లేదు.'

'ఊహూ అంత పెద్ద విషయమా?'

'నేనొక కథ చెప్తాను వింటారా?'

'అబ్బ ఇప్పుడా — ముందు నేను ఇందాక అడిగిన దానికి సమాధానం చెప్పు ఆ తరువాత; ఒకటికాదు, వంద కథలు వింటాను.'

'అలా తొందరపడితే ఎలామరి—ఈ కథ విని మీరు చెప్పబోయే సమాధానంమీద ఆధారపడి వుంటుంది నా సమాధానం.!

'ఊహూ ?'

'అనగా, అనగా ఒక అమ్మాయి...' మెల్లిగా మొదలుపెట్టిన కళ్యాణి, చెప్పటం ఆపి ఒక్కసారి అతని కళ్లల్లోకి చూసింది.

'నువ్వు చెప్పబోయేది నాకు తెలుసు లేవోయ్— నాకు ఈ కులాలతో నిమిత్తం లేదు. నా నిర్ణయం వింటే నీ భయం గియం అన్నీఎగిరిపోతాయి'అన్నట్లు దీమాగా, చిరునవ్వుతో మెరిసిపోతున్నాయి అతని కళ్లు...ఆ మెరుపు చూడటానికే ధైర్యం చాలనట్లు చటుక్కున తల వాల్చేసుకుంది —ఆ తరువాత ఒక్కొక్క అక్షరమే కూడ బలుక్కుంటున్నట్లు దిగజారిపోతున్న ధైర్యాన్ని కూడదీసుకుంటున్నట్లు అతి నెమ్మదిగా చెప్పటం మొదలుపెట్టింది.

'ఆ అమ్మాయి ... ఆ అమ్మాయి పుట్టింది...బోగంవాళ్ల యింట్లో...'

అప్రతిభుడై పోయాడు మురళీ— ఆ ఒక్కమాట ఒక్కసారిగా సర్వ ప్రకృతినీ స్తంభింపజేసి తనని శిలగా మార్చివేసినట్లయింది...అసలు చలనమే లేదనుకున్న అతని అణువణువులో,'కళ్యాణి, వేశ్యకూతురు — వేశ్యకూతురు కళ్యాణి' అనే రెండుమాటలే లెక్కలేనన్నిసార్లు ప్రతిధ్వనిస్తూ భయంకరంగా వినిపిస్తూంటే కోపంతో వోవిధమైన భయంతో అతని సర్వాంగాలూ కంపించినట్లయింది — ఒక్కక్షణం సేపు కొట్టుకోవటమే మానేసింది అను కున్న అతనిగుండె మితిమీరిపోయిన భయో ద్వేగాలతో దడదడ లాడిపోవటం మొదలు పెట్టింది.

తనలోని సంస్కారానికి కళ్యాణి మురిసిపోవాలని, ఇన్నాళ్ళూ తను చేసిన స్నేహం ఒట్టి కాలక్షేపానికి మాత్రమే కాకుండా, దానిని శాశ్వతమైన బంధంగా మార్చుకోటానికి తనెంత సాహసమైనా చేస్తానని ... ఎన్నో ఎన్నెన్నో చెప్పాలను కున్న మురళీ పెదవివిప్పి మాట్లాడ టమే మరిచిపోయిన వాడిలా, రెప్పకూడా వాల్చకుండా అలా చూస్తూ కూర్చుండి పోయాడు.

కాని కళ్యాణి పరిస్థితి అందుకు పూర్తిగా వ్యతిరేకంగా వుంది...ఆమొదటి ఒక్కవాక్యం చెప్పటానికి తన ఒంట్లో శక్తిఅంతా ధారపోస్తూ విలవిల్లాడి పోయింది. ఆ మాటలు తన నోటితో వుచ్చరించలేని అశక్తతతో బిగుసుకు పోయింది. తనని చూసి తనే అసహ్యించు కుంటున్నట్లు, జాలిపడుతున్నట్లు మొహంమీద కత్తివేటుకు నెత్తురుచుక్క లేకుండా పాలిపోయింది ... కాని చివరికి ఎలాగో ఆ ఒక్కమాట చెప్పేసిన తరువాత ఆమెలో ఎక్కడలేని ధైర్యము చొరవా, మొండితనమూ చోటు చేసుకున్నాయి. వినేవాళ్లుంటే తన కథ అంతా అప్పటి కప్పుడు చెప్పేయాలి అన్నంత ఆత్రంగా వుంది ... అయినా అది—ఆ కథ...తనంత తానుగా మొదలుపెట్టటం కాక,

'ఊ...ఆ తరువాత ? ఏమిటి ? నీ కథంతా వినాలనివుంది నాకు.' అన్న మాటలు అతనినుంచి వినాలని వెర్రి ఆశతో కోరికతో నిరీక్షిస్తూ కూర్చుంది ...కాని, క్షణాలు అతి నిశ్శబ్దంగా గడిచి పోతున్నాయి - ఆమెకి అర్థం అయింది... అయినప్పటికీ ...

మురళీ మౌనం, గాంభీర్యం గ్రహించి కూడ కళ్యాణి చలించలేదు — 'ఇందులో వింత ఏమీ లేదు. ఈ పరిస్థితి నేను వూహించినదే.' అనుకుని కొద్ది క్షణాలు ఆగి మళ్లీ మొదలుపెట్టింది తల వాల్చు కునే—

'నాకు జ్ఞానం వచ్చినప్పటినుండి ఒకే ఒక్క కోరిక నా అణువణువులోనూ నిండి పోయింది—అహోరాత్రాలు ఒకే ఆలోచన ఒకే ధ్యాస నా గుండెల నిండా ఆక్రమించు కుంది—ఆడదాన్నిగా పుట్టినందుకు ఒకరి భార్యగా పిల్లల తల్లిగా నిండయిన సంసా రంలో బ్రతుకుతూ గర్వంగా సంతోషంగా పదిమందిలోనూ తల ఎత్తుకు తిరగాలనేదే నా ఆశయం...నాది ఎంత పవిత్రమైన కోరిక అయినా అది నా పట్ల దురాశే అవుతుందని, ఎంతోమంది ఆడవాళ్లకి అడగకుండానే అందుబాటులోకి వచ్చే ఆ



అదృష్టం నాకు గగనకుసుమమే అవుతుందనీ నేను గ్రహించుకోక పోలేదు...అయినా ఆ కోరికని చంపుకోటం నా వశం కాలేదు. రోజులు గడిచినకొలదీ ఆ కాంక్ష అంతకంతకూ బలవత్తరమై అదే నా వూపిరిగా, అదే నా ప్రాణంగా అయిపోయింది...అంతే కాదు, ఏదో ఒకనాటికి నా కోరిక తప్పక నెరవేరుతుంది అనే ఆశాభావం కూడా నా అంతరంగంలో పొటమరించసాగింది—ఆ ప్రలోభాన్ని, బలహీనతను జయించటం నా శక్యం కాలేదు...అందుకే ... అందుచేతనే...మీకు ఈ మాత్రం దగ్గరగా రావటానికి సాహసించాను.' — చెప్పటం ఆపి ఒక్కసారి కళ్ళు ఎత్తి మురళీ మొహంలోకి చూసింది—ఒక్క క్షణం వారి చూపులు కలుసుకున్నాయి—అంతే—అప్పటిదాకా రెప్పవాల్చటం కూడ మరిచిపోయినవాడిలా కళ్యాణినే చూస్తున్న మురళి, ఆమె తలఎత్తిన మరుక్షణంలోనే చటుక్కున చూపులు ప్రక్కకి తిప్పేసుకున్నాడు—

అతని చూపులలోని భావం — అది తనపట్ల ఆగ్రహమూ, అసహ్యమూ, ఉదాసీనతా ముప్పేటలుగా అల్లుకుని అదోవిధమైన కరుకుదనాన్ని నింపు

## ఆచరణలో ...

కుంది...

మనస్సు చివుక్కుమన్నా మౌనంగా వుండలేక మళ్ళీ చెప్పటం మొదలుపెట్టింది.

'నాకు తెలుసు — మీకు... మీకే అవి ఏమిటి? ఈ పరిస్థితిలో వున్న ఏవ్యక్తికయినా నామీద కోపం వస్తుంది. మొదట్లో నేనా సంగతి చెప్పకపోవటం పొరబాటే ఏమో... నిజం చెప్పాలంటే— నేను ఎన్నోసార్లు నా చరిత్రంతా మీకు చెప్పాలని ఎంతగానో ఆరాటపడ్డాను. కాని, అంతలోనే నాకు అనిపించేది అది విన్న తక్షణం మీరు నాకు దూరంగా వెళ్ళిపోతారు. జన్మలో మరి నా మొహం కూడ చూడరు. ఆ భయంతోటే, మిమ్మల్ని వదులుకోలేని పేరాశతోటే ఎప్పటి కప్పుడు ఇవాళ కాదు, మరోనాడు చెప్తాను అనుకుంటూ వాయిదాలు వేసుకుంటూ వచ్చాను... ఎంతో సంతోషంగా, సరదాగా ఖబుర్లు చెప్పుకుంటూ గడిపేస్తున్న సమయంలో వినటానికే జుగుప్స కలిగించే నిజాన్నిచెప్పి మనమధ్య వాతావరణాన్ని కలుషితం చెయ్యటం ఇష్టంలేకనే నోటి చివరిదాకా వచ్చినమాటలని కూడ అంతలోనే వెనక్కి తీసుకుంటూండే దాన్ని...అంతే కాని మిమ్మల్ని మభ్యపెట్టి ఎలాగో అలా మీ జీవితంలో చోటు చేసుకోవాలనే దురుద్దేశ్యం నాకు ఏనాడూ లేదు— మన పరిచయంలో, స్నేహంలో ప్రతీక్షణాన్ని ఎంతో అపురూపంగా చూసుకునే నేను మిమ్మల్ని మోసం చెయ్యాలని ఎప్పుడూ అనుకోలేదు... మొట్టమొదటగా మీ మనస్సు అర్థం చేసుకోగలిగిన క్షణంలో నేనెంత పరవశించిపోయానో, నా అంతటి అదృష్టవంతురాలు మరెవ్వరూ వుండరన్నట్లు ఎంతగా మురిసిపోయానో — అది మాటలలో చెప్పటం నాకు చేత కాదు. అయితే ఆ స్థితిలోకూడ నా స్థానాన్ని నేను మరిచిపోలేదు. ఏదో ఒకనాడు యదార్థాన్ని మీకు తెలియజెయ్యాలనీ, అది విన్నతరువాత, మీ నిర్ణయం ఎలాంటిదయినాసరే సంతోషంగా దాన్ని ఆమోదించాలనీ నేను ఆనాడే నిశ్చయించుకున్నాను. ఇంక ఎలాంటి వాయిదాలు వెయ్యకుండా నా సంగతంతా మీకు చెప్పాల్సిన అవసరం, అవకాశం ఇవాళ నాకు వచ్చింది. ఎలాంటి సంకోచమూ లేకుండా ఏ విషయమూ మరుగుపరచకుండా నా చరిత్ర అంతా మీకు చెప్పాను. అదంతా విన్నతరువాత నా కోరిక న్యాయమైనది అవునో కాదో మీరే నిర్ణయించండి.

కళ్యాణి గొంతులో గద్గద్యం, చూపులలో దైన్యం ఆమె అంతరంగంలోని ఆవేదనని స్పష్టం చేస్తున్నాయి. అయితే మురళీ మనస్సు ఏ విషయాన్ని గమనించ కలిగే స్థితిలో లేదు. 'ఏమిటిది? ఎందుకిలా అయింది?' అని ఆలోచిస్తున్న కొద్దీ అతనిలో ఆగ్రహమూ ఆవేదనా కూడ వెల్లుబికి వస్తున్నాయి. ఏ మాట మాట్లాడటానికీ, వినటానికి కూడ అతని మనస్సు ఇచ్ఛగించటం లేదు.



అతని పరిస్థితిని అర్థం చేసుకున్న కళ్యాణి తన ఆరాటాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ అర్థిస్తున్నట్లే అంది—'నన్ను క్షమించండి. మీ మనస్సుకి చాలా కష్టం కలిగించాను......కాని నా కథంతా వింటే'

'ఊహూ— ఇప్పుడుకాదు......మరోసారెప్పుడైనా వింటాను' ఎలాగో ఆ రెండు మాటలూ అనేసి చరచరా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు మురళీ — అలా వెళ్ళిపోతున్న అతన్ని చూస్తుంటే కళ్యాణి కళ్ళు చమర్చి రెండు అశ్రుబిందువులు చెంపలమీదికి జారిపడ్డాయి.

'మరోసారి వింటారా మురళీ— నాకు తెలుసు ఆ మరోసారి అనేది మన జీవితంలో ఇంకరాదు.' అనుకుంటూ విరక్తిగా నవ్వుకుని, కొంగులో చెంపలు తుడుచుకుని పార్కుదాటి ఇంటివేపుకి బయలు దేరింది మెల్లిగా.

* * *

ఇల్లుచేరుకుని తాళం తీసుకుని తలుపులు తెరుచుకుని గదిలో మంచంమీద వాలిపోయింది కళ్యాణి— ఇంతసేపూ నిగ్రహించుకుంటూ వచ్చిన దుఃఖము ఒక్కసారి పొంగివచ్చి, కన్నీళ్ళు జలజలా రాలి చెంపలని తడిపేస్తూంటే కొంగుతో అద్దుకుంటూ.

'ఏమిటిది? ఎందుకు నాకీ దుఃఖం... ఇలాంటి పరిస్థితే ఎదురవుతుందేమోనని నేను ఎన్నోసార్లు అనుకున్నదే కదా — ఇక అలాంటి నేను, ఇవాళ మురళీ ప్రవర్తనకి కొత్తగా బాధపడటం ఏమిటి? ఏదో జరగక్కూడనిది జరిగినట్లు ఇంతగా కుమిలిపోవటం ఏమిటి?' అని తనని తనే మందలించుకుని మనస్సుని అదుపులోకి తెచ్చుకోవాలని ప్రయత్నించింది.

ఇన్నిరోజులూ యథార్థం అనేది ఎదురుగా నిలబడి కొరడా ఝళిపిస్తూ కళ్యాణి వూహలకి కళ్ళెం వేస్తున్నా ఆమె అంతరాంతరాల్లో ఏదో చిన్న ఆశారేఖ మినుకు మినుకుమంటూ మెరవటం మానలేదు —

'సంఘంలో మా మా స్థానాలని మా మధ్యగల దూరాన్ని నే నెప్పుడూ మరిచిపోలేదు—ఒక మహాపర్వతపు ఉన్నత శిఖరంమీద మురళీ నిలబడివుంటే క్రింద అగాధంలాంటి లోయలో నేను వున్నాను— అయినా అతను దీర్ఘమైన బాహువులు చాచి నన్ను అందుకుంటాడనీ తనచేయి ఆసరాతో నన్నుకూడ ఆ శిఖరంమీదికి చేర్చుకుంటాడనీ అనిపించేది—కళ్యాణి, నీ చరిత్ర ఏదైనాకానీ, నీ తల్లితండ్రులు ఎవరైనాకాని వాటితో నాకేమి నిమిత్తం లేదు. నాకు కావలసింది నువ్వు...అర్హతని మించి ఆశలు పెంచుకున్నాను అనేమాట నువ్విక అంటే నేను వూరుకోను — నా భార్యగా నాతో జీవితం పంచుకోగలిగే అర్హతలన్నీ నీకు వున్నాయి. అంటూ అనురాగంతో అక్కున చేర్చుకుంటాడు అనుకున్న మురళీ నా చరిత్ర వింటేనే పాపం చుట్టుకుంటుంది అన్నట్లుగా పరుగెత్తి పారిపోయాడు — నాచేయి అందుకోవాలని చాపబోయిన చేతిని గబుక్కున వెనక్కి లాక్కుని నీ బ్రతుకంతా ఈ అగాధంలోనే గడపాలి, నువ్వు పైకిరాలేవు, నీ ఖర్మ యింతే— అన్నట్లుగా వెళ్ళిపోయాడు.' ... ఆలోచిస్తున్న కొద్దీ కళ్యాణి అంతరంగం గిలగిల కొట్టుకుపోతోంది.

మురళీ చూపుల్లో అతని మాటల్లో, అలా గిరుక్కున వెనక్కితిరిగి గబగబ నడిచి వెళ్ళిపోవటంలో స్పష్టంగా కనిపించిన తిరస్కారం ఆ నిరాదరణ ఎంత మరిచిపోవాలనుకున్నా మరుపురాకుండా తనని వెక్కిరిస్తూ బాధిస్తూ వెంటాడుతున్నట్లే వుంది.

మూడంకెలా ముడుచుకుపోయి అదే ధ్యాసగా పడుకున్న కళ్యాణి కాస్సేపటి తరువాత పేలవంగా నవ్వుకుంది—'హు— బాధ...నిరాదరణ— తనకి వూహ తెలిసినప్పటినుండి ఈ విధమైన నిరాదరణకి అలవాటు పడిపోయే వుంది — ఇది మరో కొత్త అనుభవం' ... కళ్యాణి మనస్సు, ఆలోచనలు గతాన్ని నెమరు వేసుకోటంలో మునిగిపోయాయి ...

(ఇంకా ఉంది)

కూరలూ గుణాలూ:

# ఆనబకాయ

తెల్లటి ఆనబకాయ కూర చలవచేసి నీరు పెడుతుంది. పైత్యాన్ని అణుస్తుంది. వీర్యవృద్ధి గావిస్తుంది.

శ్లేష్మం, వాతం చేస్తుంది. మలబద్ధం చేస్తుంది. ఆకల్ని మందగింపజేస్తుంది. ఇది అపథ్యమయినది.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు:— 1. పులుసు 2. ఆవగుండ 3 శొంఠి 4. ఉప్పు కలిపిన నీళ్ళు 5. వర్ణావాలు 6. తేనె 7. జీలకర్ర.

నల్లటి ఆనబకాయను సొరకాయ అంటారు. ఇది చలవ చేస్తుంది. దాహాన్ని అణుస్తుంది. మూత్రం బాగా జారీ అయ్యేటట్లు చేస్తుంది. శీతపైత్యాన్ని పోగొట్టును దేహతత్వాన్ని సౌమ్యపరుస్తుంది. మేహపైత్య వ్యాధులకు పథ్యమయినది. కాని వాతాన్ని, గురుత్వాన్ని చేస్తుంది.

ఆనబ గింజలు మేహశాంతిని చేకూరుస్తాయి వీర్యవృద్ధి గావిస్తాయి. ఈ ఆనబగింజల్ని తగుమోతాదులో, పందదారలో కలిపి కొన్నాళ్లపాటు తిన్నట్లయితే వీర్యస్తంభన చేకూరి రతిసౌఖ్యం లభ్యమవుతుంది.

సేకరణ:— ఆకుండి నారాయణమూర్తి



# అబ్బాయిలూ అమ్మాయిలూ ఆగండి!

బాలసరస్వతీదేవి శశి



'అబ్బా...ఏం స్టైలేరా! పడిపోతావ్ జాగ్రత్త.'

'ఫర్వాలేదు లేరా! పడిపోతే నేను పట్టుకుంటాను.'

మాకు నాలుగడుగుల వెనుకనుంచి నాద స్వరాల్లా వచ్చి చెవుల్లో పడ్డ పలుకులు వింటూనే వెనక్కి తిరిగి చూసిన నాకు నవ్వూ కోపం ఒక్కసారిగా ముంచుకొచ్చాయి. ఆ ఇద్దరబ్బాయిల్లోనూ సన్నగా పొడుగ్గా ఉన్న అతను పొట్లకాయల్లా బిగుసుకుపోయిన టైట్ పాంటులో పట్టే పట్టనన్న ఎర్రగళ్ళ చొక్కా టక్ చేసుకున్నాడు. టూత్‌బ్రష్‌లా లేచి నుంచున్న జుట్టులోంచి నాలుగు వెంట్రుకలు లాగి ముఖం మీద వేసుకున్నాడు. రెండో అతను నల్లటి టైట్ పాంటు మీద నీలం పువ్వుల చొక్కా తొడుక్కొని నెత్తి మీద తెల్లని బొచ్చు టోపీ పెట్టుకొని నల్లగా కుమ్మ మొద్దులా ఉన్నాడు.

వాళ్ళని ఆ వేషాల్లో చూస్తూ వాళ్ళు అంటున్న మాటలు వింటుంటే నిజంగా వాళ్ళిద్దర్నీ పట్టుకొని కొరతవేసినా పాపం లేదనిపించింది.

ఆడపిల్లలకి పేర్లు పెట్టడం అబ్బాయిలకి హాబీ ఐపోయింది.

పోనీ ఆ పేర్లు పెట్టే వాళ్ళు ఏ ఫాషన్లకీ అనుకరణలకీ పోకుండా ఉండి అప్పుడు అమ్మాయిలకి పేర్లు పెట్టినా బాగుండేది. అబ్బే... అదేం లేదు. వీళ్ళేమో రోజుకో రకంగా తయారవుతూ ఫాషన్లకి మారుపేర్లలా ఉంటారు. పైగా ఆడపిల్లలకి పేర్లు. అసలు ఈ రోజుల్లో పౌడరు రాసుకోని మగాణ్ణి చూపించండి. ఏం? మగాళ్ళు పౌడరు రాసుకుంటే తప్పా? అ...మ్మ...మ్మ...ఎంత మాట! అపచారం సాక్. గంగాజలం తెచ్చి శిరస్సు మీద జల్లుకోండి. మీరు పౌడర్లు రాసుకోవచ్చు. స్నోలు రాసుకోవచ్చు. జాకెట్లు తొడుక్కోవచ్చు. క్రాఫొద్దుట జుట్టు పెంచుకుని రెండు జడలేసుకుని చీరలు కట్టుకుంటామన్నా మాకేం అభ్యంతరం లేదు. కాకపోతే ఇలా ఎంత వింత పోకడలకు పోతూ ఫాషన్లలో అమ్మాయిల్ని బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్న మీరు కనిపించిన అమ్మాయికల్లా పేర్లు పెడుతూ నల్ల గురివింద సామెతని ఋజువు చెయ్యొద్దంటున్నాను. ఒక్క మాట మీ ఎదుట నడుస్తున్న అమ్మాయి మీ ఇంట్లో ఆడవాళ్ళకంటే ఎక్కువ అలంకరించుకున్నదా!

అప్పుడు మాకు పరీక్ష లయిపోయాయి. సెలవు లిచ్చేసారు.

మళ్ళా స్కూళ్ళు తెరిచాక మా ఫ్రెండుతో కలిసి గేటు దాటి లోపలికి అడుగు పెట్టబోతున్న నేను అదిరిపడి సడన్‌బ్రేకుతో ఆగిపోయాను.

ఎదురుగా మా క్లాస్‌మేట్ శాక్.

నడుం బాగా వంగిపోయింది. పాదాలు బరువుగా లేవదీసి ఎత్తి ఎత్తి అడుగులు వేస్తున్నాడు. ఉండుండి భుజాలు ఎగరేస్తున్నాడు. ముక్కు ఎగబీలుస్తున్నాడు. అతన్ని ఆ ఆకారంలో చూస్తుంటే నా మనసంతా జాలితో నిండిపోయింది. పాపం! మొన్నటి వరకూ బాగానే ఉన్నాడు. సెలవుల్లో ఏ జబ్బున్నా చేసిందేమో. మా బామ్మకలాగే ఉన్నట్టుండి అర్ధాంతరంగా పక్షవాతం వచ్చేసి కాలూ చెయ్యీ లాగేసింది.

'అదేమో పాపం! రావుకి ఏ జబ్బొచ్చి చేసి నడుం భుజం లాగేసిందేంటి...' అన్నాను అయోమయం అయిపోతూ.

నా మాట వినగానే మా రాణి ఘొల్లున నవ్వడం మొదలుపెట్టింది.

చెప్పొద్దూ, దాని నవ్వు చూస్తుంటే నాకు ఒళ్లు మండిపోయింది. నేనేమో ఎంతో ఇదిగా 'అతనికి జబ్బు చేసిందా' అని అడుగుతుంటే అదేదో జోకయినట్టు విరగబడి నవ్వుతుందేంటి...!

రాణి నవ్వి నవ్వి, ఇక నవ్వలేక కడుపు చేత్తో పట్టుకుని 'నీ మొఖం...జబ్బు కాదే తల్లీ! మొన్న సెలవుల్లో దేశాటన చేసొచ్చాడట! అక్కడ నేర్చుకొచ్చిన ఫేషన్ నడక ఇది...'

నేను తేరుకుని దాని నవ్వుతో శ్రుతి కలిపేటప్పటికి వో యుగం పట్టింది.

ఇక సాయంకాలాలు స్కూళ్లు విడిచి పెట్టాక జిడ్డు మొఖాలతో, రేగిపోయిన జుట్టుతో బయటికి వస్తున్న మాకు కొంతమంది అబ్బాయిలు అప్పుడే అలంకరించుకున్నంత నీటుగా నిగ నిగలాడే జుట్టుతో, మల్లెపువ్వుల్లాంటి మొఖాలతో ఎదురవుతుంటే ఏమిటా ఈ వింత! అని ఆశ్చర్యపోయేవాళ్లం. అలా పోగా పోగా చివరికి తెలిసిన విషయమేమిటంటే చాలా మంది అబ్బాయిలకి అరచెయ్యంత అద్దం, అరంగుళాల దువ్వెనా, పౌడరూ హమేషా పోకెట్ పనీలా పోకట్లో రెడీగా ఉండాలని.

అలంకరణకోసం ఇన్ని అవస్థలు పడే అబ్బాయిలు ఆడపిల్లలకి పేర్లు పెట్టడం అర్థంలేని విషయం. ఇంట్లో వో రోజు పౌడరయిపోతే 'ఆ... ఒక్క రోజు లేకపోతే ఏం పోయింది లెద్దూ! రేప్పొద్దుట కొనుక్కోవచ్చు' అంటూ బద్దకించేస్తారు ఆడవాళ్లు. మరి అబ్బాయిలు? అమ్మబాబోయ్. ఇంకేమైనా ఉందా. తీరా కంచందగ్గర కూర్చున్నాక 'ఇవాళ మీకు అన్నం లేదండీ' అన్నా సంతోషిస్తాను గాని 'ఇవాళ మీకు పౌడరు లేదండీ' అనిమాత్రం అనకు ప్రియా' అంటూ మా అత్తయ్య కొంగు పుచ్చుకు తిరిగేవాడు మా కాలేజీ మావయ్య. ఏదైనా అవసరమైన పని తగిలితే నలిగిపోయిన చీరతో అయినా బయటికి రావడానికి సందేహించరు ఆడవాళ్లు. అదే మగవాళ్లయితే ఇంట్లో ఉన్నంతసేపూ జిడ్డుమొఖాలేసుకుని మాసిపోయిన లుంగీ కట్టుకు డర్టీఫెలోల్లా తిరుగుతున్నా కాస్త గడపదాటి బయటికి అడుగుపెడితే చాలు సబ్బు సగం ఐపోయేవరకూ నాలుగు సార్లు ముఖం తోమవలసిందే. మూడు సార్లు స్నో రాసి రెండు సార్లు పౌడరు కొట్టవలసిందే. ఇక దువ్వెన పట్టుకుని వీళ్లు పట్టే పట్లు చూస్తుంటే దారాసింగ్ కూడా నోరావలించి నిలబడిపోతాడు.

మా కాలేజీ మావయ్యకి వంకీల జుట్టంటే ప్రాణం. కాని — పాపం తనకేమో గొర్రెజుట్టులాంటి జుట్టు ప్రసాదించాడు దేవుడు. ఐనా భగవంతుడిమీద ఏ మాత్రం నమ్మకంలేని మావయ్య మానవశక్తికి మించింది ఏదీ లేదని నిరూపించాలని నిరంతరం శ్రమపడుతుంటాడు. ఎప్పుడూ శేరు సీసాతో ఆవదం తెప్పించుకుని డ్రెస్సింగ్ టేబుల్‌కి వో మూలగా భద్రంగా దాచుకుంటాడు. నేతిగిన్నెతో మంచినీళ్లు తెచ్చి దగ్గర పెట్టుకుంటాడు. ఒక స్పూన్ మంచినీళ్లకి రెండు స్పూన్ల ఆవదం అన్నమాట. ఈ మిశ్రమాన్ని గట్టిగా తలకి పట్టించేసి — మర్దనా చేసేసి—ఇక చూడాలి—దువ్వెన తీసుకుని దువ్వీ—దువ్వీ—పావుగంట దువ్వి ఫర్వాలేదు, అవి వంకీలే అని నిర్ధారణ అయ్యాక బయటికి వచ్చేవాడు. పెళ్లయిన మర్నాడే మా అత్తయ్యకి వో ఆజ్ఞ జారీ






చేసాడు మా మావయ్య. 'నీకు ఎవ్వడయినా కోపం వస్తే రోకలిబండ పట్టుకొట్టు, అప్పడాలకర్ర విసిరెయ్, అట్లకాడ కాల్చి అంటించెయ్. అంతేగాని జుట్టుగాని పట్టుకున్నావా నేను సహించను' అంటూ ఘాటుగా వార్నింగిచ్చేసేడు.

ఇటువంటి వంకీల రాయుళ్లు కావలసినంతమంది కనిపిస్తారు మనకి. లేని వంకీలకోసం తాపత్రయ పడి — అహోరాత్రాలూ కష్టపడే అబ్బాయిలు, లేని జుట్టుకోసం ముచ్చటపడి సవరాలు పెట్టుకునే అమ్మాయిలకి, పేర్లు పెట్టకూడదు మరి.

ఇక ఈ రోజుల్లో గడపదాటి బయటికి రావడం పాపం. ఎక్కడ చూసినా నేరోకట్. నేరోకట్. నేరోకట్.

నలభయ్యేళ్ల నడివయసు వాళ్లు మొదలు నాలుగేళ్ల పసివాళ్లవరకూ ఒకటే వేషం. ఈ డ్రెస్ తమకు నప్పుతుందా లేదా అని లేదు. వాళ్లు వేసుకున్నారు. మనం వేసుకోకపోవడమేం అని మర్నాటికల్లా ఆ వేషంలో తయారు. శిల్పంలాంటి అందానికి అవయవాల పొందిక్కి అనాదిగా స్త్రీకి పెట్టింది పేరు. కాస్త అందంగా ఉన్న ఆడదాన్ని పాదాలు మొదలు తలవెంట్రుకలు వరకు ఆవేశపడుతూ వర్ణిస్తారు కవులు. అటువంటి ఆడవాళ్లే సినిమాల్లో బిగుతు దుస్తులు తొడుక్కుని కనిపిస్తున్నారని 'రామ...రామా... చూళ్లేక పోతున్నాం' — 'మారాలి పిచ్చి

# అబ్బాయిలూ ...

హోటల్ అంటూ నినాదాలు చేస్తున్న మగవాళ్ళు వాస్తవంగా ఒంపు సొంపు లన్నీ బహిరంగపరుస్తూ నడవలేక నడవ లేక గర్భిణీ స్త్రీల్లా నడుస్తుంటే అలా వాళ్ళని చూడ్డానికి ఎంతో ఇబ్బందిగా అనిపిస్తుంది.

మగవాళ్ళు హుందాగా నడవాలి. గంభీరంగా కనిపించాలి. అప్పుడే చూసే వాళ్ళకి గౌరవభావం కలుగుతుందిది. పువ్వుల చొక్కాల్లో — నేరోకట్ పాంటుల్లో హంసల్లా నడిచే అబ్బాయిల్ని ఏమని పిలుస్తారో నేను వేరే చెప్పనక్కర్లేదను కుంటాను. అదిగో. అప్పుడే చాలామంది అబ్బాయిలకి ఆవేశం వచ్చేస్తున్నది. కళ్ళు విర్రబడి పోతున్నాయ్. ముక్కుపుటాలు అదిరిపోతున్నాయ్. గుండెలు ఎగిరి పడుతున్నాయ్. 'ఏం...? మా అబ్బాయిలేనా అంత ఇదిగా కనిపిస్తున్నారు ? మీ అమ్మాయిలుండటంలేదు ఫాషన్కి మారు పేర్లులా! మా అబ్బాయిల జేబుల్లోనేనా పౌడర్లూ దువ్వెన్లూ ఉంటుంటా ? మీ అమ్మాయిల బేగుల్లో ఉండటంలేదూ. అద్దాలూ దువ్వెన్లూ' అంటూ చొక్కా చేతులు పైకి తీసేసుకుంటు ఆయాసపడిపోతున్నారు.

నిజమే. ఎందుకుండటం లేదూ. ఉంటున్నాయి. ఆడవాళ్ళ హేండ్‌బేగుల్లో పౌడర్లూ—లిప్‌స్టిక్‌లూ ఉంటున్నాయి. మగాళ్ళ జేబుల్లో సిగరట్టు పెట్టెలూ— అగ్గిపెట్టెలూ ఉంటున్నాయి, ఆడవాళ్ళ చేతుల్లో అద్దాలూ దువ్వెన్లూ ఉంటున్నాయ్. అదే ఆడవాళ్ళ హేండ్ బేగ్‌లో సిగరట్టుపెట్టె కనిపిస్తే—! తమని గౌరవంగా చూసే మగవాళ్ళపట్ల ఆడవాళ్ళు ఎంతో గౌరవం కలిగిఉంటారు. 'చక్కగా ఆ అబ్బాయిలా అందరూ ఉంటేనా' అంటూ నలుగురితో పొగ్డి మిమ్మల్ని ప్రత్యేక స్థానంలో నిలబెడతారు. అలా కాకుండా అమ్మాయి కనపడగానే ఆమె సైజునుబట్టి 'గుమ్మడి పండొస్తున్నదిరోయ్' అంటే ఇమీడియట్‌గా మిమ్మల్నికూడా 'ములక్కాడగాడు అడుగోనోయ్' అనేస్తారు.

**అమ్మాయిలూ - ఆగండి మరి**

కొంతమంది అబ్బాయిల్లో ఓ సుగుణం ఉంది. వీళ్ళు వెకిలిగా అలంకరించుకున్న అమ్మాయిల్ని తప్ప మామూలుగా ఉన్న అమ్మాయిల జోలికి ఏ మాత్రం రారు. ఇటువంటి అబ్బాయిల్ని వరుసగ స్టేజీ ఎక్కించి 'సుగుణ శ్రీ' బిరుదులిచ్చేసినా తప్పులేదు. ఈ రోజుల్లో రోజు రోజుకి ఫాషన్లు మారిపోతున్నాయి. ఫాషనుగా ఉండటం తప్పుకాదు. ఆమాట కొస్తే రకరకాల అలంకరణలు ఆడవాళ్ళకి వింత వింత అందాన్ని ఇస్తాయి కూడా. కాకపోతే అలంకరణ 'అతి'గా ఉండకూడదు. 'అతి' ఎప్పుడూ అనర్థాలకే దారి తీస్తుంది. పల్చటి చీరమీద




పల్చటి జాకెట్టు వేసుకోవడం, బొడ్డు క్రిందకి చీరలు కట్టుకోవడం—

ఈ మధ్య గ్రొత్తరకం పవిట ఫాషనయి పోయింది. బొడ్డు క్రిందకి కట్టుకున్న వైట్‌సారీలో భుజం దిగని పవిటవేసుకుని, కూర్చున్నా, నుంచున్నా, మాట్లాడుతున్నా, పాఠం వింటున్నా పవిట సర్దుకుంటున్న అమ్మాయిల్ని ఏడ్పిస్తున్నా రంటె అది అబ్బాయిల తప్పు ఎలా అవుతుంది? ఆడవాళ్ళ అలంకరణ 'అతి'గా ఉండకపోవడమే కాదు, 'అతికి' నట్టుగా కూడా ఉండాలి. ఇప్పుడు ఏ ఆడపిల్ల ముఖం చూసినా కనుబొమ్మలు మొదలు పాపిటవరకు వెంకన్న బాబు 'నామం'తో దర్శన మిస్తున్నారు.

గుండ్రటి మొఖాలలో బొద్దుగా ఉన్న అమ్మాయిలకి ఈ బొట్టుపెట్టుకుంటే అందంగా ఉంటుంది. కోలగ, పల్చటి ముఖం ఉన్న అమ్మాయిలు ఈ నిలువు బొట్టుపెట్టుకుంటే ఉన్న అందం కూడా పోగొట్టుకొని వికారంగా కనిపిస్తారు. అటువంటి అమ్మాయిలు కంది బద్దంత గుండ్రటి బొట్టు పెట్టుకుంటే చక్కగా ఉంటారు ఇప్పుడు లేటెస్ట్ ఫాషన్ అమ్మమ్మల హేర్‌స్టైల్‌ని అనుకరించడం. మధ్య పాపిడి తీసుకుని క్రిందకి దువ్వేసుకుని బిగుతుగా ఒక్కజడ వేసుకుంటుంటే ఈ అలంకరణలో ఎంత మంది చూడగలిగే స్థితిలో ఉంటున్నారు. బిగుతుజడ గుండ్రటి మొఖాలకే బావుంటుది. కోలముఖం ఉన్న అమ్మాయిలు చెంపలమీదుగా దువ్వుకొని కొద్దిగా వదులుగా జడ అల్లుకుంటె బావుంటారు. రెండుజడలు వేసుకుంటే ఇంకా బావుంటారు. చాలా మంది అమ్మాయిలు తాము పొట్టిగా ఉన్నామని తెగ బాధపడిపోతుంటారు. నిజానికి పొట్టిగా ఉండటం అదృష్టమే మరి. అలా కళ్ళు పెద్దవి చేసుకు చూడకండి. సన్నగా, పొట్టిగా ఉన్న అమ్మాయిలు ఎన్నాళ్ళయినా చిన్నపిల్లల్లాగే కనిపిస్తారు. వీళ్ళు అంచు పరికిణీల మీద ఏకరంగు వోణీలు వేసుకుని రెండుజడలు అల్లుకొని పైకి కట్టుకుంటే చూడ ముచ్చటగా ఉంటారు. వీళ్ళు కాలేజీల్లో చదివినా—పిల్లల తల్లులయినా లంగా వోణీలు వేసుకుంటే అది సహజంగా ఉంటుంది.

అదే లావుపాటి అమ్మాయిలయితే సరదా పట్టలేక లంగా వోణీలు వేసుకున్నా గుమ్మడి పండుల్లా గునగున లాడుతూ చూసే వాళ్ళకి వింతగా కనిపిస్తారు. లావుగా ఉన్న అమ్మాయిలు సాధ్యమయినంత తక్కువ వయసునుంచీ లంగా వోణీలమీద మక్కువ చంపేసుకుని చీరలకి అలవాటు పడాలి. లావుగా పొట్టిగా ఉన్న అమ్మాయిలు ఎత్తుమడమల జోళ్ళు వేసుకొని పాదాల దిగువగా జరువైన చీరలు కట్టుకుంటే హుందాగా ఉంటారు.

ఇంకో సంగతి. లావుగా ఉండి చీరలు

కట్టుకునే అమ్మాయిలకి రెండుజడలు ఏ మాత్రం అందాన్నివ్వవు. కావాలంటే వో రెండు జడల లావుపాటి అమ్మాయినీ, వో సన్నటి రెండుజడల అమ్మాయినీ ప్రక్క ప్రక్క నిలబెట్టి వెనుక నుంచి చూసి ప్రాక్టికల్‌గా తెలుసుకోండి. పొట్టిగా ఉన్న అమ్మాయిలు మాత్రం ఎప్పుడూ నడుం దిగని జడలు మాత్రమే వేసుకోవాలి. బారెడు జడతో పొట్టి అమ్మాయిలు ప్రత్యక్షమైతే మనిషి పొడవా జడ పొడవా, అంటూ బేరీజు మొదలు పెడతారు చూసేవాళ్లు.

ఇక సన్నటి అమ్మాయిలు—పాపం వీళ్లు తాము సన్నగా ఉన్నాం అన్న దిగులుతో ఇంకా చిక్కిపోతుంటారు. ఇటువంటి అమ్మాయిలు ఈరోజునుంచీ తమ సన్నాన్ని గురించిన దిగులంతా మర్చిపోయి నిశ్చింతగా గడిపేయొచ్చు. అసలు సౌందర్యమంతా సన్నగా ఉండటం లోనే ఉంది. సంజెగాలిలో, ఆరు బయట పడక్కుర్చీలో వెనక్కి వాలి 'సన్నజాజి చూడు—సంపెంగచూడు' అంటూ కవిత్వం చెప్పేవాడు మా కాలేజీ మావయ్య. నాకు మాత్రం ఆమాట అక్షరాలా నిజమే అనిపిస్తుంది. సన్నజాజిలో ఉన్న అందం నాజూకూ ముద్దబంతిలో కంచుకాగడా పెట్టి వెదికినా కనిపించవు. ఎటొచ్చీ అలంకరించుకోడంలోనే ఉంది గొప్పతన మంతా. పల్చగా పొడుగ్గా ఉన్న అమ్మాయిలు సన్నటి బోర్డరున్న చీర కట్టుకుని పొడుగ్గా వేసుకున్న జడలో చెంపదగ్గరగా వో తెల్లగులాబీ తురుము కొని, కంది బద్దంత బొట్టుతో నాజూగ్గా నడిచిపోతుంటే 'అబ్బ...శిల్పంలా ఉందికదూ' అనిపిస్తోంది.

అబ్బాయిలు తమవెంట పేర్లు పెడు తున్నారని చిటపట లాడిపోయే అమ్మాయిలు వెనక్కితిరిగి తమ అలంకరణ ఒక్కసారి అద్దంలో చూసుకుంటే మంచిది.

పవిటల్లేకుండా రోడ్డుమీద నడవ మంటే ఎంత సిగ్గుపడతామో ఒంటిపొర పవిట్లకీ గొర్రెతోక పవిట్లకీ కూడా అంతగానూ సిగ్గుపడాలి. నిండుగా చీరా జాకట్టుతో ఉన్న స్త్రీని చూస్తే అదో విధమైన గౌరవభావం కలుగుతుంది. అదే స్త్రీ జీన్స్‌తో కనిపిస్తే— బొడ్డు క్రిందికి చీర కట్టుకుంటే వెకిలిగా తేలిక

4 ఇది కాలేజ్ నవ్వు!!



భావం కలిగేలా కనిపిస్తుంది.

'ఐతే ఎర్రటి వెంకటగిరి చీర కట్టు కుని కానీ అంత కుంకం బొట్టుతో అమ్మమ్మల్లా కనిపించ మంటావా మమ్మల్ని.' కోప్పడకండి మేడమ్స్ మీరు నేతచీరలు కట్టుకోవద్దు. కుంకంబొట్టు పెట్టుకోవద్దు. మీరు టెర్లిన్ చీరలే కట్టు కోండి. స్లీవ్‌లెస్ బ్లౌజ్‌లే వేసుకోండి. ఆరంజో చుక్కంత బొట్టే పెట్టుకోండి. కాని 'మమ్మల్ని చూసి అబ్బాయిలు ఈల వేస్తున్నారూ' అని రుసరుస లాడకండి. వెనకాలబడి 'టెర్లిన్ ... జిందాబాద్' అంటున్నారని చిందులు తొక్కకండి. గొడుగు ముడిలోంచి భుజంమీదకి జారిన మల్లెపూలవాసన మనసుకి మత్తు కలి గించి మైమరిపించదూ? కర్ణపులో తిప్పి వెగటు పుట్టిస్తుంది. చేతుల్లేని జాకట్లు వేసుకొని నగ్నంగాఉన్న భుజాలతో వీధుల్లో తిరుగుతున్న ఆడది ఎంత సున్నితమైన భావాలని చంపేస్తున్నదో విలా తెలుసు కుంటుంది.

ఫలానా సినిమాలో జయలలిత కట్టు కున్న మోకాళ్ల దగ్గరకున్న చీరతో మీరుకూడా ప్రత్యక్షమయితే, మేకప్ మెరుపుల్లో తళతళ లాడుతున్న జయ లలిత కాళ్లంత అందంగా ఉన్నాయా మీ కాళ్లు.

రాత్రి చూసిన సినిమాలో రాజశ్రీ వేసుకున్న ఎత్తుముడి మీరుకూడా వేసు కుంటె ఎంత చక్కగా ఉంది అద్దంలో మీ రూపం. సినిమాల్లో అర్ధనగ్నంగా తయారయి అడ్డమయిన వాళ్లతోటీ పార్కుల్లో పరుగులు పెడతారు మీ అభి మానతారలు.

వాళ్లని అనుకరిస్తూ వాళ్లలాగే అలంకరించుకున్న మీరుకూడా అలా చెట్టాపట్టా లేసుకొని దొర్లుతారా బీచిల్లో. ఆ కధకీ, ఆ సన్నివేశానికీ తగినట్టుగా అలంకరించు కుంటారు, నడుస్తారు, నాట్యం చేస్తారు. ఒక పిక్చర్లో క్లబ్బు నృత్యం చేయాల్సి వస్తే పీలికల్లా వేలాడుతున్న దుస్తుల్లో కని పింవేతార మరో పిక్చర్లో ఇల్లాలుగా నటించాల్సివస్తే నిండుగా చీరా జాకట్టుతో చేతులనిండా గాజులతో కనిపిస్తుంది.

సినీతారల్ని అనుకరిస్తూ అర



ఈ కాలంలో ప్రతిదీ పొదుపుగా వాడ్డం నేర్చుకోవాలోయ్! నే చూడు - ఓ చిన్న సీసాడు కొబ్బరి నూనె రెండేళ్లు వాడతాను!

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥







# అబ్బాయిలూ ...

నగ్నంగా తయారయి నలుగురూ ఆగిపోయి తనవంక చూస్తుంటే అదేదో తన సౌందర్యానికి ముగ్ధులై నిలబడి పోయారని మురిసిపోతుంటారు కొంత మంది అమ్మాయిలు.

కాని ఆ చూపుల్లో ఉండేది సౌజన్యం, మంచితనం, గౌరవభావం కాదు—కాంక్షగా, తపనగా, పండిన మామిడి పండువంక చూసే ఆకలి చూపు.

ఫలానా సినిమాలో ఫలానా తార ఫలానా విధంగా నడిచిందని ఆ నడకను అనుకరించబోవడం చాలా సిగ్గుపడాల్సిన విషయం. అది ఆ తారపుట్టుకతో వచ్చిన నడక. మీక్కూడా దేవుడిచ్చిన కాళ్ళున్నాయి. ఆ కాళ్ళకు నప్పే నడక ఉన్నది. మీకు వచ్చినట్టుగనే మీరు నడవండి. మన నడకను మనమే చిన్నబుచ్చుకుని ఇంకొకళ్ల నడకతో ముందుకు సాగడం తెలివితక్కువ.

మన వ్యక్తిత్వం మనకి ఉండాలి. మన నడక, మన చూపు, మన నవ్వు, మనకో ప్రత్యేకతను తెచ్చిపెట్టాలి. ఎవరి నడక వాళ్ళకి అందం. మనం పుట్టుకతో వచ్చిన నడకతో ఎలా నడిచినా సహజంగా ఉంటుంది. అదే అనుకరణకి పోతే ఎరువు తెచ్చిపెట్టినట్టుగా ఎబ్బెట్టుగా అనిపిస్తుంది. ఇలాగే మాట, నవ్వు, అలంకరణ అన్నీను. కొంతమంది తమ సహజమైన స్వరాన్ని నొక్కిపట్టేసి కీచుగా గొంతు పట్టేసినట్టుగా నొక్కి నొక్కి మాట్లాడతారు. ఇదేదో వాళ్ళకి గొప్పగా ఉంటే ఉండొచ్చుగాని వినేవాళ్ళకి మాత్రం కారం రాసుకుంటున్నట్టుగా ఉంటుంది.

మా ఫ్రెండు ఒకామె చక్కగా నవ్వేది. దాని నవ్వు వింటుంటే సెలయేటి గలగలలూ—కోయిల కుహునాదాలూ అంటారే అదిగో అలా ఉండేది. ఆ నవ్వుకోసమే నేను గంటలతరబడి కూర్చొని నవ్విస్తూ ఉండిపోయేదాన్ని. కాని తీరా అది కాలేజీ చదువులకి వెళ్ళివచ్చాక, హాయిగా నోరంతా తెరిచి చంద్రుణ్ణి చూసిన కలువలాగా పకపకా నవ్వేదల్లా, నోరు తెరిస్తే ప్రళయం వస్తుందేమో అన్నంత భయంగా, పెదవి చివర్లు ఒంకరచేసి మూతి బిగించి నవ్వుతుంటే ప్రాణప్రదమైన వస్తువు క్రింద పడి చితికి పోయినట్టుగా బాధపడ్డాను. తననవ్వు కృత్రిమంగా ఉందనీ, ఉన్న అందాన్ని పోగొట్టిందనీ దానికి తెలీదు. చెప్పినా అర్థం చేసుకోదు.

ఫాషన్లమీద ఉన్న క్రేజా అలాంటిది. చదువుకుంటున్న అమ్మాయిలు చక్కగా జడలు వేసుకుంటే బావుంటుందిగాని ఫాషనుఅంటూ ముడుల్లో తిరగడం ఏమంత బాగా ఉండదు. యే ముప్పయ్యేళ్లో వచ్చాక ఈ సిగలూ—ముళ్ళూ వద్దన్నా తప్పవు.

ఇక వయసునుబట్టి కూడా ఆడవాళ్ళు అలంకరణని సరిదిద్దుకోవాలి. పిల్లలకి చీరలు కట్టుకునే వయసు వచ్చాక కూడా వాలుజడలు వేసుకోవడం—వెనక బొత్తాల జాకట్లు తొడుక్కోవడం లాంటివి అంత మంచి లక్షణాలు కాదు.

చిన్నప్పుడు మా బామ్మ నన్ను ఒళ్లో కూర్చోబెట్టుకుని 'కోడలొచ్చిందాకా తిన్నది తిండి, కూతురెదిగినదాకా కట్టింది బట్ట' అంటూ కూనిరాగాలు తీసేది. అలాగని కూతుళ్లు ఎదిగాక మంచి బట్టలు కట్టుకోకూడదని కాదు.

మాతృమూర్తి అయాక స్త్రీకి అదో విధమైన పెద్దతనం వస్తుంది. ఆ పెద్దతనంలో నిండుగా కనిపిస్తే గౌరవభావం కలుగుతుంది. పిల్లలతోబాటు తాను కూడా టెర్లిన్ చీరలు కట్టుకోవడం, దోసగింజ బొట్టు పెట్టుకోవడం, ఎత్తుమడమల జోళ్లు తొడుక్కోవడం లాంటివి హర్షించదగ్గ విషయాలు కాదు. పోనీ పెళ్ళాలో ఉండి మొదట్నుంచీ ఇదే అలంకరణలో ఉంటే పిల్లలు ఎదిగినా, పిల్లల తల్లులయినా అంత ఎబ్బెట్టుగా ఉండదు. అదే అంతవరకు సాదా చీరలతో, మామూలు ముడులతో కాలక్షేపం చేసి కాలం మారిందనగానే ఉన్నట్టుండి ఎత్తు ముడితోనూ, టెర్లిన్ చీరతోనూ ప్రత్యక్షమైతే చూసేవాళ్ళు పెట్టే పేర్లు ఎలా ఉన్నా కడుపున పుట్టిన పిల్లలే ఆమెతో కలిసి ఎక్కడికైనా వెళ్లడానికి వెనుకాడతారు. ఎప్పుడయినా సరే తల్లులు తల్లుల్లాగే ఉండాలిగాని పిల్లల్లా ఉండడానికి ఉబలాట పడకూడదు. ●



# పరీక్షా ఫలితాలు - న్యూటన్





















# వీడని బంధాలు



ప్రభ

కూలిగాడు. పెళ్ళాంతో పోట్లాడి 'ఈ కొంపలో ఇంకో క్షణం వుండమన్నా వుండను.' అని అరుస్తూ పైమీద గుడ్డలో రెండు పంచెలు లుంగచుట్టుకుని వీధిలో పడ్డాడు, పిల్లలు వెనకాల్నుంచి 'అమ్మో...వోరయ్యో' అని అరుస్తున్నా వినకుండా.

'ఊఁ వెళ్ళనీ ఈ బెదిరింపులు రోజూ వినేవేగందా, అయినా ఎక్కడికి పోతాడు? కూటికి ఇల్లు ఎతుక్కుంటూరాడూ' విరాగ్గా గొణుక్కుంది మంగ.

మొగుడు చీటికీ మాటికీ తనతో గిల్లికజ్జా పెట్టుకోవడం బురబుర పొంగే కోపంతో 'ఈ ఇంట్లో ఒక్కక్షణం వుండను, నిన్నేలుకోను' అని బెదిరించడం పెళ్ళయిన ఈ పదేళ్లలో ఎన్ని వందల సార్లయ్యిందో, అన్ని వందల సార్లూ మాట తప్పేస్తూ అక్కడా ఇక్కడా పొంచుండి వేళకి దొంగలా ఇంట్లో చొరబడి 'కూడెట్టే పిల్లా' అని తన పెద్ద కూతురితో అన్నం పెట్టించుకు తినే మొగుడివైపు వోరగా చూసి ముసిముసిగా నవ్వుకోవడమూ మంగ కలవాటై పోయింది, 'ఈ మడిసిక్కడ తప్పించి మరోసోట బతకలేడు' అనే దీమా కూడా వుంది ఆమెలో.

ఒకరోజు కూలిపనికెళ్ళి నాలుగురోజులు హాయిగా పడుకుని కుముకుతిసే మొగుణ్ణి తను గనక పోషిస్తున్నాది అనే గర్వం కూడా వుంది మంగలో.

ఆ సంగతి వూరివాళ్లకీ తెలుసు 'ఆ మంగ కాబట్టి దున్నపోతులాంటి మొగుణ్ణి కూర్చోపెట్టి మెపుతా వుంది మరొకత్తె అయితే ఇంటినుంచి తగిలేసేది' అనుకుంటారు.

ఈ మాటంటె కూలిగాడు వూరుకోడు 'ఛట్, అది నన్ను పోసిస్తా వుందా? నేనేదాన్ని పోసిస్తా వుంటె' అని గొంతు చించుకుంటాడు.

అసలు జరిగింది కూడా ఆ మాట గురించే పెద్దనాయుడుగారి పన్నోకి బోరింగ్ తవ్వకానికి వెళ్ళాడు ఆ క్రితం రోజు. పనయ్యి వచ్చేస్తుంటె మరో కూలి అడిగాడు 'ఈ కూలి ఈ రోజైనా రేపైనా వస్తావా' అని.

'కూలికి రాపోయినా అడికి లోటుండదు పెళ్ళాం సంపాదిస్తా వుంది, ఈడికేం తిని పైలా పచ్చీస్‌గా తిరుగుతాడు. మనకీ అలా సంపాదించే పెళ్ళాం వుంటె మనమూ కూకుందుం కాని మనకా అదురుట్టం ఏదీ?' మరో కూలి వ్యంగ్యం. వత్తిపొడుస్తూ నవ్వేడు. నలుగురుపిల్లల తల్లయినా, అందం, శరీ బిగువు సడలని మంగ మీద ఆ కూలికి ఎన్నాళ్లనించో మోజుంది. లొంగని ఆ అందం మీద, ఆ అందాన్ని అనుభవించే వాడిమీదా వాడికి పీకలమొయ్యా కోపం వుంది. ఆ కోపాన్ని వీలైనప్పుడల్లా తీర్చుకోవడం అతని కలవాటు. అతని మాటలకంతా గొల్లున నవ్వేశారు. ఆ మాటలు, ఆ నవ్వులు చూసేసరికి కూలి గాడికి ఎక్కడిలేని పౌరుషమూ పొడుచు కొచ్చింది. 'ఆ మాట మళ్ళా అన్నావంటె నీ నాలిక పీకేస్తాను' అన్నాడు రోషంగా.

'పెళ్ళాన్ని అదుపులో పెట్టుకోలేవు గాని మా నాలిక పీకేస్తావేం' వాళ్ళు మరింత పగలబడి నవ్వేరు.

వాళ్ల మాటలు, నవ్వులు నష్టంలో కారం పులిమినట్లు జల జల్లాడిస్తుంటే కోపాన్ని దిగమింగుతూ యింటి మొహం పట్టాడు. దీపాలు పెట్టే వేళైనా భార్య ఇంకా ఇంటికి రాలేదు అనేసరికి కూలిగాడికి మర్చిపోయిన కోపం రైజయ్యింది మళ్ళా. 'మన బంగారం మంచిదైతే ఒకర్ననేదేం పనేం వుంది? అళ్లన్నారంటె అనరూ, ఇంతసేపు ఇదెక్కడుంది' పళ్ళు నూరుతూ కూర్చున్నాడు గుమ్మంలో. పెద్ద పిల్ల గారి 'అన్నం పెట్నా అయ్యా' అని రెండు మూడుసార్లు అడిగినా ఒద్దనే వాడి నోట్లోంచి ఏ మాటా రాకపోయే సరికి వాడి మనాన్న అది వూరుకుంది 'అమ్మొచ్చి పెడద్దిలే' అనుకుంటూ.

అప్పుడే వచ్చింది మంగ. పొద్దున్న పువ్వులా అలంకరించుకెళ్లిన భార్య నలిగి ఉస్సురుస్సురంటూ రావడం వాడి అనుమానాన్ని మరింత బలపర్చింది. 'నాంచారి నప్పటిదాకా ఎక్కడ తొంగున్నావే' ఎవ్వరంకెలేసినట్లు నోరు లేకపెట్టి చేతితో కర్రెత్తాడు. అసలే విరాగ్గా వచ్చిన మంగకి మొగుడి కోపం ఎందుకో, ఎవరిమీదో

చెప్పిన అర్థం కాలేదు. ఆ అయోమయావస్థలోనే అదిరిపడి చూస్తూ 'ఏందయ్యా కోపం, వళ్ళు తిన్నగ లేదా' అని గసురుకుంటూ మీద పడే దెబ్బను కాసుకునే వుద్దేశ్యంతో ఇలా నెట్టింది కర్రని పక్కకి. అంతే ఏమరుపాటుగా వున్న ఈరిగాడు కర్రతో పాటెళ్ళి దూరంగా పడ్డాడు. పెళ్ళాన్ని కొట్టలేక పోవడమేగాక తనే దెబ్బతిన్నందుకు అతని అహం పూర్తిగా దెబ్బతిన్నందున నోటి కొచ్చిన తిట్లన్నీ వల్లించేసాడు వరుసగా.

'నోరుందని పారేసుకోబాక, నాకు తిక్క రేగిందంటె మంచిదాన్ని కాదు' అంది మంగ కోపంగా. ఇక ఏమీ చేయలేక తన పంచి గుడ్డలు చంకనెట్టుకుని బైలుదేరాడు 'ఇక ఈ యింట్లో ఇంకో చనం వుండను' అంటూ.

ఎదురింటి పుల్లమ్మ, ఆ పక్కింటి ఎల్లమ్మా 'ఏందయ్యా ఈ రోసం' అని వారించబోయినాగని వాళ్ళ మాటలు ఖాతరు చేయకుండా ముందుకి దూసుకి పోయాడు సడలని బింకంతో.

ఎక్కడికి పోతాడు అని నిర్లక్ష్యంగా వూరుకున్న మంగ పైకి గంభీరంగా తిరిగినా మనసులో మాత్రం 'ఈ మడిసింకా రాలేదేమబ్బా' అని క్షణమొక యుగంలా ఎదురు చూసింది. ఊరు మాటు మణిగినా మొగుడిజాడలేదు. వస్తాడనే ఆశా కనిపించడం లేదు. ఆవేదన అణచుకోలేక వీధి తలుపులు వారగావేసి చీమ చిటుక్కుమన్నా మొగుడే అన్నట్లు ఉద్వేగంగా చూస్తూ గడిపింది. పుల్లమ్మతో మొరపెట్టుకుంది 'సూశావా పెద్ది ఈమడిసి ఇదేపోక పోయాడు' అని కళ్ళంబడి నీళ్ళు తెచ్చుకుంది.

'ఊరుకోయె పిచ్చిమొద్దా ఆడెక్కడ కెళ్తాడు. నిన్నూ నీ పిల్లల్నీ ఇడిసెట్టెల్లడానికి ఆడిపాణం ఒప్పుద్దా? కోపం తగ్గేటలికి ఆడే వస్తాడు' అని మందలించింది పుల్లమ్మ

ఆ రాత్రంతా కోడినిద్రతోనే గడిపేసింది మంగ, వండిన అన్నం కదల్లేదు. అయ్యొరొందే నేనెలా తిన్ను అని మంగ, అమ్మా, అయ్యా తిన్లేదు బువ్వ మేమెల్లా తినను అని పిల్లలు ఎవరిమట్టుకు వారు కడుపులో కాళ్ళెట్టుకుని పడుకుండి పోయాడు.

తెల్లారేతలికన్నా రాడా మొగుడు అని ఆశపడిన మంగకి అప్పుడూ నిరాశే ఎదురయ్యింది. గబగబ పాచిపని పూర్తిచేసి పెద్దపిల్లని లేపి 'నేను భూషయ్య గారింటికెళ్తున్నా, ఇల్లు జాగరత అయ్యొస్తే అన్నం పెట్టు' అనిచెప్పి వెళ్ళిపోయింది.

భూషయ్యగారి పెద్దకోడలికి పురుటి స్నానం చేయించి, వాళ్ళు పెట్టిన అన్నం కూరలు తీసుకుని యింటికొచ్చేసరికి పెద్దపిల్ల గౌరి గుమ్మంలోకే ఎదురొచ్చి చెప్పింది. 'అయ్యింకా రాలేదమ్మా' అని ఆమాటతో మంగకి గుండెలు జారిపోయాయనిపించింది. రాత్రి, ఓ పగలు గడిచినా అతగాడు రాలేదంటే ఏమనుకోవాలి? ఎక్కడ వున్నాడు? అని మనసు గుంజాటన పడుతుంటె రావుణ్ణి పది పైసలు ఇస్తానని ఆశపెట్టి వాళ్ళ బాబుని వెతికిరమ్మని ఊళ్ళోకి తరిమింది. వాళ్ళయ్య ఎక్కడెక్కడ తిరిగేది తెలిసివున్న రావులు ఆ చోట్లన్నీ గాలించి ఓ గంటకే 'అయ్య కనిపించలేదమ్మ' అని చల్లగా చెప్పిపోయాడు. మరెక్కడ వున్నట్లు? 'ఎంతాలోచించినా మంగకి దారితెన్ను అందడం లేదు. ఇన్నాళ్ళూ ఎలా ఎలా అని వదంపాడిన తను ఆరోజు నిజంగానే వరార్పోయాడా? అదే నిజమైతే నోరి బగుమంతుడా నాకేది దారి? ఈ నలుగురు పిల్లలతో నే నేమై పోనూ, నేనూ, నాపిల్లలు ఈడిలో పడ్తే మమ్మల్ని ఆదుకునే వాళ్ళెవరూ? మొగుడు సంపాదించినా, సంపాదించక పోయినా, మాట మంచి తనంతో ఈ సంసారాన్ని లాక్కొస్తున్నది కాని మొగుడిక్కులేని సంసారాన్ని చూస్తూ చూస్తూ ఎవరు భరించగలరు? అయినా తనబతుకెంత చులకనై పోతాది రేపట్నుంచి! పరిపరివిధాల పోయేమనసుతో పిచ్చిదాన్లా మతిపోయినదాన్లా, చిరాగ్గా, పరాగ్గా తిరిగింది పొద్దువాలే దాకాను.

పువ్వులా అలంకరించుకుని కులుకుతూ తిరిగేమంగ మన్ను తిన్న పాములా, మొహం దిగాలేసుకుని తిరుగుతుంటె 'ఏయె మంగా దిగులంతా నీ మొహంలోనే వుంది' అని ఒకరిద్దరు పలకరించబోతే వాళ్ళకి సమాధానం చెప్పలేక పోయిందామె. ఎలా చెప్తుంది? మనసంతా మబ్బుపట్టిన ఆకాశంలా నిండివుంది అది ఏక్షణంలో అయినా కన్నీటి రూపంలో బైటికి దూకడానికి సిద్ధంగావుంది.

పుట్టి బుద్దెరిగాకా ఎప్పుడూ దేవుణ్ణి మనస్ఫూర్తిగా తలుచుకోని మంగ ఆరాత్రి మంచంమీద కూర్చుని రెండు చేతులూ జోడించి 'ఎంకన్నబాబూ నా మొగుడు తిరిగి ఇంటికొచ్చేలా చెయ్యి, అలా చేస్తినా, నీ కొండ కొస్తాను, నా తల నీలాలు సమర్పించుకుంటాను, కొంగు ముళ్ళేసుకుని ఇద్దరం నీ గుడిచుట్టూ పదచ్చినం చేస్తాము' అని పదేపదే దణ్ణం పెట్టుకో సాగింది.

ఈరిగాడు ఆరాత్రి వెళ్ళిపోతున్నా అని బైటపడ్డాడు కాని ఇవతల కొచ్చేసాకా ఎక్కడకెళ్ళాలో చప్పున తోచలేదు. ఆరాత్రి పునుకులంత ఇంటి అరుగుమీద పడుకున్నాడు. కాకులు కావ్ కావ్ మనగానే లేచి రోడ్డు పుచ్చుకున్నాడు. చీకటి రేఖ లింకా విడిపోలేదు. మెలకువ వచ్చినా బద్ధకం తీరక జనం యింకా నిద్రమంచాల మీదే వున్నారు. ఈరిగాడికి మంగ మొగుడిగా బతకడం ఇష్టంలేదు. ఎక్కడైనా దూరంగాపోయి బాగా డబ్బు సంపాదించాకే తన పిల్లల్ని తీసుకుపోవాలని వుంది మనసులో. పిల్లలు గ్నాపకం వచ్చి మనసు కలవరపడింది. 'పిల్లలు తనకోసం ఏడుస్తున్నారేమొ? తను కనిపించక బెంగ పెట్టుకుంటారేమొ?' అని రెండురోజులు పోతే అన్ని బెంగలూ పోతాయి అని సమాధానం చెప్పుకున్నాడు; అడుగులు బరువుగా పడుతున్నాయి 'మరి బస్తీకేనా ప్రయాణం' అంతరాత్మ ప్రశ్నించింది తీక్షణంగా. అవును అక్కడికే, అక్కడైతే నాలుగురకాల పనులూ దొరుకుతాయి. ఇక్కడేముంది? మట్టి, బురద ఇదేగా అక్కడైతే కాఫీ ఒటేళ్ళు, మిల్లులు, సినిమా హాళ్ళు, ఒకటేమిటి అనేకరకాల వృత్తులు వున్నాయి చేసుకోవాలేగాని, ధీమాగా చెప్పుకున్నాడు అంతరాత్మకి. కాని అక్కడా పనులు అంత సులభంగా దొరకవని పాపం ఈరిగాడికి తెలియదు. బస్తీ, బస్తీ అనుకోవడమే గాని ఆ బస్తీలు

# విడని బంధాలు

ఎక్కడ వుంటాయో ఎలా వుంటాయో, మూడుపదులు దాటినవాడి కన్నుకు తెలియదు. బస్తీలంటె ఎడాపెడా మేడలు, మిద్దెలతో, కోటలతో నిండి అందంగా భూలోక స్వర్గంలా వుంటుందని వాడి వుద్దేశ్యం. వాడిజన్మలో ఎప్పుడూ రైలు బండి గాని, బస్సుగాని ఎక్కి ఎరుగడు. బెజవాడ ఏ మూలుందో, రాజమండ్రి ఎక్కడో ఏ బండెక్కితే ఏవూరు వెళ్తుందోకూడా వాడికి తెలియదు. నోట్లో నాలుకుంటె వెళ్ళలేక పోతానా అన్నదే వాడి ధీమా. ఏ వూరెళ్తే మంచిదో అని ఆలోచించాడు కొంతసేపు. ఆ వూర్నించి ముగ్గురెళ్ళారు బస్తీలకు. ఒకరు రాజయ్యగారి పెద్దకొడుకు, అతను చాల పెద్ద వుద్యోగమే చేస్తున్నాడని ఆ వూరివాళ్ల నమ్మకం. రెండవవాడు భూషయ్యగారి చిన్నతమ్ముడు. అతను డాక్టరని, ఎంత గడ్డురోగమైనా సరే ఇట్టే తగ్గించి వేస్తాడని ప్రతీతి. ఇక మూడోవాడు చంద్రయ్య. అతను ఊళ్ళో వున్న పొలం, ఇల్లు తెగనమ్ముకుని, అదేదో వూరెళ్ళిపోయి అక్కడ పెద్ద హోటల్ పెట్టి వేలకివేలు సంపాదిస్తున్నట్లు చెప్పుకుంటారు ఆ గ్రామస్తులు. వరుసగా ఈ ముగ్గురూ జ్ఞాపకం వచ్చారు ఈరిగాడికి 'రాజయ్యగారి పెద్దబ్బాయి దగ్గరకెళ్తే మా వూరివాడే అనే అభిమానంతో పని చూపించకపోతాడా' అనుకున్నాడు. పోనీ చంద్రయ్య దగ్గరకెళ్తే 'మా ఒటేల్లో గిన్నెలు తోవు అంతకన్న పనేవిటి' అంటాడేమో. 'ఛీ, ఛీ, గిన్నెలు తోమనా ఇంత బతుకూ బతికి' చంద్రయ్య ఎదురుగావుండి అడిగినట్లు ఊహించుకున్న ఈరిగాడు రాజయ్యగారి పెద్దకొడుకు దగ్గరకే వెళ్ళడానికి నిశ్చయించు కున్నాడు. నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ స్టేషన్ చేరుకున్నాడు. రాత్రి తిండి తిననందున బోలెడుదూరం నడిచినందున కడుపులో ప్రేవులు ఆకలి ఆకలి అంటూ ఆరాటపడసాగాయి. రాత్రి మంగతో పోట్లాట పెట్టుకున్నా వస్తూ వస్తూ మంగబొట్టు పెట్లో పెట్టుకున్న అయిదు రూపాయలు తెచ్చుకున్నాడు గనుక స్టేషన్లో వున్న కాఫీ హోటల్లో దూరి పకోడీ ముక్కా తిని [illegible] కొచ్చిన ఈరిగాడికి ఎక్కడైనా కాస్సేపు నడుం వాల్చేస్తే గాని బండి ముందుకి నడవదనిపించింది.

ఆ స్టేషన్నిండా జనం, ఒకటే రణగొణ ధ్వని, హడావిడి. ఆ సందడికి దూరంగా, ఓ మూల, పైమీద గుడ్డ పర్చుకుని పడుకున్న ఈరిగాడికి కాస్సేపటికే గాఢనిద్ర పట్టేసింది. అలా ఎంతసేపు పడుకున్నాడో? ఎవరో కయ్యన ఏడ్చారు. నిద్రలోంచి ఉలిక్కిపడి లేచాడు వాడు. తను పట్నంపోయే వుద్దేశ్యంతో అక్కడ కొచ్చినట్లు, మస్తుగా తిని నిద్రపోయినట్లు ఏమీ జ్ఞాపకం లేదు. ఇంట్లో పడుకున్నవాడు ఇక్కడ కెలా వచ్చాడా అని మొదట చాల కంగారు పడ్డాడు. కాస్సేపటికి మనసు కుదుటపడ్డాక మంగతో పోట్లాడి తనే ఇక్కడ కొచ్చినట్లు గుర్తు వచ్చింది. పొద్దు వాలిపోయింది. రైలుబండి వచ్చినట్లుగాని వెళ్ళినట్లుగాని జాడ కనిపించలేదు. ప్రయాణీకులంతా నిమ్మకు నీరెత్తినట్లు నిశ్చలంగా కూర్చుని వున్నారు.

'బండింకా రాలేదా?' ఓ వయసు మళ్ళిన వాడిని అడిగాడు ఆవలిస్తూ.

'ఏవూరు బోవాలె?' ఎదురుప్రశ్న వేసాడు ఆ వ్యక్తి.

'నేను ఏడకెళ్తే ఈనగారి కెందుకో' మనసులోనే విసుక్కున్న ఈరిగాడు టెంపరిగా చూస్తూ 'పట్నం పోవాలె' అన్నాడు దర్జాగ.

'ఈ రోజుల్లో డబ్బువున్న పతివోడూ పెద్దమనిషే అన్నట్లు హంగూ పొంగు గల వాళ్ళక్కే పట్నాలకిందే జమ, ఇంతకీ ఏ పట్నం పోతావు? ఇశాకపట్నమా? చెన్నపట్నమా?'

పేరు చెప్పడానికి నోరు తిరక్క తడబడ్తూ 'అదే ఆ పట్నమే' అన్నాడు ఈరిగాడు.

'చెన్నాపట్నమా' చెన్నపట్నం పోయే మొఖా నేనా అన్నట్లు వ్యంగ్యంగా నవ్వేడు అతను.

అడిగినదానికి జవాబివ్వకుండా అనవసరమైన ప్రశ్నలు వేసే ఆ ముసలాడి మీద ఎంతయినా కోపం వచ్చింది ఈరిగాడికి. ఇతన్నడిగి లాభంలేదని మరో అతన్ని అడిగాడు 'రైలుబండి రావడానికి

ఇంకా ఎంతసేపు పట్టనుందో'ని.

పై స్టేషన్‌లో గూడ్సుబండి పడి పోయిందట. అది తీస్తేగాని బండి రావడానికి వీలులేదు. అబ్బో అప్పుడే ఎక్కడ ఇంకా రెండు మూడు గంటలు పట్టొచ్చు' అని చెప్పాడతను. ఇంకా రెండు మూడు గంటలే ఎక్కడలేని నీరసమూ వచ్చేసింది ఈరిగాడికి. ఇల్లు విడిచిపెట్టి ఎప్పుడూ ఇంతసేపు వుండని కారణాన ఎన్నో యుగాలైపోయినట్లుంది మంగ, పిల్లలు, మనసులో దూరి అల్లరి పెట్ట సాగారు. మనసుని కుదుట పర్చుకోవాలని అక్కడనుంచి లేచి స్టేషనంతా కలయ తిరిగాడు. వూసలదండలు బేరమాడ్తుంటే పెద్ద పిల్ల రూపు కళ్ళల్లో కదలాడింది మరోచోటి కెళ్ళాడు. వో ఆడకూతురు ఇద్దరుపిల్లలు కూర్చుని వున్నారక్కడ 'అమ్మా అయ్యో ..' అని ఏడుస్తున్నది చిన్నపిల్ల. ఏడ్చేపిల్లను సముదాయించలేక పోతున్నది తల్లి. ఆపిల్ల ఏడ్పు అంతకంతకీ తారాస్థాయి నందుకుంటున్నది. 'వస్తాడు ఊకో' అని మాట మళ్లిస్తూ ఆ కబురూ ఈ కబురూ చెప్తున్నదావిడ. కాని ఆపిల్ల వింటే కదూ. మొదట కౌతుకంగా అటే చూసిన ఈరిగాడికి ఏడ్చేపిల్ల తన చిన్న కూతురుగా కనిపించినట్లయింది. తన కోసం పిల్లలు ఏడుస్తున్నారేమో? వాళ్ళని ఊర్కో పెట్టలేక అది వాళ్ళని చావబాదుతున్నదేమో? అందులో చిన్నపిల్ల తనకు బాగా మాలిమయ్యింది. తను కనిపించకపోతే ఎంతో ఏడుస్తుంది దాని ఏడ్పు మాన్పడం ఎవరి తరమూకాదు, తను దగ్గరవుంటే చాలు ఎంతేడ్చేదైనా టక్కున మాని నవ్వుతుంది పిచ్చిముండ తనకోసం ఎంత ఏడుస్తున్నదో? ఊళ్లో వాళ్ళు ఏదో అన్నారని పెళ్ళాంమీద కోపం పిల్లలమీద చూపెట్టడమేమిటి తన చాదస్తం కాకపోతే అదెలా పోతే నాకేం నాపిల్లలు సల్లగావుంటె చాలమ్మా, వాళ్ళకోసమైనా నేను వెనక్కి ఎళ్లిపోతాను. నాకు ఏ పట్నాలు వద్దు. కడుపుతో నీళ్లు కదలకుండా వున్న వూళ్ళో కన్నపిల్లల ఆటపాటలు చూస్తూ బతకడం కంటె నాకింకేం కావాలి? రకరకాల ఆలోచనలతో వాడి తల తిరిగిపోయింది. ఇక పట్నం పోవాలనే మోజు కూడా పోయింది. పిల్లలు. పిల్లలు ఎంత బెంబేలు పడిపోతున్నారో! వాడి కాళ్ళక్కడ నిలవలేక పోయాయి ఎవరో తరుముకొస్తున్నట్లు స్టేషన్లోంచి యివతలబడి యింటి ముఖం పట్టాడు ఈరిగాడు. చీమ చిటుక్కుమన్నా లేచి గుమ్మంలోకి ఆత్రంగా చూస్తున్న మంగమొగుడు పిల్లలా లోపలికి రావడంచూసి దిగులు తీరిపోయి సంతోషం పెనవేస్తుండగా 'కాళ్ళు కడుక్కో అన్నం పెడ్తాను' అంది మృదువుగా. ●



నాణెం వేస్తే కావలసిన డ్రింకులు ఇచ్చే మెషిన్.

# దీక్ష, దక్షతలకి మారు పేరు ఎన్.టి.ఆర్.

ఆంధ్రుల అభిమాన హీరో శ్రీ రామారావు వయస్సెంతో తెలుసా? 20 దాటి 21 లోకి ఆయన అడుగుపెట్టారు. 1949 లో సినిమారంగాన్ని ప్రవేశించిన రామారావు 20 సంవత్సరాల్లో 200 చిత్రాలను (కథానాయకుడి హోదాలో) పూర్తిచెయ్యడం గర్వించదగ్గ విషయం. ఈ రెండు దశాబ్దాల్లో రెండు శతాబ్దాల చరిత్రను సృష్టించారు. పుట్టినవాళ్లందరూ గట్టివాళ్లు కాలేరు; గట్టివాళ్లందరూ అందరికీ గిట్టేవాళ్లుగా వుండలేరు. అందుకే శ్రీ ఎన్. టి. ఆర్. తను చెయ్యదల్చుకున్న సత్కార్యాన్ని సాహసంగా, సగర్వంగా చెయ్యడం నేర్చుకున్నారు. మంచిపని చేసే వ్యక్తికి వ్యతిరేకత అడుగడుగునా వస్తూవుంటుంది. కానీ శ్రీ రామారావు దీక్షతో దక్షతతో అవితర సాధ్యమయిన కార్యభారాన్ని అనేకసార్లు మోసి, సెభాష్ అనిపించుకున్నారు.

## వెరైటీ హీరో

నటుడిగా శ్రీ రామారావు జానపద, పౌరాణిక, చారిత్రాత్మిక, సాంఘిక పాత్రలను ధరించి, వైవిధ్యమయిన నటనా ప్రతిభను అగుపరచి, మిమ్మల్ని మెప్పించారు. 'ఆజానుబాహువు, అరవింద దళాక్షుడు, స్వర్ణరూపి అయిన తారకరాముడు అన్ని పాత్రలకు సరిపోతాడు' అంటే మీకు అభ్యంతరం లేదనుకుంటా.



'మానవధర్మాన్ని ప్రదర్శించిన వ్యక్తి'.

## మానవత్వం

సినిమారంగానికి వచ్చిననాడు అలవాటు చేసుకున్న క్రమశిక్షణ, నిర్మాతల పరిరక్షణను (కాల్‌షీటుకు కరెక్టుగా రావడం. షెడ్యూలు ప్రకారం పిక్చర్ పూర్తి చెయ్యడం) ఇప్పటికీ శ్రీ రామారావు కాపాడుకుంటున్నారు. 'మనదేశం' చిత్రం ద్వారా వెండితెరకు పరిచయమయిన యీ సినిమానాయకుడు మనదేశం క్లిష్టపరిస్థితిలో వున్నప్పుడుచేసిన సేవ, త్యాగం ఇతడ్ని ప్రజానాయకుడ్ని చేసిందనే చెప్పాలి. ప్రజలమధ్యకువెళ్లి, జోలెపట్టి, కొన్నిలక్షల ద్రవ్యాన్ని బాధిత కుటుంబాలకు అందచేసి మానవధర్మాన్ని చూపెట్టి ఎన్. టి. ఆర్. 'శభాష్‌రాముడు!' అనిపించుకున్నారు.

నిర్మాతలకు కల్పవృక్షంగా, సాటివారికి అన్నయ్యగా, నటులకు ఆదర్శంగా పరిశ్రమకు ప్రయోజనకారిగా, ప్రేక్షకులకు ఆరాధ్యనాయకునిగా విలసిల్లే శ్రీ రామారావును 'జగదేకవీరుడు' అనడం నిజం.



జోలె పడుతున్న సినిమా నాయకుడు ఎన్. టి. రామారావు.

## టూరిస్టుల సందడి

ప్రతిరోజూ ఎన్. టి. ఆర్. యింటి ముందు కనీసం పది టూరిస్టు బస్సులయినా వుదయం ఆరుగంటలనుండి నిలబడి వుంటాయి. తిరుపతికి వెళ్లి వచ్చిన యాత్రీకులు వెండితెర వెంకటేశ్వరుడి దర్శనం చేసుకోకుండా వెళ్లడం అరుదు. శ్రీ రామారావుకూడా తన్ను చూడవచ్చిన అభిమానులను చిరునవ్వుతో ఆహ్వానించి, కుశలప్రశ్నలు అడిగి, తియ్యటిమాటలతో సత్కరిస్తున్నారు.

## నాకు తెలిసిన మీ నాయకుడు

కపటం తెలియని వ్యక్తి! వంచన చెయ్యలేని వ్యక్తి! నమ్ముకున్న వాళ్లను రక్షించే వ్యక్తి! మాట తప్పలేదు! తప్పు మాటాడలేదు. మనసు నొప్పించలేదు! సొగసుగా ఒప్పించగలడు! పరిశ్రమలో ప్రముఖవ్యక్తి! ప్రజల అనురక్తిని సంపాదించిన ఉన్నత వ్యక్తి! మన నందమూరి 'కారణజన్ముడు' అంటే తప్పా?

—శ్రీనివాస్ ●



"శ్రీకృష్ణవిజయము"లో హేమమాలిని

# నాగేశ్వరరావు ఇంట్లో గృహప్రవేశానికి వాణిశ్రీ పాట!

## సినిమా

హీరో నాగేశ్వరరావు కొత్తయింట్లోకి అడుగు పెట్టారు. గృహప్రవేశానికి ప్రముఖులనేకులు విలువయిన బహుమతులతో వచ్చి హీరోగారికి తమ శుభాకాంక్షలను అందచేసారు క్యారెక్టరు నటుడు ఎస్వీ రంగా రావు, నేటి బిజీ హీరోయిన్ వాణిశ్రీతో గృహప్రవేశ మహోత్సవానికి వచ్చారు హీరో అక్కినేనికి 'రోలెక్స్' రిస్టువాచీని ప్రెజెంట్ చేసారు. అతిథులకు నాగయ్య, రుక్మిణిగారు స్వాగతం పలికారు. రుక్మిణి వాణిశ్రీని ఒకపాట పాడమ్మా అనికోరింది. వాణిశ్రీ యిలా పాడసాగింది.

'ఈ చల్లని లోగిలిలో
ఈ బంగరు కోవెలలో
ఆనందం నిండాలి
అనురాగం పండాలి.'

అంటూ వాణిశ్రీ కమ్మగా పాడుతుంటే, యిల్లంతా పన్నీటి జల్లులతో నిండిపోయింది. ఆనందాతిశయంతో వాణిశ్రీ యింకా పాడసాగింది. ఏమనో తెలుసా?

శుభముల నొసగే ఈ మందిరము
శాంతికి నిలయం కావాలి
లక్ష్మి సరస్వతి పొందికగా
ఈ యింటను కాపురం వుండాలి.

గృహప్రవేశానికి వచ్చిన ముత్తయిదువులందరూ 'చాలా బాగుందమ్మా' అని మెచ్చుకున్నారు. హీరో అక్కినేని గృహప్రవేశం ఎప్పుడు జరిగింది? ఎక్కడ జరిగింది? అని మీకు తెలియాలిగా. ప్రొడ్యూసర్స్ కంబైన్స్ నిర్మిస్తున్న 'శ్రద్ధారమ్మాయిలు' చిత్రానికిగాను జెమినీ స్టుడియోలో 'నూతన గృహప్రవేశం' జరిగింది. పై పాటను దాశరథి వ్రాయగా, మహదేవన్ సారథ్యంలో సుశీల పాడింది. ఈ కలర్ చిత్రానికి ఎన్. ఆర్. పుట్టన్న దర్శకుడు.

'శ్రద్ధారమ్మాయిలు' చిత్రానికి డి. వి.



'ఆడజన్మ'లో వాణిశ్రీ



"చిట్టి చెల్లెలు"లో గీతాంజలి, పద్మనాభం, రేలంగి

## సినిమా

వీరసరాజు మాటలను, మారుతీరావు ఛాయను, మహదేవన్ సంగీతాన్ని నిర్వహిస్తున్నారు. ఈ చిత్రాన్ని డైరెక్టు చేసిన ఎస్. ఆర్. పుట్టన్న కన్నడ రంగంలో టాప్ డైరెక్టరుగా ప్రకాశిస్తున్నాడు. ఈ చిత్రంలో వాణిశ్రీ ద్విపాత్రాభినయం చేసింది. హీరోగా అక్కినేని, అతడి స్నేహితుడిగా శోభన్‌బాబు, ఎస్వీ రంగారావు, గుమ్మడి, నాగయ్య, రాజబాబు, అల్లు రామలింగయ్య, రుక్మిణి, సూర్యకాంతం, రమాప్రభలు ముఖ్యపాత్రధారులు. ఈ చిత్రానికి నవయుగా వారు పంపిణీదారులు.

## విధివ్రాత

హరనాథ్, విజయలకు పుట్టిన రోజారమణి పుట్టగానే తల్లిదండ్రులకు దూరమైంది. భగవంతుడు యీ పసిపాపను తిరుపతియాత్రకు వెళ్ళిన గుమ్మడి వశం చేసాడు. గుమ్మడిగారు పరమ సాత్వికుడు. రోజారమణిని పువ్వుల్లో పెట్టి పెంచుకుంటాడు. కానీ గుమ్మడిగారి పతి సూర్యకాంతం యీపాపను రాచి రంపాన పెడుతుంటుంది. విధివ్రాత తప్పింప ఎవరి వశం చెప్పండి. రోజారమణిని సూర్యకాంతం నిర్దాక్షిణ్యంగా బయటికి గెంటేసింది. దిక్కుమొక్కులేని రోజారమణి ఎక్కడికెళ్తుంది! ఎవరివి ఆశ్రయిస్తుంది? పాపం యీ పాపాయి ఏడుస్తూ రోడ్డు వెంబడి సాగిపోతూ వుంటుంది. ఆ పాపాయి దుర్భరపరిస్థితిని కవి శ్రీశ్రీ చిత్రించిన తీరు యిదిగో.

'బ్రతుకే వేదనగా
పగలే చీకటిగా
ఎవరూ నీకులేరు
ఒకరూ కలిసిరారు '

ఈపాటను జానకి భావగర్భితంగా జి. కె. వెంకటేష్ ఆధ్వర్యంలో పాడింది. దర్శకుడు బి. ఎస్. నారాయణ హృద్యంగా చిత్రీకరించారు. ఈ హృదయ విదారకమయిన సన్నివేశాన్ని మహావిష్ణు పిక్చర్స్‌వారి 'శ్రీదేవి'లో చూచిన ప్రతి ఒక్కరి హృదయం రోజారమణిపట్ల సానుభూతి కనపరచి తీరవలసిందే. ఈ చిత్రాన్ని ఆర్. ఎస్. నారాయణ నిర్మిస్తున్నారు. మాటలను బొల్లిముంత శివరామకృష్ణయ్య వ్రాసారు. ముఖ్యపాత్రలను హరనాథ్, కె. ఆర్. విజయ, గుమ్మడి, సూర్యకాంతం, రుక్మిణి, రాజబాబు, సంధ్యారాణి, అల్లు రామలింగయ్య, రోజారమణి, బ్రహ్మాజీలు పోషిస్తున్నారు.

## పవిత్రబంధం

1969లో మూడు హిట్ చిత్రాలక దర్శకత్వం వహించిన శ్రీ వి. మధుసూదనరావు 1970లో ఘరాక చక్కటి సాంఘిక చిత్రాన్ని ప్రేక్షక జనరంజకంగా డైరెక్టు చేసారన్న సత్యాన్ని అశోక్ మూవీస్‌వారి 'పవిత్రబంధం' చిత్రం విడుదలయితే మీరు ఒప్పుకుంటారు. ఆరుద్రగారి రచన, రాజేశ్వరరావుగారి సంగీతం, రామకృష్ణగారి ఛాయాగ్రహణం, సత్యంగారు కూర్పు నిర్వహించిన ఈ చిత్రాన్ని శ్రీ టి. గోవింద

## సినిమా డైరీ

● శ్రీకాంత్ ప్రొడక్షన్స్ సి. ఎస్. రావ్ గారి దర్శకత్వంలో నిర్మిస్తున్న చిత్రానికి "మారిన మనిషి" అని పేరుపెట్టారు. టైటిల్ పాత్రను శ్రీరామారావు పోషిస్తున్నారు.

● నవశక్తి ప్రొడక్షన్స్ సి. ఎస్. రావ్ గారి దర్శకత్వంలో నిర్మిస్తున్న చిత్రానికి "జీవితచక్రం అని పేరుపెట్టారు. ముఖ్యపాత్రలను రామారావు, వాణిశ్రీ, శారదలు ధరిస్తున్నారు.

● విజయలక్ష్మి మూవీస్ వారి "ఆడజన్మ" చిత్రం అనిల్‌ప్రభాస్ ఎంటర్‌ప్రయిజెస్ ద్వారా విడుదలవుతుంది. జమున, హరనాథ్ ప్రధానపాత్రలను పోషించిన యీ చిత్రాన్ని అయ్యన్‌మూర్తి డైరెక్టు చేసారు.

● ఆర్టు డైరెక్టరు చి. సౌ. మోహనకు తమిళనటుడు శ్రీ టి. ఎస్. బాలయ్య కుమారుడు చి. సాయికి వివాహం జరిగింది.

● ప్రొడ్యూసర్స్ కంబైన్, వారి "ఇద్దరమ్మాయిలు" షూటింగు జూలై 11న విజయ గార్డెన్స్‌లో జరిగింది. శ్రీ పుట్టన్న దర్శకత్వంలో వాణిశ్రీ, రాజ్‌బాబు నటించారు.

● రౌడీరాణి" షూటింగు వాహినీ స్టుడియోలో జూలై 10 నుండి 20 వరకు జరిగింది. శ్రీ కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో విజయలలిత, రాజబాబు, ప్రభాకరరెడ్డి, జ్యోతిలక్ష్మి, సత్యనారాయణ పాల్గొన్నారు.

రాజన్, ప్రతిభా టి. వి ఎస్. శ్రీ శాస్త్రి సహకారంతో నిర్మించారు. నవయుగ ద్వారా విడుదల కానున్న యీ చిత్రంలోని ప్రధానపాత్రలను నాగేశ్వరరావు, వాణిశ్రీ, కాంచన, పద్మనాభం, గీతాంజలి, నాగయ్య, కృష్ణంరాజు, రావికొండలరావు, పెరుమాళ్లు మరియు జి. వరలక్ష్మి పోషించారు.



"తల్లి తండ్రులు"లో చంద్రకళ

## వాణిశ్రీ కృష్ణల కొత్త చిత్రం

ప్రముఖ దర్శకులుగా విరాజిల్లుతున్న శ్రీ ఆదుర్తి సుబ్బారావు, శ్రీ వి. మధుసూదనరావులవద్ద సుశిక్షణ చేసిన పి.సి. రెడ్డికి ప్రప్రథమంగా డైరెక్టరు ఛాన్సు యిచ్చినది 'అనురాధ' చిత్ర నిర్మాత ప్రభాకరరెడ్డిగారే. మొదటిచిత్రం విడుదల గాకముందే శ్రీ పి. సి. రెడ్డికి మరో రెండుచిత్రాల డైరెక్షన్ రావడం ముదావహం. గతవారం ఆయన్ను మాతా పిక్చర్స్ ఆఫీసులో కలిసాను. అప్పుడే ఆయన మాతాపిక్చర్స్ అధినేతలతో తిరుపతికి బయల్దేర బోతున్నారు. నన్నుచూచి, నాతో పదినిమిషాలు ముచ్చటించి ప్రయాణమయ్యారు. ఆయన దర్శకత్వం వహిస్తున్న చిత్ర వివరాలను చెప్పారు.

నందినీఫిలింస్ అనే నూతన చిత్ర నిర్మాణసంస్థ నిర్మించనున్న 'అత్తలూ—కోడళ్లూ' చిత్రానికి పి. సి. రెడ్డి దర్శకుడు. వాణిశ్రీ కృష్ణ నాయకీనాయక పాత్రలను ధరించే ఈ చిత్రంలోని ముఖ్య భూమికలను రేలంగి, సూర్యకాంతం, నాగభూషణం, మణిమాల, రాజబాబు అల్లు రామలింగయ్య, ఛాయాదేవి, మాడా వెంకటేశ్వరరావు, నిర్మల, కె. వి చలం పోషిస్తారు. శ్రీ నారాయణ సుబ్బరాయుడు, జె. ఎ. రామసుబ్బయ్యలు నిర్మించే ఈ పాంఫికానికి [illegible] రచనా విభాగాన్ని, మహదేవన్ సంగీతాన్ని, సత్యం కూర్పును, కృష్ణారావు శిల్పాన్ని నిర్వహిస్తారు. షూటింగు ఆగస్టు 26 నుండి ప్రారంభమవుతుంది.

## హీరోగా మాస్టర్ అక్కినేని

మాతా పిక్చర్స్‌వారు 'పెద్దలు మారాలి' అనెడి ప్రయోజనాత్మక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో మాస్టర్ అక్కినేని ( హీరో నాగేశ్వర రావుగారి అబ్బాయి ) ముఖ్య పాత్రను పోషించడం ఒక విశేషం. 'పెద్దలు మారాలి' కథను యిద్దరు పెద్ద దర్శకుల సతీమణులు వ్రాసారు. శ్రీమతి ఆదుర్తి + శ్రీమతి మధుసూదనరావుల కలం చిందించిన ఈ కథకు శ్రీమతి కె. రామలక్ష్మి సంభాషణలను సమకూరుస్తున్నారు చిత్రంలోని ప్రధాన పాత్రలను జమున, అంజలీదేవి, గీతాంజలి, బేబి పద్మిని, బేబి సావిత్రి, నిర్మల, లక్ష్మి.



'ఇద్దరమ్మాయిలు'లో వాణిశ్రీ, నాగేశ్వరరావు.

కాంతమ్మ; సంధ్యారాణి, పుష్పకుమారి, హరనాథ్, గుమ్మడి, రమణారెడ్డి, కూడా పోషిస్తున్నారు. ఈ చిత్రానికి వెంకటరత్నం ఛాయాగ్రహణాన్ని, సత్యం కూర్పును, గోపాలం, లీల సంగీతాన్ని, తోట శిల్పాన్ని నిర్వహిస్తున్నారు. ఇప్పటికి మూడు రీళ్ల చిత్రం పూర్తయింది.

## 'కథానాయకురాలు'గా వాణిశ్రీ

కథానాయకుడు వచ్చాడు. మిమ్మల్ని మెప్పించాడు; మీ అందరి ఆశీస్సులతో అందలమెక్కాడు. ఇప్పుడు 'కథానాయకురాలు' వస్తూంది. ఆమె ఎవరో కాదు. మీ అభిమాన హీరాయిన్ వాణిశ్రీ యే. ఎప్పుడు? ఎక్కడికి?

శ్రీ సర్వస్వతీ చిత్ర మీకు కొత్త కాదు. ఈ సంస్థ యిదివరలో ఒక చిత్రాన్ని నిర్మించింది. ఆ చిత్రం పేరు 'పంచకళ్యాణి దొంగల రాణి', ఇప్పుడు తమ ద్వితీయ ప్రయత్నమే 'కథానాయకురాలు' చిత్రనిర్మాణం. ఈ చిత్రానికి గిడుతూరి సూర్యం స్క్రీన్‌ప్లే, దర్శకత్వాన్ని నిర్వహించడమే కాక నిర్మాతల్లో ఒకరుగా వ్యవహరిస్తారు. మరొక నిర్మాతపేరు నల్లా వెంకట్రావు.

## సినిమా

ఈ చిత్రానికి రెంటాల గోపాల కృష్ణమూర్తి మాటలను, లాల్ ఛాయను, ఎ. ఎ. రాజా సంగీతాన్ని నిర్వహిస్తారు. ఆగస్టు 5 నుండి షూటింగు ప్రారంభమయ్యే యీ చిత్రంలోని ముఖ్యపాత్రలను శోభన్‌బాబు, నాగభూషణం, విజయలలిత, రాజబాబు, అల్లు రామలింగయ్య, ఛాయాదేవి, పెరుమాళ్లు ధరిస్తున్నారు.

## హిందీలో విచిత్రకుటుంబం

తెలుగులో విజయవంతంగా ప్రదర్శింపబడ్డ 'విచిత్రకుటుంబం' చిత్రాన్ని శ్రీ వి. కె. పి. మధుకువల్లి (తెలుగు చిత్ర నిర్మాత) హిందీలో నిర్మించడానికి నిశ్చయించారు. హిందీ ప్రేక్షకులకు వలసిన మార్పు చేర్పులను భమిడిపాటి (కథలో అక్కడక్కడ) చేసినట్లు, సంభాషణలను రాజేంద్రకిషన్ సమకూరుస్తున్నట్లు నిర్మాత వెల్లడించారు. హిందీ చిత్రాన్ని శ్రీ తాతినేని ప్రకాశరావు డైరెక్టు చేస్తారని, ముఖ్యభూమికలను మేటి హిందీ బాక్సాఫీస్‌తారలు ధరించగలరని, షూటింగు సెప్టెంబరునుండి మద్రాసులో ప్రారంభమవుతుందని చెప్పారు. తెలుగు చిత్ర నిర్మాణం కూడా ఆషాఢమాసం పోనే ప్రారంభం అవుతుందని వ్యక్తపరిచారు. తెలుగుచిత్రానికి భమిడిపాటి మాటలను, నారాయణరెడ్డి పాటలను వ్రాయగలరట.

## మీకు తెలుసా?

జపాన్‌లోని ఒక పెద్ద కంపెనీ కొత్త 'లిఫ్టు' నొకదాన్ని తయారు చేసింది. ఎవరు ఈ లిఫ్టుదగ్గరికి వచ్చి నిలబడినా, 'లిఫ్టు' తలుపులు తమంతట తామే తెరుచుకుంటాయట. ఎక్కిన వెంటనే వాటంతటవే మూసుకుంటాయట.

మద్రాసులో శివాజీ అభిమాన సంఘ సభ్యులు పచ్చకామెర్లకు మందు ఉచితంగా యిస్తుంటే, ఎం.జి.ఆర్ అభిమానులు ఎముకలు విరిగినవారికి ఉచితవైద్యం చేస్తున్నారు.

## తెలుగు రంగానికి మరొక నిర్మాత

తెలుగు చిత్రరంగానికి మరొక కొత్త నిర్మాత వచ్చాడు. ఆయన పేరు అట్లూరి శేషగిరిరావు. శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్ స్థాపించి 'రౌడీరాణి' అనెడి వాడియా వారి వాడియా బ్రాండ్ చిత్రాన్ని ప్రారంభించారు. 40 రోజుల్లో ఇన్‌డోర్ షూటింగును పూర్తిచేసి ఈనెల 22వ ఏర్కాడుకు అవుట్‌డోర్ దృశ్య చిత్రీకరణకై వెళ్లారు. టైటిల్ పాత్రను విజయలలిత ధరిస్తుంది. చిన్నతనంలో తన తల్లిదండ్రులను పొట్టన పెట్టుకున్న నల్గురు బందిపోటు దొంగలను ఆచూకీ తీసి, వాళ్ల అంతం చూడడమే తన ధ్యేయంగా పెట్టుకుని, రివాల్వరు షూటింగు, కత్తిసాము, గుర్రపుస్వారీ, జూడో ఫైటింగులో సుశిక్షితురాలైన 'రౌడీరాణి'గా విజయలలిత వీరోచితంగా నటిస్తూంది. 'రౌడీరాణి' చిత్రం ఈమెకు ఈ చిత్రదర్శకుడు కె.ఎస్.ఆర్.



"బాలరాజు కథ"లో మిక్కిలినేని హేమలత, మాస్టర్ ప్రభాకర్



'అల్లుడే మేనల్లుడు'లో విజయనిర్మల.

దానుకు ప్రత్యేక మార్కెట్టును కల్పిస్తుంది. శ్రీ ఎ. పూర్ణచంద్రరావు అధ్వర్యంలో నిర్మితమయ్యే ఈ చిత్రంలోని ప్రధానపాత్రలను సత్యనారాయణ, రాజబాబు, ప్రభాకరరెడ్డి, పహిల్వాన్ కాంతారావు, త్యాగరాజు, జ్యోతిలక్ష్మి, (ధూళిపాళ, రావికొండలరావు గెస్టు పాత్రధారులు) బ్రహ్మజీలు పోషిస్తున్నారు. 'మరో ప్రపంచం'లో నటించిన విజయచంద్ర ఈ చిత్రంలో హీరోగా నటిస్తున్నాడు. ఈ చిత్రానికి కన్నప్ప ఛాయాగ్రహణాన్ని, సత్యం సంగీతాన్ని, విశ్వప్రసాద్ సంభాషణ విభాగాన్ని నిర్వహిస్తున్నారు.

## చెప్పేదొకటి చేసేదొకటి

చిత్రపరిశ్రమలో నిర్మాత చెప్పేది ఒకటయితే, చేసేది మరొకటవుతూ వుంది. ఫలానా సెట్టుకు ఏమేమికావాలి, ఎంత డబ్బు ఖర్చవుతుంది, ఎలా వుంటే బాగుంటుంది అని నిర్మాత ఒక ఆర్టు డైరెక్టరును అడగడం జరిగింది. దర్శకుడు, కళాదర్శకుడు, నిర్మాత కలిసి కూర్చుని ఒక నిర్ణయానికి రావడం జరిగింది. తీరా ఆ నిర్మాత ఏదో అర్జెంటు పని మీద బయటివూరుకు వెళ్ళాల్సివచ్చింది. అదే తరుణంలో బాధ్యత వహిస్తున్న ఆ కళాదర్శకుడు నిర్ణయానికి విరుద్ధంగా సెట్టును నిర్మించమని తన సహాయకులను చెప్పి, తను కూడా ప్రయాణం కట్టాడు. పాపం! ఆ నిర్మాత స్టుడియోకి వచ్చి, 'సెట్టు'ను చూసి నిర్ఘాంతపోయాడు. ఆ సెట్టుకు అంత ఖర్చు అనవసరమని నిర్మాతకు మాత్రమే గాక చూసిన ప్రతివ్యక్తికీ అనిపిస్తుంది. ఒకరి అలవాటు మరొకరి అగచాట్లకు కారణమవుతూంది. ఎవరు ఏం చేసినా కష్టాన్ని అనుభవించేది నిర్మాతేగదా. నిర్మాత పదికాలాలపాటు వుంటేనే, పరిశ్రమ 'నిత్యకళ్యాణం—పచ్చ తోరణం'గా విరాజిల్లుతుంది. ఈ సత్యాన్ని ఎవ్వరూ కాదనలేరు.

## తెలుగు చిత్రాన్ని నిర్మిస్తున్న హిందీ నిర్మాత

హిందీలో దిగ్విజయయాత్ర సాగిస్తున్న 'దోరాహా' చిత్రాన్ని హిందీ నిర్మాత శ్రీ రాజ్‌ఖోస్లా తెలుగులో నిర్మించడానికి నిర్ణయించారు. హిందీచిత్రం ప్రస్తుతం 'సిల్వర్‌జూబ్లీ'లు పలుకేంద్రాల్లో జరుపుకుంటూ వుంది. ఈనెలాఖరులో దర్శక నిర్మాత రాజఖోస్లా మద్రాసుకువచ్చి నటీనటులను నిర్ణయిస్తారని తెలుస్తూంది.

*　　*　　*

హిందీనటుడు రాజేష్‌ఖన్నా యిటీవల నటించిన ప్రతి చిత్రం హిట్ అయింది. అతని మార్కెట్టు ఎవరెస్టు శిఖరాన్నందుకుంది. ఈ సంతోష సమయంలో భగవంతుడు ఈ యువనటుడి తండ్రిని పొట్టన పెట్టుకున్నాడు. 'విధి బలీయమైంది'. వీరి తండ్రి చునీలాల్ ఖన్నా జూలై 17వ కామెర్లవ్యాధితో మరణించారు. శ్రీ చునిలాల్‌కు 65 సంవత్సరాలు.

*　　*　　*

హిందీనటుడు మనోజ్ కుమార్ 'ఉపకార్' చిత్రాన్ని నిర్మించి, ఆ చిత్ర దర్శకునిగా గొప్ప పేరును సంపాయించాడు. ఇప్పుడు 'పూరబ్ అవుర్ పశ్చిమ్' చిత్రాన్ని పూర్తి చేసారు. ఈ చిత్రంలో భారతి కథానాయికగా నటించింది. ఈచిత్ర నిర్మాణం కాగానే 'కర్మయోగి' చిత్రాన్ని నిర్మిస్తారట. ఈ చిత్రం అత్యంతం అవుట్‌డోర్‌లో చిత్రీకరించబడుతుందట.

—శ్రీనివాస్ ●



'అగ్నిపరీక్ష'లో కృష్ణ, జి. రామారావు.

**చిత్రసమీక్ష:**

# అగ్నిపరీక్ష

ఒక సినిమాకథఅంత సహజంగా నిజజీవితం సాగదు, నిజ జీవితమంత సహజంగా చిత్రీకరణ సాగదు అని తెలుగు ప్రేక్షకులకి తెలియకపోదు!

నటీనటుల నిజజీవితాన్ని చిత్రాలలోని పాత్రల స్వభావాలతో బేరీజు వేస్తున్న రోజులలో పద్మాలయ మూవీస్‌వారు 'అగ్నిపరీక్ష'కు నిలబడ్డారు. ఈ పరీక్షలో విజయం పొంది నటనకీ నిజజీవితానికీ వున్న దూరాన్ని కొలిచిచెప్పిన నాడుగాని మన చిత్రపరిశ్రమ భవిష్యత్తు ఏమిటో బోధపడదు!

బురదలో పుట్టినంత మాత్రాన పద్మం గౌరవం ఎక్కడ చెడింది? వ్యక్తిగతమైన సంస్కారాన్ని పరిసరంగాని పుట్టిన వాతావరణంగాని మార్చలేదని—ఉదాహరణగా, వేశ్యకుటుంబంలో పెరిగిన ఒకస్త్రీ కథని సర్వజనామోదంగా చిత్రీకరించి నిజానిజాలను కళ్ళకు కట్టినట్టు చూపించారు పద్మాలయా మూవీస్‌వారు

అయితే, వేశ్యగా ముద్ర వేసుకున్న మానాభిమానాలుకల ఒక స్త్రీని పెళ్ళి చేసుకుని సంఘంలో నిలద్రొక్కుకోవడం ఎంతకష్టమో కూడా ఈ చిత్రం నిరూపిస్తుంది. సీతామ్మవారికే అగ్నిపరీక్ష తప్పలేదు, సామాన్యయువతి అనగా ఎంత? అనే ప్రశ్నకూడా విసిరి ఆనందకరంగా ముగిసే ఈ చిత్రం స్త్రీలను విశేషంగా అలరిస్తుందని వేరే చెప్పక్కర్లేదు!

మూలం తమిళంలో 'ముత్తుచిప్పి' అయినప్పటికీ తెనుగుతనంతో నిండుగా శోభిల్లే ఈ చిత్రంలో కథానాయికగా విజయనిర్మల ప్రతిభావంతమైన నటన చూసితీరవలసిందే, మనస్సున్న ప్రతి మనిషినీ ఆమె నటన కదిలిస్తుంది. అలాగే కథానాయకుడుగా కృష్ణ నటన తారస్థాయి నందుకుని మరింత ఉజ్వల భవిష్యత్తుకు సోపానాలు నిర్మించుకున్నవి గుమ్మడి పాత్ర చిన్నదైనప్పటికీ గంభీరమైన భావప్రకటనతో పాత్రని దిద్ది కథని లోపరహితం చేశారు. పద్మనాభం, రాజ్‌బాబుల హాస్యం మోతాదు మించినా ఒక రకం ప్రేక్షకులను బాగా మెప్పిస్తుంది హాస్యంలోనే ప్రాముఖ్యమున్న పాత్రకి పద్మనాభం జీవం పోశారు. నాగభూషణం విలయినీ చిత్రాన్ని రసభరితం చేసింది. మిగతా ముఖ్యపాత్రలని అంజలీదేవి, ఛాయాదేవి, ఎల్. విజయలక్ష్మి, ముక్కామల, అల్లురామలింగయ్య, జి. రామారావు మొదలైనవారు పోషించారు.

ఆదినారాయణరావు సంగీతం చిత్రానికి మంచి శోభ కూర్చింది. కె. వరప్రసాదరావు దర్శకత్వంలో చిత్రం రమణీయంగా రూపొందింది. వి. యస్. ఆర్. స్వామి కెమెరావర్కు ప్రశంసనీయంగా వుంది. జి. ఆదిశేషగిరిరావు నిర్మించిన 'అగ్నిపరీక్ష'ని కృష్ణ సమర్పించారు. సకుటుంబంగా చూసి ఆనందించతగ్గ ఈ చిత్రం శ్రీ ఫిలింస్ విడుదల.

—సికరాజు ●

**అవీ.. ఇవీ:**

## అభ్యుదయ కళాసమితి

ఇటీవల జంటనగరాలలో అభ్యుదయకళాసమితి అనే సాంస్కృతిక సంస్థకి శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ప్రారంభోత్సవం చేశారు. రవీంద్రభారతిలో జరిగిన ఈ సభకి హెచ్ ఎం టి. జాయింట్ జనరల్ మేనేజరు శ్రీ డి వి అప్పారావు అధ్యక్షత వహించారు. శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తి ఉపన్యసించారు [ఒ. వి]

## జీవితభీమాసంస్థ
## కొత్త ప్రజాసంబంధాల శాఖాధికారి

శ్రీ వి వి పట్నీ బొంబాయిలోని జీవితభీమా సంస్థ ప్రజాసంబంధాల శాఖాధికారిగా శ్రీ ఎస్ పి. నందా స్థానే పదవి స్వీకారం చేశారు శ్రీ నందా పదవి విరమణకు ముందు శలవులో వెళ్తున్నారు.

* * *

భరత్ హెవీ ఎలక్ట్రికల్స్ [రామచంద్రపురం] నాలుగు రోజులపాటు జరిగిన సాంస్కృతికోత్సవానికి గతనెల 22వ తేదిన చలన చిత్రనటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు ప్రారంభోత్సవం చేశారు. నాటి సభకు క్లబ్‌చైర్మన్ శ్రీ శేతురామన్ అధ్యక్షత వహించారు ప్రముఖ రచయిత శ్రీ చెర్వు ఆంజనేయశాస్త్రి సభలో ప్రసంగించారు ఆహూతులకు క్లబ్ ముఖ్యకార్యదర్శి శ్రీ పి పి. రావు స్వాగతం పలికారు. [ఒ. వి]

## ఆంధ్ర కళామండలి

దక్షిణరైల్వే ఉద్యోగుల ఆంధ్ర కళామండలి 'మత సాంప్రదాయ సాహిత్యము — ధూర్జటి శ్రీనాథుడు' అన్న విషయముపై దక్షిణ రైల్వే హెడ్ క్వార్టర్సు కాంటీన్‌హాలు (మద్రాసు) లో ఒక సభను ఏర్పాటు చేశారు. ఈ సభకి శ్రీ పాళ్య కృష్ణమూర్తి అధ్యక్షులుగా వున్నారు. డాక్టరు శ్రీ ఇల్లా రాధాకృష్ణశర్మ, శ్రీ ఆరుద్ర పై విషయముమీద సమగ్రమైన ఉపన్యాసాలు చేశారు. (ఒ. వి.) ●

# పుస్తకాలు

## వసుచరిత్రము

రామరాజ భూషణ విరచితము. ఎమెస్కో సంప్రదాయ సాహితి—2. శ్రీ రావూరి దొరసామిశర్మ పరిష్కృతము. శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి పీఠికతో—పాకెట్ సైజు 40 + 252 పుటలు. సాదా ప్రతి రూ 3లు. లైబ్రరీ ఎడిషన్ రూ4.75. ప్రకాశకులు—యం. శేషాచలం అండ్ కో., మచిలీపట్నం, మద్రాసు, సికిందరాబాదు.

తెలుగు పంచకావ్యాలలో వసు చరిత్రం ద్వితీయంగా లెక్కించబడుతున్నా, రచనా పాటవాన్ననుసరించి అద్వితీయమనే చెప్పవలసి ఉన్నది. భట్టుమూర్తి పెద్దనగారి శిష్యుడు కావడం వల్ల, మను చరిత్రను క్షుణ్ణంగా చదివి, తర్వాత కొంతకాలానికి —దాన్నిమించిన రచన చెయ్యాలనే సంకల్పంతో— ఎంతో కృషి చేసి, శ్లేషలనూ, శబ్దాలంకారాలనూ ఎక్కువగా చొప్పించి అపూర్వంగా వసు చరిత్రను రచించాడు. కథాంశం అత్యల్పమయినా, గ్రంథాన్ని చమత్కారాలయిన వర్ణనలతో నింపి కవి దీనికొక విశిష్టతను కూర్చి దీని అడుగుజాడల్లో కొన్ని 'పిల్ల వసు చరిత్రలు' వెలువడే అవకాశాన్ని కల్గించాడు. తెలుగులో చక్కని ప్రవేశం సంపాదించగోరే వారు దీన్ని తప్పక చదువుతారు.

నవ్యకవిత్వం మీదికి దృష్టి పోయిన ఈ కాలంలో కూడా సంప్రదాయ కవిత్వానికి ఆదరం లేకపోలేదు. నవ్యకవులు కూడా కొంత కవితా సామగ్రిని సంపాదించడానికికాని, వెనుకటి కవిత్వాన్ని విమర్శించడానికి కాని సంప్రదాయక కవిత్వాన్ని చదవ వలసినదే! జన సామాన్యానికి రెండూ సమానాలే! ఇప్పుడు ఈ ప్రాచీన ప్రబంధాలను వివిధ సంస్థలవారు ప్రకటిస్తున్నారు. అందరికీ అందుబాటులో ఉండేటట్లు మూలం మాత్రమే ప్రకటిత మవుతున్నది. అట్టి వాటిలో అందచందాలతో, చక్కని పీఠికా, పరిశీలనలతో ముద్దుగా ప్రకటించిన శేషాచలం కంపెనీవారి ప్రతి ఎంతో ఆకర్షణీయంగా ఉంటున్నది.

అతిప్రౌఢ ప్రబంధమైన వసుచరిత్రం వ్యాఖ్యాన సహాయ్యం లేకుండా అర్థమయేదికాదు. అందువల్ల యిదివరలో దీన్ని ప్రకటించిన వావిళ్లవారూ, ఆనంద ప్రెస్సువారూ చక్కని వ్యాఖ్యలతో ప్రకటించారు. అవి యిప్పుడు లభ్యములు కానున్నవి. ఎక్కువ కాల వ్యయాన్ని సహించని యీకాలంలో నయినా—ప్రతిపదార్థం కాకపోయినా భావార్థాన్నయినా గ్రహించడానికి కఠినపదాల అర్థాలూ, శ్లేషలూ ఉండడం అవసరం. మరో ముద్రణ జరిగినప్పుడు వాటిని కూడా చేరిస్తే మంచిది

ఈ వసుచరిత్రను శ్రీ రావూరి దొరసామిశర్మ గారు పరిష్కరించారు. వారు 'నివేదిక'లో చాలా ముద్రితాముద్రిత ప్రతులను సంప్రతించినట్లుగా చెప్పారు. ఇందు అప్పకవీయంలో గ్రహించిన పాఠాల చర్చ మాత్రం కానవస్తున్నది. శేషార్థాలతోకూడిన యీ ప్రబంధంలో పాఠాంతరాలకు ఎక్కువ అవకాశం లేకపోవచ్చు. ఇదివరలో ప్రకటితములైన

---

పిచ్చా - పాటి

## నిర్మాతల స్థితి మెరుగయ్యే దెన్నడు?

'ఏ నిర్మాతకీ లాభాలు రావటం లేదీరోజున!' అన్నారొక ప్రసిద్ధ దర్శక నిర్మాత ఈ మధ్య. 'లాభాలమాట దేవుడెరుగు! అసలు అవటమే కష్టంగా ఉన్న రోజులివి. ఇక సినిమాలు ఎలా తియ్యాలి? తీసి, ఏం బావుకుందామని—మానసిక వ్యథ తప్ప!' అన్నారాయన ఎంతో నిరాశా పూరితంగా.

'బడ్జెట్ పిక్చర్స్ తీసినా కూడా నష్టం వస్తోంది. ఆర్టిస్టుల ధరలతో బాటు వారి 'డిమాండ్స్' కూడా అధికంగా ఉంటున్నాయి. ఇప్పుడు మా చిత్రానికి మేకప్ మన్లకి పన్నెండువేల రూపాయలయింది. ఎనమండుగురు ముఖ్యమైన నటీనటులు చిత్రంలో వుంటే వారందరికీ తలో మేకప్‌మన్ ఉండాలంటారు. కంపెనీ మేకప్‌మన్‌ల చేత ఎవరూ చేయించుకోవటం లేదు. ఇలా యీ ఒక్క శాఖకే యింత యితే మరి మిగిలిన వాటికి ఎంతవుతుంది? ... డిస్ట్రిబ్యూటర్ యిచ్చేదేమో రెండున్నరలక్షలు! మూడున్నర—నాలుగు లక్షల మధ్య తీస్తేగాని బడ్జెట్ పిక్చర్స్ బ్రతకవు! బడ్జెట్‌లో తియ్యాలనుకుని ప్రారంభిస్తే తట్టుకోలేనంత అవుతోంది. ఏం చెయ్యాలో ఎలా తియ్యాలో తోచని సందిగ్ధంలో పడ్డాం' అన్నారు మరొక నిర్మాత, పరిశ్రమలో ప్రస్తుతం ఉన్న పరిస్థితుల్ని వివరిస్తూ.

నిజమే: నిర్మాణపు విలువలు పూర్వంలా లేవు. 50 నుంచి 75 శాతానికి పెరిగాయి. తెలుగు చిత్రానికి ఖర్చు పెరిగిన కొద్దీ నష్టమే వస్తుంది. మనది వైడ్ మార్కెట్ కాదు; హిందీ, తమిళ చిత్రాల్లా... ప్రొడక్షన్ కాస్ట్ వీలయినంతలో తగ్గించుకు తీస్తేనే నిర్మాత మిగల గలుగుతాడు... పరిశ్రమలో యిపుడు స్తబ్దత ఏర్పడింది. ఎవరూ అంత ఉషారుగా కనిపించటం లేదు.

* * *

ప్రొడక్షన్ కాస్ట్ పెరగటంతో పాటు — థియేటర్స్‌దగ్గర వసూళ్లు పడిపోవటం కూడా విడుదలయ్యే చిత్రాలకు నష్టం తెస్తున్నవి. 'ఆంధ్రప్రదేశ్‌లో లాటరీలు ప్రవేశ పెట్టడం వల్లనూ, ప్రొహిబిషన్ ఎత్తివెయ్యడం వల్లనూ చిత్రాల కలెక్షన్స్ 30 నుంచి 40 శాతానికి పడిపోయిన'వని ఈ మధ్య—ప్రముఖ నిర్మాత శ్రీ డి. వి. యస్. రాజు ఒక సభలో పేర్కొన్నారు.

కలెక్షన్ ఈవిధంగా పడిపోయి — ప్రొడక్షన్ కాస్ట్ ఆవిధంగా పెరిగిపోతే, యిక నిర్మాతల స్థితి మెరుగయ్యే దెన్నడు?

ప్రొడక్షన్స్ సెక్టర్ బాగా బలపడడానికీ, ఆరోగ్యవంతంగా ఉండడానికీ దక్షిణభారత చలనచిత్ర నిర్మాతలంతా ఏకమై ఒక పథకాన్ని రూపొందిస్తున్నట్లు తెలుస్తున్నది. ఈనెల 29న అన్ని స్టూడియోలు మూసివేస్తారుట! ఆరోజున స్టూడియోల యజమానులు, నిర్మాతలందరూ కలసి ఈ పథకం విషయమై చర్చలు జరుపుతారుట: ఆ చర్చలు దక్షిణభారత చలనచిత్ర వాణిజ్యమండలి భవనంలో జరుగగలవని వార్తలు!

ఈ చర్చల సారాంశం ఫలవంతమైతే పరిశ్రమకెంతో శ్రేయోదాయకం!

—మోహన్‌కుమార్.

# పుస్తకాలు

వాటిలో కంటే మంచి హితాలేమయినా లభిస్తే— వాటిని గురించి కూడా తెలిపితే బాగా ఉండేది

చక్కని ఆకృతితో మేలు కాగితంపై అందంగా ముద్రింపబడిన ఈ పుస్తకమునకు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి పీఠికా, శ్రీ బాలాంత్రపు నళినీ కాంతరావుగారి 'దీప్తి' దీప్తిని కూరుస్తున్నవి ఇంటింటి గ్రంథాలయంలో తప్పక చేర్చుకోదగిన గ్రంథం యిది

**జీవితం శాపమా?**

[నవల]: రచన — శ్రీ మైనేని వెంకట రత్నం. ప్రచురణ:— స్టూడెంట్సు బుక్ సెంటర్, విజయవాడ—2 వెల రు 2—50

వాన చినుకులు, చెదిరిన రూపం, క్షంతవ్యులు, దూరపుకొండలు, నీరెండలు, విముక్తి, దేశంకోసం అనే 7 కథల సంపుటి వానచినుకులు. సామాజిక దృక్పథంతో వ్రాసిన కథలివి. శైలి సరళంగా ఉన్నది వైవిధ్యం ఉన్నది కథలలో సార్వజనీనమైన అనన్యత ఉన్నది. కథను ముగించే పద్ధతిలో ఒక ప్రత్యేకతను చూపించాలనే యత్నం కనిపించుతుంది ఈ రచనలలో. 'ఐయామ్ ఎ బ్లడీ ఫూల్' [వాన చినుకులు] అన్న రావు పాత్రలోనూ, అర్థం అయ్యేటట్లు జాబు రాయడం చేతకాని [చెదిరిన రూపం] భాస్కరం పాత్రలోనూ 'మిమ్మల్ని బాధపెట్టి ఉంటాను. దానికి నన్ను నేను నిందించుకొనడం కన్నా చేయగలిగింది లేదు' అని [క్షంతవ్యులు] జాబు రాసిన నీరజ పాత్రలోనూ మానవత ఉన్నది. మానవత లక్ష్యం యేమిటి? మానవ శ్రేయస్సే కదా! కాలక్షేపం కోసం కాక ఒక లక్ష్యంతో వ్రాసిన కథలివి కొన్ని సమస్యల మీద పాఠకుని దృష్టినీ ఆలోచననూ కేంద్రీకరింప చేయడమే యీ రచయిత్రి లక్ష్యం.

ఈ కథ లన్నింటిలో 'దేశంకోసం' అనే కథ చాలా బాగున్నది. ఆ కథ శీర్షిక ఈ కథల సంపుటి శీర్షిక అయితే బాగుండేదని పించుతుంది.

రెండవ పుస్తకం 'జీవితం శాపమా?' ఒక నవల ఈ రోజులలో ప్రచురిత మవుతున్న చాలా నవలలో ఇదొకటి. వైవాహిక జీవితానికి పనికిరాని సుందరం జీవితం ఇతివృత్తం యీ నవలలో. ఇది చాలా మంచి ఇతివృత్తమే. అయితే 'నీకు స్త్రీ సౌఖ్యం పనికి రాదు' [9 వ పుట] అని డాక్టర్లు ఎందుకని నిర్ణయించారు? సుందరం స్నేహితుడు సుబ్బారావునూ, సుందరం వలచిన శాంతినీ చిత్రించిన తీరులో సుందరాన్ని రచయిత ఎందుకని చిత్రించ లేదు మరి! సంపన్నుడయిన సుందరం శాంతిని ప్రేమించి, పెద్దలను ఎదిరించి, వివాహం చేసుకుంటా డామెను. అంత ధయిర్యం చేసిన సుందరం మరి వైద్యం ఎందుకని చేయించుకో లేకపోయాడూ? తన వలచిన శాంతిని తన ప్రాణ స్నేహితుడు సుందరం పెండ్లి చేసుకున్నప్పుడు మరి సుబ్బారావులో సంచలన మేమీ కలగలేదా? కలిగితే మరి యేమి చేశాడూ? సుందరం మరణించిన తరువాత పెద్దలను ఎదిరించి శాంతిని సుబ్బారావు పెండ్లి చేసుకొనడ లో నాటకీయత ఉన్నది. ఇటువంటి రచనల లక్ష్య మేమిటి? **—వి. ఎస్. అవధాని.**

**రా జ రా జు**

ఎస్ సి— ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో అనర రత్నాలలో 8వ ప్రచురణ. శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి రచన పాకెట్ సైజు 232 పేజీలు వెల—2రూ. ప్రకాశకులు— యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాదు.

నాటకానికి సామాజికులను రసతన్మయులనుగా చెయ్యడమే ప్రయోజనం. అందులోని సంఘటనల యధార్థాలా? కావా? అందులోని చరిత్రాంశాల నమ్మదగినవేనా? అనే ప్రశ్నలక తావు ఉండదు. అందుచేతనే కాళిదాసాది మహాకవులు ఇతిహాస పురాణాదులను మార్చివేసి రసవంతాలైన దృశ్యాలను రచించారు. తెలుగులో ఒహుళ ప్రచారాన్ని పొందిన, వేదంవారి ప్రతాపరుద్రీయంలో చరిత్రకు ప్రాముఖ్యం ఇవ్వబడక పోవడానికి ఇదే కారణం కావచ్చును ఈ 'రాజరాజు' కూడా ఆ కోవక చెందినదే!

చిత్రాంగి సారంగధరుడు, రత్నాంగి మున్నువారు కల్పిత వ్యక్తులయినా విజయాదిత్యుడి తిరుగబాటుకు సారంగధరుడి వృత్తాంతంతో సంబంధం లేకపోయినా, ఈ కథాంశం నాటక రచనకు చాలా అనుకూలంగా ఉండడం వల్ల ఆ కథను తీసుకుని విజయాదిత్యు తిరుగుబాటు కారణం మార్చి శ్రీ శాస్త్రిగారు ఎంతో రసవంతంగా ఈ దృశ్య కావ్యాన్ని కూర్చారు.

గణపతిశాస్త్రిగారు చెప్పినట్లు— 'ఇది నాటకమే అయినా చారిత్రిక నవలలాగ ఎడతెగని ఔత్సుక్యం రేకెత్తిస్తుంది. శ్రీ శాస్త్రిగారు చెయ్యి తిరిగిన కథకులు కనుక కథా కథనంలోను, ఔచితీ పోషణలోను అలనాటి వ్యక్తుల సహజ స్వభావ చిత్రణంలోను తమ అపూర్వ నైపుణి వ్యక్తీకరించారు.

నన్నయ అరణ్య పర్వంలోనే నిలిచిపోవడానికి కారణం రాజరాజు ధర్మాతిక్రమణమే అని చెప్పుతూ భట్టారకుని ధర్మదీక్షనూ, తన్మూలంగా రాజరాజు యందు ఏర్పడ్డ నిర్లక్ష్య భావాన్నీ శ్రీ శాస్త్రిగారు చక్కగా పోషించారు. సారంగధరుడి ఉత్తమ శీలమూ, చిత్రాంగి దృఢనిశ్చయమూ చిట్టివీరన్న మంత్రాంగమూ, మహారుద్రయ్య కుటిలాలోచనలూ, స్వార్థపరత్వమున్నూ— ఇందులో ఎంతో నేర్పుతో చిత్రించబడి ఉన్నవి.

కథాంశం అతి స్వల్పమైనా చక్కని సంభాషణల మూలంగా పాఠకులను ఆకర్షించి రచన సాగించే వారిలో శ్రీ శాస్త్రిగారికి ఆయనే సాటి వారి యావజ్జీవం హోషామి, గూడ మారిన కొత్త రికం' మొదలైనవి దీనికి ఉదాహరణాలు వీరు కూర్చిన సంభాషణలు అభిప్రాయ గర్భితాలు! వాటిని గ్రహించడానికి ఒక్కొక్క చోట కొంచెం ఆలోచించవలసి కూడా వస్తుంది. అది వారి సంభాషణలోని హుందాక నిదర్శనం!

ఈ శతాబ్ది లోని పూర్వార్థంలోనేయిదిమొదట్లో పత్రికల్లోనూ, తర్వాత పుస్తక రూపంగానూ ప్రకటితమై ఆంధ్రుల అదరాభిమానాలను చూరగొన్నది. సాహిత్యవేత్తలు, సాహిత్య ప్రభువుల అయిన శ్రీ విక్రమదేవవర్మ గారికి అంకితమయింది. గాంధిక భాషా వాదులైన మహారాజాగారు వీరవ్యావహారికవాది అయిన శ్రీ శాస్త్రిగారి యీ గ్రంథం కృతిపొందడం వల్లనే దీని ప్రశస్తి వెల్లడి అవుతున్నది

ఇప్పుడు అలభ్యమయి ఉన్న యీ ఉత్తమదృశ్య రచనను సర్వాంగసుందరంగా— ఆకర్షణీయమైన త్రివర్ణ ముఖచిత్రంతోకూడా తయారుచేసి, తెలుగు వారందరికీ [ఆంధ్రులకేకాదు] అందిస్తున్న వివిధ వాఙ్మయ శాఖాప్రచారకులు శ్రీ శేషాచలం కంపెనీ వారు అందరికీ అభినందనీయులు

## తెలుగుసాహిత్యములో దేశికవిత

రచన: శ్రీ ఆర్వీయస్ సుందరం డెమ్మీ 156 పుటలు. వెల: 4 రూ., ప్రకాశకులు— మానస సరోవర ప్రచురణలు, కేరాఫ్ టి. యస్. రాధాకృష్ణయ్యగారు. 18/333 కాసుకేలవారి అగ్రహారం, నెల్లూరు

తెలుగు కవిత్వంలో మార్గ, దేశి భేదాల ప్రాచీన కాలం నుంచీ వినవస్తున్నాయి నన్నెచోడుడు మొదట యీ విభాగాన్ని పేర్కొన్నాడు కన్నడ భాషలో యీ పద్ధతి ప్రాచీనమైనది దాన్ని అనుసరించే యిది తెలుగులోకి కూడా వచ్చింది తెలుగులో సంస్కృత ఛందస్సును అనుసరించిన వృత్తాలు మార్గకవితకు సంబంధించిన వనీ మాత్రాగణాలను అనుసరించిన సీసము, గీతపద్యము, ద్విపద మొదలయినవీ గేయాలు, పదాలు ఈ జాతికి చెందినవే అనీ, యక్షగానాలూ, ఉదాహరణలూ, శతకాలూ, దండకాలూ దేశికత్వానికి చెందినవే అనీ రచయిత ఆశయం యక్షగానాల సంగతి అలా ఉంచి చూడగా —ఉదాహరణ వాఙ్మయమూ, దండకమూ దేశికవితలో చేరినవనడం కుదిరేటట్లు లేదు. తెలుగులో శతాకానికి మకుటపద్ధతి ఉంది సంస్కృత శతకానికది లేదు. దండకం ఉభయ భాషా సామాన్యం సామాన్యంగా ఇవి సంస్కృత వాక్యాలతోనే ముగుస్తాయి. కొంత వైలక్షణ్యం ఉండడంబట్టి యివి దేశికవిత్వంగా భావించబడి ఉండవచ్చు

తెలుగులో దేశికవిత్వాన్ని గురించి ప్రత్యేకంగా పరిశ్రమ చేసిన వారు కొద్దిమంది. వెలువడిన గ్రంథాలు కూడా చాలా తక్కువ దేశికవితను సంగ్రహించినవారు మాత్రం చాలా మంది వున్నారు పుష్కలంగా గేయ—పద వాఙ్మయం లభ్యమవుతూ ఉన్నందున వాటి పుట్టుపూర్వోత్తరాలను గురించిన పరిశీలన అవసరమే!

ఈ అవసరాన్ని గుర్తించి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు— దేశికవితా పరిశీలనానికి మంచి అవకాశమిచ్చి బహుమతిని ప్రకటించారు

యువకులూ, ఉత్సాహవంతులూ అయిన శ్రీ సుందరంగారు మిత్రుల ప్రోత్సాహంవల ఈ పరిశీలనకు పూనుకొన్నారు, వారి పరిశోధనకు ఫలితమే యీ గ్రంథం దీని రచనలో రచయిత డబ్బయికి పయిగా గ్రంథాలనూ, భారతి, పరిషత్పత్రిక, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు మున్నగువాటిని సంప్రతించారు. ఇట్టి విశిష్ట పరిశీలనవల్ల ఈ పుస్తకం పుష్టిగా తయారై, పారితోషికాన్ని సంపాదించుకున్నది

దేశిమార్గ భేదాలు, దేశికవితలోని ఛందోరీతులు, దేశికవితా పరిణామం, గేయ, ద్విపద, యక్షగాన, శతక, ఉదాహరణ, దండకాలను గురించి ప్రత్యేక ప్రకరణాలలో విసుగు కలిగించని రీతిని విషయం సంగ్రహించబడింది. ముద్రణ చాలా అందంగా ఉన్నది. దేశివాఙ్మయాన్ని గురించి తెలుసుకోవాలంటే ఈ గ్రంథాన్ని చదవడం అవసరం

—ఆంగీరస ●

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA

